# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 16 సంచిక : 7 హైదరాబాద్ 204 జూలై 2018 పేజీలు : 68 రు. 25

* ఆంధ్రప్రదేశ్ నాలుగేళ్ల పాలన ఎనిమిది వ్యాసాలు
* భూమి కోసం దళితుల హత్య
* రైతుకు చేరని రైతు బంధు పథకం
* నేరమవుతున్న ప్రజాస్వామిక ఉద్యమాలు
* తూత్తుకుడిలో ప్రజాపోరాటం
* అమెరికా - ఉత్తర కొరియా చర్చలు

ISSN 2231-6892

204

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూలై 2018
సంపుటి : 16
సంచిక : 7







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2018 జూన్ నెలలో వచ్చిన విరాళాలు -ఎ. మల్లయ్య, హైదరాబాద్ - రు. 2000; మైఖెల్, చెన్నై - రు. 3,000; ఎం. గంగాధర్, వరంగల్ - రు. 5,000; డి. నాగేశ్వరరావు, గుంటూరు - రు. 2.000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.***

*వీక్షణం గత మే, జూన్ సంచికలలో ప్రపంచ శ్రామికవర్గ సిద్ధాంతకర్త కారల్‌మార్క్స్ ద్వి శతజయంతి సందర్భంగా చాలా మంచి వ్యాసాలు వచ్చాయి. రచయితలకు అభినందనలు. ఈ 200 ఏళ్లలో ప్రపంచం చాలా మారింది, దోపిడి తప్ప. శ్రామిక వర్గం, ఆధునిక బానిసత్వంలో ఉంది. మార్క్స్ 'ది ఎస్సెన్స్ ఆఫ్ క్రిష్టియానిటీ' గ్రంథం చదివిన తరువాత తత్వశాస్త్రాలను పరిశోధించి ఆ క్రమంలో గతితార్కిక భౌతిక వాదాన్ని సమాజానికి అన్వయించాలన్నారు. "కమ్యూనిజం నాస్తికత్వంతో ప్రారంభమవుతుంది, కాని నాస్తికత్వమంటే కమ్యూనిజం కాదు. దైవ భావాన్ని నిర్మూలించే నాస్తికత్వం సైద్ధాంతిక మానవవాదం. సొంత ఆస్తిని నిర్మూలించే కమ్యూనిజం ఆచరణాత్మక మానవవాదం. అందుచేత నాస్తికత్వం, కమ్యూనిజం మానవుని వాస్తవమైన అస్తిత్వ సారాన్ని వ్యక్తీకరిస్తాయి." (ఎకనామిక్ అండ్ ఫిలాసాఫికల్ మానుస్క్రిప్ట్స్ ఆఫ్ 1844 పేజీ నెం. 98, 151) కాని పై అంశాన్ని ఎవరు రాయలేదు. నాస్తికత్వం పదం వాడకుండా మార్క్సిజం చెపుతున్నారు. ఎందుకు?*

**– తుంపాల శ్రీరామమూర్తి**
*గాజువాక, విశాఖ*

*వీక్షణంలో ఈ మధ్య కాలంలో వస్తున్న కొన్ని రచనలు చూస్తుంటే ఇది వీక్షణమేనా అని అనుమానం వస్తున్నది. ఒక ఉదాహరణ చెప్పాలంటే, మీరు జూన్ సంచికలో వేసిన చైనా పరిణామాలు – శాస్త్రీయ అధ్యయనం అనే వ్యాసాన్ని చెప్పుకోవచ్చు. మీరు అది చర్చ కోసమే వేసాము అని అంటారేమో గాని, చర్చ కోసమైనా సరే తప్పుడు అభిప్రాయాలు, కళ్లముందర కనబడే విషయాలను చూడనట్టు నటిస్తూ రాసిన వ్యాసాలు వేయవచ్చునా అని నా ప్రశ్న. చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులు కమ్యూనిస్టు పదజాలాన్ని ఎంత వల్లించినా, వారి పనులే వారికీ మార్క్సిజానికీ ఏమీ సంబంధం లేదని చూపుతున్నాయి. వారిని ఎవరన్నా మార్క్సిస్టులని పిలిస్తే వారికి కోపం వస్తుందేమో కూడా. ఇక డెంగ్ సియావో పింగ్ వ్యాఖ్యలు, పనులు ఆయనను పెట్టుబడిదారీ పునరుద్ధరణ మొనగాడుగా ప్రపంచానికి తెలియజెప్పాయి. కాని ఎం. కృష్ణఆదిత్య మాత్రం సోషల్ సామ్రాజ్యవాది చైనాలో సోషలిజాన్ని చూస్తున్నారు. పెట్టుబడిదారీ పునరుద్ధారకుడు డెంగ్‌లో మార్క్సిస్టు మహోపాధ్యాయుణ్ని చూస్తున్నారు. ఆయన అలా చూస్తే కూడా ఏమీ అభ్యంతరం లేదు. ఇంకా భూమి బల్లపరుపుగా ఉందని నమ్మేవారున్నారు. 1956లోనే సోవియట్ యూనియన్ దిక్కుమార్చినా, అతి త్వరలోనే సోషల్ సామ్రాజ్యవాదిగా మారిపోయినా సిపిఐ, సిపిఎంలు దాన్ని సోషలిస్టు దేశంగానే చూసి భజన చేసాయి. సోవియట్ యూనియన్ విషయంలో సిపిఐ, సిపిఎంల లాగ చైనా విషయంలో గుడ్డి భజన చేయటానికి ఆదిత్యగారికి పూర్తి స్వేచ్ఛ ఉంది. కాని వీక్షణంకు విచక్షణ లేదా అని నా ప్రశ్న.*

**– సి రాజకుమార్**
హైదరాబాద్

*వీక్షణం గత సంచికలో వచ్చిన 'ప్రభుత్వాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?' అనే వ్యాసం రాజ్యాన్ని ఎలా అర్థం చేసుకోవాలో మామూలు పాఠకుడికి కూడా అర్థమయ్యే రీతిలో ఉంది. వీక్షణం పాఠకులకు ప్రత్యేకంగా అందించిన వ్యాసాల్లో ఇది ఒకటిగా నేను భావిస్తున్నాను. ఈ వ్యవస్థ స్వభావాన్ని మూలాల నుండి అర్థం చేసుకోవడానికి తోడ్పడే విశ్లేషణతో కూడిన వ్యాసాలు మరిన్ని ప్రచురించి పాఠకుల అవగాహను మరింత సంపద్వంతం చేస్తారని కోరుకుంటున్నారు.*

**– తిరుపతి**
హుస్నాబాద్

*మార్క్స్ ద్విశత జయంతి సందర్భంగా వీక్షణంలో ప్రచురిస్తున్న వ్యాసాలు ఈ తరానికి మార్క్స్ జీవితాన్ని, కృషిని, ఇప్పుడున్న సమాజాన్ని మార్చడానికి మార్క్సిస్టు సిద్ధాంతం అవసరాన్ని తెలియజేస్తున్నవి. సమకాలీన అంశాలపై వస్తున్న వ్యాసాలు కొంత సమాచారయుక్తంగా ఉన్నా ఇతర పత్రికలు వెల్లడించని విషయాలను ప్రజల ముందుంచి ఆలోచింప జేస్తున్నాయి. క్షేత్రస్థాయిలో జరిగిన పరిశోధనా పత్రాలను ప్రచురిస్తే వాస్తవాలకు దగ్గరగా చూసినట్లవుతుంది. ఈ సమాచారాన్ని తీసుకుని వారి వారి అవగాహన కనుగుణంగా విశ్లేషించుకోవడానికి ఉపయోగపడుతుంది. ఈనాడున్న పరిస్థితులలో ఇలాంటి పత్రికను కాపాడుకోవాల్సిన బాధ్యత పాఠకులుగా ఆలోచనాపరులుగా అందరిదీ.*

**– భరత్**
ముల్కనూర్

## సవరణ

***జూన్ సంచికలో తెలంగాణ సంపాదకీయ వ్యాఖ్యలో గణాంకాల్లో విస్తీర్ణం హెక్టార్లు బదులు ఎకరాలుగా పొరపాటుగా అచ్చయింది. అందువల్ల రైతుబంధు నిధులు రెండున్నర రెట్లు తక్కువగా లెక్కించడం జరిగింది. ఈ తీవ్రమైన పొరపాటుకు చింతిస్తున్నాం. అయితే, ఈ అంకెల పొరపాటు జరిగినప్పటికీ సంపాదకీయపు స్ఫూర్తిలో తేడా లేదు.***

***మే సంచికలో 'చరిత్రాత్మక కమ్యూనిస్టు ప్రణాళిక' వ్యాసంలోని మొదటి పేరాలో కమ్యూనిస్టు ప్రణాళిక అచ్చయిన సంవత్సరం 1848 కి బదులు పొరపాటుగా 1948గా అచ్చయింది. రెండవ పేరాలో 1871 నాటి పారిస్ కమ్యూన్‌కు బదులు పొరపాటుగా 1971 అని అచ్చయింది.***

***పొరపాట్లకు చింతిస్తున్నాం. -సం***

### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# రాజ్యపు కుట్రల దుర్మార్గ, హాస్యాస్పద రూపాలు

వీక్షణం

రాజ్యం అత్యంత బలశాలిలా కనిపించినా వాస్తవంగా పిరికిగొడ్డు అనీ, ఎందరో ప్రజ్ఞావంతులను తన కొలువులో పెట్టుకుని అపారమైన తెలివితేటలున్నట్టు ప్రవర్తించినా వాస్తవంగా తెలివితక్కువ దద్దమ్మ అనీ చరిత్రలో ఎన్నోసార్లు రుజువైంది. నెలరోజులుగా దేశంలోనూ, మహారాష్ట్ర, చత్తీస్ గడ్, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ లలోనూ జరుగుతున్న పరిణామాలు, రాజ్యం ఆడుతున్న అబద్ధాలు, నాటకాలు, చేస్తున్న కుట్రలు ఆ విషయాన్నే మరొకసారి మరింత విచారకరంగా, హాస్యాస్పదంగా రుజువు చేస్తున్నాయి. ప్రభుత్వ దుర్మార్గానికి, దమననీతికి ఎందరో ప్రజా ఉద్యమకారులు జైలు పాలు కావడం, అక్రమ కేసుల్లో ఇరికించబడడం, అబద్ధాలు ప్రచారంలోకి రావడం విచారకరమే గాని, అంతకన్న ఎక్కువ హాస్యాస్పదంగా రాజ్యపు దుర్మార్గం, పిరికితనం, తెలివితక్కువతనం బైటపడుతున్నాయి. భారతీయ జనతా పార్టీ ప్రభుత్వాన్ని అపనిందల పాలు చెయ్యడానికి, ప్రధానమంత్రి మీద "రాజీవ్ గాంధీ తరహా చర్య" జరపడానికి మావోయిస్టులు కుట్ర పన్నినట్టు, ఆ కుట్రలో దళితులను భాగస్వాములను చేస్తున్నట్టు ఆధారాలతో ఉత్తరాలు దొరికాయని, అందులో భాగమే భీమా కోరేగాం ఆందోళన అని పాలకులు అంటున్నారు. ఈ ఆరోపణ మీద ఆధారపడి మహారాష్ట్ర పోలీసులు, కేంద్ర ప్రభుత్వం, దళారీ పెట్టుబడిదారీవర్గపు కార్పొరేట్ ప్రచార సాధనాలు ప్రజల పక్షాన నిలిచిన మేధావుల మీద ముప్పేటదాడి సాగించాయి, సాగిస్తున్నాయి. కాని పాలకులు చేస్తున్న ఈ దాడే అసలు కుట్ర అని, అది కార్పొరేట్ ప్రయోజనాల కోసం భిన్నస్వరాలను తొలగించే భారీ కుట్రలో భాగమని స్పష్టమవుతున్నది. ఈ దాడికి ఎంచుకున్న లక్ష్యాలు, ఉపయోగించిన పద్ధతులు, ఆధారాలుగా చూపుతున్న కల్పనలు అన్నిటికన్నీ అంతర్గత సాక్ష్యాలతోనే ఇదే పెద్ద కుట్ర అని చెప్పకనే చెపుతున్నాయి.

సంఘ్ పరివార్ స్వాభావికంగానే కమ్యూనిస్టులకూ, హిందూయేతరులకూ, దళితులకూ, ఆదివాసులకూ, శూద్రులకూ, సమాజంలోని భిన్నస్వరాలన్నిటికీ, బహుళత్వానికీ వ్యతిరేకం. సైద్ధాంతికంగానే అది హిందూ బ్రాహ్మణీయ ఫాసిజాన్ని అమలు చేయదలచుకుంటుంది. ఏకశిలాసదృశంగా పాలకవర్గ ఆధిపత్యం కొనసాగాలని అనుకుంటుంది. అందువల్లనే అది పుట్టిననాటినుంచీ ప్రణాళికాబద్ధంగా సమాజంలో వివిధ రంగాలలో వివిధ స్థాయిలలో విద్వేష రాజకీయాల్ని వ్యాపింపజేస్తున్నది. ఆయా ప్రజా వర్గాలను అణచివేయడానికి, వారి మీద దుష్ప్రచారం సాగించడానికి, హింసాకాండ జరపడానికి ప్రయత్నిస్తున్నది. సంఘపరివారంలోని రాజకీయ అంగమైన భాజపాకు, అందులోనూ తన జీవితమంతా సంఘ్ కార్యకర్తగా గడిపిన నరేంద్ర మోడీకి కేంద్రప్రభుత్వ అధికారం దక్కిన తర్వాత ఈ విద్వేష రాజకీయాల వ్యాప్తి మరింత దూకుడుగా సాగుతున్నది. మరొకవైపు ఏ శక్తుల మీదనైతే సంఘ పరివార్ కత్తులు దూస్తున్నదో ఆ శక్తులు క్రమక్రమంగా సంఘటితం అవుతున్నాయి, ఏకమవుతున్నాయి, విస్తరిస్తూ బలోపేతమవుతున్నాయి. ఈ ప్రజాశక్తుల సమీకరణ, ఐక్యత, విస్తరణ సంఘ పరివారానికి మరింత కన్నెర్ర అవుతున్నది. ఈ సామాజిక ఉద్యమ శక్తులను తొలగించడం, అణచివేయడం, దేశ వనరులను పూర్తిగా తమ గుప్పిట్లోకి తీసుకోదలచుకున్న బహుళ జాతి సంస్థల, కార్పొరేట్ శక్తుల వ్యాపార అవసరం. అలా సంఘ్ పరివార్ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక అవసరాలు, కార్పొరేట్ శక్తుల ఆర్థిక అవసరాలు కలిసి ఈ దేశపాలనలో ఒక విషరసాయనం తయారయింది. ఆ విష రసాయనపు దుష్ఫలితాలు గత నాలుగు సంవత్సరాల్లో దేశవ్యాప్తంగా అసంఖ్యాకంగా కనిపిస్తూనే ఉన్నాయి.

ఈ నేపథ్యంలోనే తాజాగా, మధ్య భారతంలో కార్పొరేట్ శక్తుల, వారి దళారీల ప్రవేశానికి, దోపిడీకి ఆటంకంగా ఉన్న మావోయిస్టులను అణచివేయడం, దేశవ్యాప్తంగా రోహిత్ వేముల వ్యవస్థాగత హత్య నాటి నుంచి జిగ్నేష్ మేవాని భూమి సమస్యను ప్రధానం చేసినంతవరకూ సంఘటితమవుతూ వస్తున్న దళిత శక్తులను బెదిరించడం అనే ద్విముఖ వ్యూహంతో సంఘపరివార్ శక్తులు కొత్త కుట్ర రచించాయి. బ్రాహ్మణ పీష్వాల దుర్మార్గ రాజ్యాన్ని ఓడించిన భీమా కోరేగాం యుద్ధపు 200 జయంతి సందర్భంగా 2017 డిసెంబర్ 31న పుణె లో శనివార్ వాడలో భీమా కోరేగాం శౌర్యదిన్ ప్రేరణా అభియాన్ అనే సంస్థ ఎల్గార్ పరిషద్ అనే బహిరంగ సభను నిర్వహించింది. ఈ బహిరంగ సభలో వందలాది దళిత, ఆదివాసి, క్రైస్తవ, ముస్లిం సంస్థలకు చెందిన అయిదు వేల మంది పాల్గొనగా, మాజీ న్యాయమూర్తులు పి బి సావంత్, బి జి కోల్సె, దళిత నాయకులు జిగ్నేష్ మేవాని, రాధిక వేముల, విద్యార్థి నాయకుడు ఒమర్ ఖాలిద్ తో సహా ఎందరో ప్రసంగించారు. ఆ మర్నాడు భీమా కోరేగాంకు వెళుతున్న దళిత యాత్రికుల మీద సంఘ్ పరివార్ మూకలు, శంభాజీ భిడే, మిళింద్ ఎక్బోటె నాయకత్వంలో దాడి చేసి విధ్వంసం సృష్టించాయి. ముగ్గురిని హత్య చేశాయి. ఆ విధ్వంసం మీద, హత్యల మీద ఎటువంటి కేసులు, విచారణలు లేకపోగా, శనివార్ వాడ సభ మీదనే కుట్రకేసు మోపారు. దానితో సంబంధం ఉన్నదనే పేరుతో ముంబై కార్మికులను అరెస్టు చేశారు. వారికి మావోయిస్టులతో సంబంధం ఉన్నదని ఆరోపించారు. కొనసాగింపుగా ఇప్పుడు పౌరహక్కుల న్యాయవాది, రాజకీయ ఖైదీల విడుదల కమిటీ ప్రధాన కార్యదర్శి సురేంద్ర గాడ్లింగ్, ఎల్గార్ పరిషద్ నిర్వాహకుడు, దళిత మేధావి సుధీర్ ధావ్లే, ఆదివాసి నాయకుడు మహేశ్ రౌత్, నాగపూర్ విశ్వవిద్యాలయ ఇంగ్లిష్ ప్రొఫెసర్ షోమా సేన్, రాజకీయ ఖైదీల విడుదల కమిటీ ప్రచార కార్యదర్శి రోనా విల్సన్ లను ఆ కేసులో ఇరికించారు. వారి దగ్గర దొరికాయని చెపుతున్న ఉత్తరాలలో ప్రకాశ్ అంబేద్కర్, జిగ్నేష్ మేవాని వంటి దళిత నాయకులతో మావోయిస్టులకు సంబంధాలున్నాయని, నరేంద్ర మోడీ హత్యకు పన్నిన కుట్రలో వరవరరావుకు భాగస్వామ్యం ఉన్నదని అబద్ధపు ఆరోపణలు గుప్పించారు, తప్పుడు ఉత్తరాలు సృష్టించారు. 2019 ఎన్నికల నాటికి ప్రజలను భయపెట్టడానికి, తన ప్రాణానికి ప్రమాదం ఉందని సానుభూతి సంపాదించడానికి, ఉద్యమకారుల మీద ఉక్కుపాదం మోపడానికి ఇటువంటి ప్రకటనలూ చర్యలూ ఎన్నో జరగబోతాయి. మోడీకి ఆదర్శమూర్తులైన ముస్సోలినీ, హిట్లర్లు సరిగ్గా ఇటువంటి పనులే చేశారు. జో హిట్లర్ కీ చాల్ చలేగా, వో హిట్లర్ కీ మౌత్ మరేగా అని కూడ చరిత్ర ఎన్నోసార్లు రుజువు చేసింది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# అబద్ధాల, అర్ధసత్యాల, అతిశయోక్తుల తెలంగాణ!

తెలంగాణ ప్రభుత్వం అబద్ధాల, అర్ధసత్యాల, అతిశయోక్తుల ప్రకటనల్లో ప్రపంచ రికార్డులను బద్దలు కొట్టడానికి కంకణం కట్టుకున్నట్టున్నది. గత ఏడెనిమిది దశాబ్దాలుగా సుప్రసిద్ధమైన గోబెల్స్ ప్రచారం అనే మాటను తొలగించడానికి కెసిఆర్ ప్రచారం అనే మాట రూపొందుతున్నట్టున్నది. ఒక అబద్ధాన్ని పదే పదే చెపితే అదే నిజమైపోతుందని అప్పటి గోబెల్స్ అన్నాడు. అబద్ధాన్నీ, అర్ధసత్యాన్నీ, అతిశయోక్తినీ కలిపి వండి వడ్డిస్తే, గతంలో ప్రభావశీలంగా, ప్రజాభిప్రాయాన్ని రూపొందించగల శక్తిమంతులుగా ఉన్నవారిని లొంగదీసి భజన బృందాన్ని ఏర్పాటు చేసుకుని ఆ వంటకపు రుచిని వారిచేతనే పొగిడిస్తే ఇక అదే సత్యమైపోతుందని ఈ ఆధునిక గోబెల్స్ అనుకుంటున్నాడు. ఈ నాలుగు సంవత్సరాలలో అటువంటి ప్రచారాలు ఎన్నో జరిగాయి. జానపద కథలో చెప్పినట్టు, మేకను పట్టుకున్న వ్యక్తి చేతనే ఆయన చేతిలో ఉన్నది కుక్క అని నమ్మించగల టక్కుటమార విద్యలు చెలరేగుతున్నాయి. ఆరు దశాబ్దాల తెలంగాణ ప్రజా ఆకాంక్షలలో, నాలుగు దశాబ్దాల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షలలో, రెండు దశాబ్దాల మలిదశ ఉద్యమ ఆకాంక్షలలో ఏ ఒక్కటీ నెరవేరకపోయినా రాష్ట్రంలో పాలూ తేనే ప్రవహిస్తున్నాయనే అబద్ధ ప్రచారం సాగుతున్నది. చివరికి రాజకీయ పార్టీగా తానే చేసిన వాగ్దానాలను, ఎన్నికల ప్రణాళికలో ఇచ్చిన హామీలను తుంగలో తొక్కినా బంగారు తెలంగాణ సాకారమవుతున్నదనే ప్రచారం సాగుతున్నది. అభివృద్ధి పథకమనో, సంక్షేమ పథకమనో పేరు పెట్టుకున్న ప్రతి పథకమూ పాలకుల రాజకీయ ప్రయోజనాన్నో, పాలకుల ఆశ్రితులైన కాంట్రాక్టర్ల, సంపన్నుల, పెత్తందార్ల ఆర్థిక ప్రయోజనాన్నో ప్రధానంగా నెరవేర్చడానికే రూపకల్పన జరుగుతుండగా, దానినుంచి ఏ ప్రజాసమూహానికైనా అందే నాలుగైదు ఎంగిలి మెతుకులే ఎక్కువ ప్రచారం పొందుతున్నాయి. ఈ ప్రచారార్భాటంలో ప్రభుత్వాన్ని, ప్రభుత్వ విధానాలను ప్రజా దృక్పథం నుంచి విశ్లేషించాలనే ఆలోచనే అణగిపోతున్నది. ఆధునిక గోబెల్స్ వికటాట్టహాసమే తెలంగాణ ప్రజలకు వినబడే ఏకైక ధ్వనిగా మారిపోతున్నది. ఈ ఆధునిక గోబెల్స్ ప్రచారానికి తాజా ఉదాహరణ నిన్నటికి నిన్న వెలువడింది. సొంత పన్నుల ఆదాయంలో దేశంలోని రాష్ట్రాలన్నిటిలోకీ తెలంగాణ అగ్రభాగాన ఉన్నదని కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (కాగ్) అనే రాజ్యాంగ సంస్థ స్వయంగా తన వెబ్‌సైట్ మీద ప్రకటించిందని తెలంగాణ ప్రభుత్వం ప్రచార సాధనాలకు ఒక వార్త పంపింది. ఒక్కటంటే ఒక్క ప్రచారసాధనం కూడ ఆ వెబ్‌సైట్ మీద అటువంటి ప్రకటన ఉందో లేదో పరిశీలించకుండా ఆ వార్తను పతాక శీర్షికల్లో హోరెత్తించాయి. వాస్తవానికి ఆ వెబ్ సైట్ మీద అటువంటి ప్రకటనేదీ లేదు. కాగ్ విడుదల చేసిన వేర్వేరు నివేదికలను పరిశోధనాత్మకంగా విశ్లేషిస్తే ఆ నిర్ధారణ వస్తే రావచ్చు. కాని తమ విజయాల ఘనతగా చెప్పుకోవడానికి తాము చేసిన పరిశోధనను కాగ్ వంటి సంస్థల నోట పెట్టడం ఆధునిక గోబెల్స్ ప్రచారంలో భాగం. ఇంతకూ పన్ను ఆదాయం పెరగడం ప్రజాజీవనం మెరుగు పడిందనడానికి సూచన ఏమీ కాదు. ప్రజల గోళ్లూడగొట్టి పన్నుల ఆదాయం పెంచుకున్న పాలకులెందరో ఉన్నారు. అలాగే, ఇదే కాగ్ తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాల అక్రమాలపై నివేదిక ఇచ్చినప్పుడు, కాగ్ ను తిట్టి దిగపారబోసిన చరిత్ర కూడ ఈ ఆధునిక గోబెల్స్ లకు ఉంది. గోబెల్స్ అబద్ధాలు, గోబెల్స్ ప్రచారాలు పది పన్నెండేళ్లు నిరాటంకంగా పైచేయి సాధించినట్టు కనిపించాయేమో గాని, అంతిమంగా అవి ఎక్కడికి చేరాయో చరిత్రకు తెలుసు. అక్కడికే చేరాలని తెలంగాణ పాలకులు ఉత్సాహపడుతున్నట్టున్నారు.

వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# కడప ఉక్కు ప్రజల హక్కు

మన సమాజంలో పాలకవర్గ ముఠాలు ఎంత అవకాశవాద, ప్రజావ్యతిరేక, స్వప్రయోజన స్వార్థ రాజకీయాలు నడుపుతున్నాయో చూపడానికి ఇప్పటికే ఉన్న వేలాది నిదర్శనాలకు కడప ఉక్కు గురించి జరుగుతున్న ప్రహసనాలు మరొక ఉదాహరణను కలుపుతున్నాయి. ఈ ప్రహసనాలలో అన్ని రాజకీయ పక్షాలకూ, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకూ సమాన భాగస్వామ్యం ఉంది. ప్రజల హక్కుల గురించి, ప్రయోజనాల గురించి మాత్రమే కాదు, తామే ఇచ్చిన హామీల గురించి, చట్టబద్ధంగా లిఖితపూర్వకంగా చేసిన వాగ్దానాల అమలు గురించి కూడ రాజకీయ పక్షాలకు ఎటువంటి శ్రద్ధాసక్తులు లేవని జరుగుతున్న పరిణామాలు స్పష్టంగా ప్రకటిస్తున్నాయి. రాయలసీమలో ఉక్కు కర్మాగారం నిర్మిస్తామని ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 వాగ్దానం చేసింది. ఆ కర్మాగారం స్థాపించడం అసాధ్యం అయి ఉంటే ఆ వాగ్దానం చట్టంలోకి వచ్చి ఉండేదే కాదు. కాని ఈ నాలుగేళ్లలో కేంద్ర ప్రభుత్వం, స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియాలు కడప ఉక్కు కర్మాగార స్థాపన ప్రయత్నాలు అంగుళం కూడ కదలకుండా ఉండడానికి అన్ని ప్రయత్నాలూ చేస్తూ వచ్చాయి. ఒకసారి ఉక్కు కర్మాగార స్థాపన సాధ్యమేననడం, మరికొన్నాళ్లకే సాధ్యం కాదనడం, ఉక్కు నాణ్యత లేదనడం, ఇనుప ఖనిజ నిలువలు సరిపోవనడం, భూమి, గనులు వివాదరహితమైనవేనా అని అడగడం, కర్మాగారానికి ప్రతిపాదిస్తున్న స్థలం గనులకు సుదూరంగా ఉందనడం వంటి అనేక ఆకుకు అందని పోకకు పొందని సందేహాలతో తాత్సారం చేశారు. చివరికి కడప ఉక్కు సాధ్యమే కాదని తేల్చారు. కేంద్ర ప్రభుత్వం, స్టీల్ అథారిటీ ఇటువంటి నాటకం ఆడుతుండగా, ఈ నాటకాన్ని బైటపెట్టి, నిలదీసి కర్మాగారం సాధించవలసిన రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వ మంత్రివర్గంలో తన స్థానాల కోసం ఈ ప్రస్తావనను బలిపెట్టింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సాచివేత వైఖరిని నిలదీసి, ప్రజల్లో బహిర్గతం చేసి ఉద్యమించ వలసిన ప్రతిపక్షాలు ఆ సమస్యనే పట్టించుకోలేదు. అలా నాలుగేళ్లు గడిచిన తర్వాత ఎన్నికల సంవత్సరం ప్రారంభమైనాక, అధికారపక్షమూ ప్రతిపక్షమూ రెండూ కడప ఉక్కు కోసం ఆందోళన చేస్తున్నట్టు, కేంద్ర ప్రభుత్వాన్ని నిలదీస్తున్నట్టు, నిరాహారదీక్షలు చేస్తున్నట్టు జోరుగా నటిస్తున్నాయి. ఈ సందోహంలో అసలు సమస్యలను మరుగున పడేస్తున్నాయి. కడప ఉక్కు పాలక పక్షాల వాగ్దానాలు నిలబెట్టుకోవడం కోసం మాత్రమే కాదు, ప్రజల కోసం రావలసి ఉంది. వెనుకబడిన రాయలసీమలో ఒక భారీ ప్రభుత్వ రంగ సంస్థ రావాలి. అది నేరుగా కొన్ని వేల మందికి ఉద్యోగకల్పన సాధించాలి. అనేక అనుబంధ సంస్థల ద్వారా, సేవా సంస్థల ద్వారా మరి కొన్ని వేల మందికి ఉపాధి కల్పించాలి. స్థానిక ఆర్థిక వ్యవస్థను పురోగమింపజేయాలి. అది సాధ్యమా కాదా అనే సాంకేతిక ప్రశ్నల కన్న ముఖ్యమైన ప్రశ్న అది ప్రజాజీవన పురోభివృద్ధి దృష్ట్యా అవసరమా కాదా అనేది. అది కేవలం ఎన్నికల ఎత్తుగడనో, ప్రజలను మాయచేసే పన్నాగమో కాగూడదు. విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు అనే నినాదంతో ఉమ్మడి రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలూ ఉద్యమించి, ప్రాణాలు కూడ బలిపెట్టి ఎలా ఆ భారీ సంస్థను సాధించాయో, కడప ఉక్కు ప్రజల హక్కు అని ఇవాళ ఆంధ్రప్రదేశ్ ప్రజలందరూ ఉద్యమించి, కడప కర్మాగారాన్ని సాధించవలసి ఉంది.

వీ

# అమెరికా షరతులకు లొంగని ఉత్తరకొరియా అధినేత

– ఎ. నరసింహారెడ్డి

ఉత్తరకొరియా పట్ల నిన్నటిదాక ఉప్పు నిప్పులా ఉన్న అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్, ఉత్తరకొరియా అధినేత కిమ్ జోంగ్ ఉన్‌ల మధ్య జూన్ 12న సింగపూర్‌లోని సెంటోసా దీవిలోని విలాసవంతమైన కాపెల్లా హోటల్‌లో జరిగిన సమావేశం యావత్ ప్రపంచాన్ని ఆకర్షించింది. ఇరు దేశాధినేతలు పంతాలు పట్టింపులకు పోకుండా చర్చలు జరుపడం ముదావహం. ముఖాముఖీ భేటీలో ప్రధానంగా నాలుగు అంశాలపై ఒప్పందం కుదిరింది. మొదటిది శాంతి, సుస్థిరత కోసం సరికొత్త సంబంధాల ఏర్పాటుకు ఇరు దేశాల కట్టుబాటు. రెండోది కొరియన్ ద్వీపకల్పంలో సుస్థిర శాంతి నెలకొల్పడం, మూడోది పూర్తి స్థాయి అణు నిరాయుధీకరణకు ఉత్తరకొరియా కట్టుబడడం. నాలుగవ అంశం యుద్ధ ఖైదీలను, పోరులో అచూకీ లేకుండా పోయిన వారిని గుర్తించడం, ఇప్పటికే గుర్తించిన వారిని వెనక్కి పంపడం. నిజానికి ఈ ఒప్పందంలో ట్రంప్ ఎంతో గొప్పగా చెప్పుకున్న "కంప్లీట్ వెరిఫయబుల్ ఇర్రివర్సిబుల్ డీన్యూక్లియరైజేషన్" అంటే, మళ్లీ అణ్వస్త్రాలు తయారు చేయకుండా పూర్తి నిరాయుధీకరణ, దానికి సంబంధించిన నిపుణుల పరిశీలనకు అనుమతించడం, ఉత్తరకొరియా నిర్వహిస్తున్న ప్లుటోనియం, యురేనియం కార్యక్రమాల నిలిపివేత, ఖండాంతర క్షిపణులను ధ్వంసం చేయడం, వాటి అమలును పర్యవేక్షించే యంత్రాంగం తదితర అంశాలు చోటు చేసుకోలేదు. అమెరికా కోరుకున్నవేవీ ఒప్పందంలో లేవు. అణ్వస్త్ర నిర్మూలనకు ఉత్తరకొరియా ఒప్పుకుంది. అయితే ఎప్పటిలోగా, ఎలా చేసేది చెప్పలేదు. ఏప్రిల్ 27న దక్షిణ కొరియా నేత మూన్ జే తో కుదుర్చుకున్న ఒప్పందానికి కిమ్ మరోమారు ఆమోద ముద్ర వేశారు.

ఉత్తర కొరియా 2003లో అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం నుండి దూరం జరిగింది. 2017లో థర్మో న్యూక్లియర్ బాంబు రూపొందించింది. దీంతో అమెరికాకు నిద్ర పట్టలేదు. ఇదే ఉత్తర కొరియాతో చర్చలకు ప్రధాన కారణం. ఆసియాలో సుస్థిర శాంతి నెలకొల్పడానికి కానే కాదు. ఆర్థికంగా పోటీ పడుతున్న చైనాకు వ్యతిరేకంగా తన సామ్రాజ్యవాద ప్రయోజనాలను ముందుకు తీసుకుపోవడానికి, ఉత్తర కొరియాతో స్వేచ్ఛా వాణిజ్యానికి ద్వారాలు తెరిపించడమే లక్ష్యంగా ట్రంప్ చర్చలు జరిపాడు. భేటీ అనంతరం ఆర్థిక నిపుణుల విశ్లేషణలో కీలకంగా కనిపించేది ఇదే. అయితే ఉత్తర కొరియా స్వేచ్ఛా వాణిజ్యం వైపు అడుగులు వేస్తుందా లేదా అనేది కాలమే తేల్చాలి. భేటీ అనంతరం ట్రంప్ మాట్లాడుతూ క్షిపణి ప్రయోగ క్షేత్రాలను నాశనం చేసిందని విశ్వసించిన తర్వాతే తాము ఆర్థిక ఆంక్షలు ఎత్తివేసే అంశాన్ని పరిశీలిస్తామంటూ సన్నాయి నొక్కులు నొక్కడంతో అమెరికా నైజం మరోమారు తేటతెల్లమైంది. నిజానికి ట్రంప్, కిమ్‌ను ఏ విషయంలోనూ ఒప్పించలేకపోయారు. ఇక తానే ఉత్తర కొరియా భద్రతను అమెరికా తీసుకుంటుందని, కొరియా ద్వీపకల్పంలో సైనిక విన్యాసాలు నిలిపివేస్తామని ప్రకటించారు. న్యూయార్క్ టైమ్స్ విశ్లేషణ ప్రకారం ట్రంప్–కిమ్‌కు ఓ ప్రతినిధిలా మారిపోయారు. కొరియా ద్వీపకల్పంలో సైనిక విన్యాసాల ద్వారా ఉద్రిక్తతలను రెచ్చగొడుతుందని కిమ్ పదేపదే చేస్తున్న నిందను నిజమేనని ట్రంప్ అంగీకరించారు. ప్రపంచ భౌగోళిక రాజకీయ నేపథ్యంలో వాణిజ్య యుద్ధోన్ముఖంగా సాగుతున్న అమెరికా ఆధిపత్య పోరుకు సింగపూర్ భేటీ తోడ్పడుతుందా అన్నది వేచి చూడాల్సిందే. వీ





❖ **ఒక వేకువ కోసం** – పూజారి కాంకేర్ అమరుల జీవిత చరిత్రలు – అమరుల బంధుమిత్రుల సంఘం ప్రచురణలు– 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: బి. అంజమ్మ, గణపవరం, నాదెండ్ల మండలం, గుంటూరు జిల్లా – 522 619; ఇతర ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **జంగాలోపాఖ్యానం** – రావు కృష్ణారావు – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్–156 పేజీలు, 1/8 డెమీ, రు. 130, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఇ.నెం. 33–22–2, చంద్రం బిల్డింగ్స్, చుట్టుగుంట, విజయవాడ – 520 004; ఫోన్ : 0866–2430302 email: vphpublish@gmail.com



❖ **పుట్ట బంగారం** – తెలంగాణ సాహిత్య వ్యాసాలు – గుడిపాటి – పాలపిట్ట బుక్స్ – 192 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నం. 2, బ్లాక్ నం. 6, ఎంఐజి–2, ఎపిఎచ్‌బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044; ఫోన్: 040–27678430



❖ **శాంతి సాగరం** – గేయ కవిత్వం – సరికొండ నరసింహరాజు – సృజన ఆర్ట్స్ అకాడమీ ప్రచురణలు – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: సరికొండ నరసింహరాజు, ఇం.నెం. ఎ–116, పైలాన్ కాలనీ, నాగార్జునసాగర్–508203 ఫోన్: 9441364022



❖ **మహావీర చక్ర బ్రిగేడియర్ ఉస్మాన్** – రచన: విజయవిహారం రమణమూర్తి – జైభారత్ పబ్లికేషన్స్ – 18 పేజీలు, 1/8 డెమీ, రు. 20



❖ **మక్బూల్ షెర్వానీ** – హిందూ–ముస్లిం సమైక్యతా సారథులు – రచన: విజయవిహారం రమణమూర్తి – జైభారత్ పబ్లికేషన్స్ –46 పేజీలు, 1/8 డెమీ, రు. 35

పై రెండు ప్రతులకు: జైభారత్ పబ్లికేషన్స్, 3–8–347, మన్సూరాబాద్, చంద్రపురి కాలనీ, ఎల్‌బి నగర్, హైదరాబాద్ – 500 072. సెల్: 98480 19076



❖ **నేరమూ శిక్షా** – దాస్తోవిస్కీ – అనువాదం: శ్రీశ్రీ – శ్రీశ్రీ సాహిత్య నిధి – 56 పేజీలు, 1/8 డెమీ, రు.45, ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీథి, మారుతినగర్, విజయవాడ–520004. ఫోన్: 0866–6617375, 9246277375 ఇమెయిల్: srisrisahityanidhi@yahoo.com



❖ **నీటి పూలవాన** – అర్చన – తొమ్మిదవ తరగత అమ్మాయి కవిత్వం, సంపాదకుడు: సుంకర గోపాలయ్య – శ్రీకృష్ణప్రియ ప్రచురణలు – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు: సుంకర గోపాలయ్య, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, దామానెల్లూరు, సుళ్లూరుపేట మండలం, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు; ఫోన్: 9492638547



❖ **మూలమలుపు** – కవిత్వం – ఏనుగు నరసింహారెడ్డి – పాలపిట్ట బుక్స్ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఏనుగు నరసింహారెడ్డి, 3–14–50, విజయశ్రీ కాలనీ, సహారా రోడ్, వనస్థలిపురం, హైదరాబాద్ – 500 070.



❖ **ధిక్కారం** – కవితా సంకలనం – దండి వెంకట్ – 167 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: శ్రీమతి సబ్బని లత, సంజీవయ్య కాలనీ, నిజామాబాద్ – 503 003, తెలంగాణ; ఫోన్: 9490300502



❖ **తెలంగాణ వ్యవహార పదకోశం** – సేకరణ–కూర్పు: ముదిగంటి సుజాతారెడ్డి – తెలుగు విశ్వవిద్యాలయం – నవచేతన పబ్లిషింగ్ హౌస్ సంయుక్త ప్రచురణ – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 120



❖ **నెమలికన్ను చీర** – చేనేత కథల సంకలనం – రాచపూటి రమేష్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 108 పేజీలు, 1/8 డెమీ, రు. 90



❖ **అంతా నిజమే చెప్తా...** – జీలానీ బానూ కథలు – అనువాదం: మెహక్ హైదరాబాదీ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 228 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **శ్రీరంగరాయ జీవితం** – తెలంగాణ దారిదీపాలు – రావిచెట్టు రంగారావు – ఆదిరాజు వీరభద్రరావు– నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 38 పేజీలు, 1/8 డెమీ, రు. 30



❖ **శేషాద్రి రమణ కవుల జీవితం** – తెలంగాణ దారిదీపాలు – డా. బి. రామరాజు– నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 30



❖ **డి. రామలింగం కథలు** – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 70

పై ఆరు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జిఎస్ఐ పోస్ట్, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్–68; ఫోన్: 24224453 / 54 ఈమెయిల్:navachethanaph@gmail.com

# భూమి కోసం దళితుల హత్య

***భూ వివాదాల్లో దళితులు కోర్టుల్లో గెలిచినా ఈ దేశంలోని కుల వ్యవస్థకు బలికాక తప్పదని, పాలకులు, అధికార యంత్రాంగం కులవివక్షకు, హత్యలకు అండగా నిలుస్తారని వివరిస్తున్నారు* డా. సూరేపల్లి సుజాత**

**37** గుంటల జాగా కోసం, కళ్లలో కారంచల్లి, గొడ్డల్లతో తండ్రి కొడుకులని నరికి చంపివేసిన జూన్ 12వ తారీఖు.

భూమికి, రాజ్యానికి కులం ఉందని కిష్టారావ్ పల్లె దళితుల హత్యలతో మరొక్కసారి రుజువు అయినది. కందికట్కూరు గ్రామపు శివారు పల్లె అయిన కిష్టారావ్ పల్లెలో, సిరిసిల్ల జిల్లా ఇల్లంతకుంట మండలం, ఆ రోజు ఉదయం 6 గంటలకి ఒక వాన పడిన తరువాత, విత్తనాలు నాటడానికి సావనపల్లి ఎల్లయ్య, భార్య ఎల్లవ్వ, చిన్నకొడుకు శేఖర్, పెద్ద కొడుకు అనిల్ తమ పొలానికి పోయారు. కొద్ది సేపట్లోనే పెద్ద కొడుకు శేఖర్ ట్రాక్టర్‌లో డీజిల్ అయిపోయిందని తేవడానికి వెళ్లాడు. అంతలోనే మామిండ్ల దేవయ్య, అతని భార్య పద్మ, అతని తమ్ముడు స్వామి, కొడుకు వెంకటేష్ అందరు పథకం ప్రకారం గొడ్డళ్లతో వచ్చారు. పద్మ ముందుగానే కారంపొడి తెచ్చుకుంది. ఎందుకైనా మంచిది అని భూమికి సంబంధించిన అన్ని పేపర్లు తీసుకుని చనిపోయిన ఎల్లయ్య వెళ్లాడు. మామిండ్ల దేవయ్య తెనుగోల్ల కులానికి చెందిన వారు, పొలం పక్కనే వాళ్ల ఇల్లు కూడా. 2కి.మీ. దూరంలో ఊరికి దూరంగా ఉన్న కిష్టారావ్ పల్లెలో దళిత కుటుంబం ఉంది. పిల్లల చదువు కోసం చనిపోయిన ఎల్లయ్య కందికట్కూరు పల్లెకి కుటుంబంతో సహా కొన్ని సంవత్సరాల క్రితం పోయినాడు. అది తెల్లవారు ఝూము. అందులో ఊరికి దూరంగా ఉన్న పొలాలు చంపడం చాలా సులభంగా జరిగి పోయింది. పెద్ద కొడుకు అనిల్ వచ్చేసరికి తండ్రి, తమ్ముడు ఇద్దరు రక్తపు మడుగులో పడి ఉన్నారు.

మార్వాడి సుదర్శన్ ద్వారా నాకు 7 గం ఫోన్ వచ్చింది, అప్పటికప్పుడే హడావిడిగా నేను ఉసా (ఉ. సాంబశివరావు), కులనిర్మూలన పోరాట సమితి బందారు లక్ష్మయ్య హైదరాబాద్ నుండి బయలుదేరి సిరిసిల్ల ప్రభుత్వ ఆస్పత్రికి చేరుకున్నాం. అక్కడ శవాల దగ్గర కొద్దీ మంది బంధువులు మాత్రం ఉన్నారు. పెద్ద కొడుకు మాట పడిపోయి అచేతనంగా పడి ఉన్నాడు. హృదయవిదారకంగా ఉంది దృశ్యం.

ఆ రోజు కార్డన్‌సెర్చ్‌లో భాగంగా జిల్లా పోలీసు యంత్రాంగం అంతా అక్కడికి 8 కి.మీ. దూరంలో ఉండడంతో జిల్లా ఎస్.పి., బలగాలు పొద్దున్నే వచ్చి, శవాలని తరలించారు, మేము పోయేసరికి. మాకు బాగా బాధనిపించిన విషయం అక్కడ రెండు శవాలని చూడడానికి ఒకటి రెండు సంఘాలు తప్ప ఎవరు లేరు. వెంటనే అక్కడి నుంచి సంఘటనా స్థలానికి వెళ్లాం. పొలంలో కొద్దీ మంది ఆడవాళ్ల మధ్య ఎల్లవ్వ, పెద్దగా ఏడుస్తూ జరిగినదంతా పూసగుచ్చినట్టు చెపుతూనే ఉంది, ఆమెను ఆపడం ఎవరి తరం కావడం లేదు.

ఇంకా మేము కందికట్కూరు గ్రామానికి పోయి అక్కడ ఉన్న అంబేద్కర్ విగ్రహం దగ్గర శవాల కోసం కూర్చుని రెవెన్యూ అధికారులు రావాలని డిమాండ్ చేసాం. మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో పోలీసులు రెండు శవాలని తీసుకుని వచ్చి ఎల్లయ్య ఇంటి దగ్గర పోయే రోడ్డు మీద పెట్టారు. అక్కడ ఎవరు రాకుండా పూర్తిగా పోలీసు కాపలా పెట్టారని ఊరి వాళ్లు చెప్పారు. ఆ దళిత వాడకి కనీసం రోడ్డు కూడా లేదు. మేము బహుజన ప్రతిఘటన తరపున పోలీసు వారితో మాట్లాడి శవాలని ఊరి మధ్యన ఉన్న అంబేద్కర్ విగ్రహం దగ్గర పెట్టడానికి అనుమతి ఇవ్వాల్సిందిగా కోరాము. వాళ్లు వినలేదు, ప్రతిఘటన రోజంతా స్లోగన్స్, పాటల రూపంలో నడుస్తూనే ఉంది. రాత్రికి కానీ శవాలని అప్పగించ లేదు. శవాలు రెండో రోజు రెండో కొడుకు దుబాయ్ నుండి వచ్చేదాకా అక్కడే ఉంచాలి కాబట్టి ఫ్రీజర్ బాక్స్‌లు, టెంట్ ఇవ్వాలని డిమాండ్ పెట్టడంతో పోలీసువాళ్లు మధ్య రాత్రికి కానీ అన్ని సమకూర్చలేదు. అప్పటికి అక్కడికి పెద్దగా ఏ సంఘం కూడా రాలేదు. సామాజిక మాధ్యమాల ద్వారా అందరికి తెలిసి, పేపర్లో మెయిన్ ఎడిషన్‌లో వచ్చేదాకా చుట్టుపక్కల వారు రెండో రోజు మధ్యాహ్నానికి కానీ చేరుకోలేదు. అప్పటికి అక్కడ బంధువులు, పోలీసు వారితో ఆ ప్రాంతం నిండిపోయింది. కలెక్టర్, రెవెన్యూ అధికారులు రావాలని పట్టుబట్టడంతో రెవెన్యూ వాళ్లు వచ్చి ఆ భూమి చంపిన మామిండ్ల దేవయ్యదే అని చెప్పడం, మేము అక్కడే పాతి పెట్టాలని డిమాండ్‌తో కూర్చున్నాము.

రెండో రోజు సాయంత్రానికి అన్ని పేపర్లు పరిశీలించి మొత్తానికి ఒప్పుకున్నారు. సాయంత్రం 7 గంటల ప్రాంతంలో శవ యాత్రలో ప్రతి ఒక్కరు వచ్చి, డప్పులు కొడుతూ, పాటలు పాడుతూ ఊరేగింపుగా వెళ్లి పాతి పెట్టడం జరిగింది. రెండు రోజుల తంతు ఒక ఎత్తైతే బొంద ఎక్కడ పెట్టాలి అన్న దగ్గర పెద్ద రాద్ధాంతమే జరిగి అర్ధ రాత్రి వరకు తేలలేదు. చంపిన చోటనే పెట్టాలి అని ఎల్లవ్వ, కొడుకు అనిల్ పట్టు బట్టారు. అప్పటివరకు మాట లేకుండా ఉన్న అనిల్ పోలీసు వారు తవ్విన బొంద కాదని తన తండ్రిని చంపిన చోటనే కావాలని ఒక్కడే బొంద తొవ్వుకుంటూ అందులో కూర్చొని ఇక్కడ వాళ్లనన్నా పాతి పెట్టండి లేదా మమ్ముల్ని పాతి పెట్టమని బొందలో ఎల్లవ్వ, అనిల్ కూర్చున్నారు. ఎవరు చెప్పినా వినే పరిస్థితిలో లేరు. మేము పోలీసు వారిని అక్కడ ఉన్న ఎంఎల్ఏలకి చెప్పి చూసాం వాళ్లు వినలేదు. చివరికి ఎస్.పి. స్వయంగా వచ్చి అనిల్‌కి, ఎల్లవ్వకి నచ్చ చెప్పి, వాళ్లు అడిగిన దానికల్లా ఒప్పుకుని పోలీసు వారు చూపించి తవ్విన దగ్గరే పాతి పెట్టి అప్పటికప్పుడు 8 లక్షల 20 వేలు ఇచ్చారు. అప్పటిదాకా బలగాలను తయారు చేసి అరెస్టులు చేయడానికి సిద్ధపడ్డట్టు తరువాత తెలిసింది కానీ చివరికి సజావుగానే జరిగింది. ఒక చావు, చావు తరువాత శవాల కోసం, ఆ తరువాత బొంద పెట్టడానికి అడుగడుగునా పెద్ద ఉద్యమమే జరిగింది అని చెప్పాలి. రెండు రోజులు పోలీసు వాళ్లు చుట్టుపక్కల ఉన్న పోలీసు యంత్రాంగాన్ని దించి, బలగాలని దించి పోలీసు పహారాలోనే గ్రామాన్ని బంధించారు. హత్య చేసిన మామిండ్ల దేవయ్య కుటుంబాన్ని తమ

అధీనంలో ఉంచుకున్నాం అని సాయంత్రానికి కేసులు పెట్టిన ఎఫ్.ఐ.ఆర్. కాపీని ఇచ్చారు.

**హత్యకి దారి తీసిన భూమి తగాదా**

సావనపెల్లి బాలయ్య (చనిపోయిన ఎల్లయ్యకి తండ్రి)కి కందికట్కూరు గ్రామంలో 2.32 ఎకరాల పొలం సర్వే నెం 540లో ఉంది. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్ద కొడుకు నర్సయ్యకి 37 గుంటలు, సర్వే నెం. 539/అ, 37 గుంటలు 539/ఆ, 37 గుంటలు స. నెం 540లో ఉంది. ఎల్లయ్య, దేవయ్య మిగిలిన ఇద్దరు తమ్ముళ్లు. 1994-95 వరకు నర్సయ్య వ్యవసాయ దారుడిగా కాలం నెం. 13 లో పహానీలో నమోదు కాబడింది. చనిపోయిన ఎల్లయ్య, నర్సయ్య నుండి 23-1-1996 లో 75,000 లకి సాదా బైనామా ద్వారా కొన్నట్టు రికార్డులలో ఉంది. రిజిస్ట్రేషన్ రుసుము కూడా కట్టినట్టు, 13-బి, భూమి హక్కుదారుడికి ఇచ్చే పత్రం కూడా ఉంది. ఐతే గ్రామ రెవెన్యూ అధికారి ఎల్లయ్య పేరు మాత్రం పహానీలో ఎక్కించలేదు. 1996లో అన్న తమ్ముళ్లు సంతకాలు పెట్టి ఎల్లయ్యకి ఇచ్చిన స్టాంప్ పేపర్ కూడా ఉంది. అయితే 2001-2002 నుండి 2011-12 వరకు పేరు మార్చబడింది. ఇది గమనించిన ఎల్లయ్య ఏవిధంగా తన పేరు లేదో కనుక్కోవడానికి అనేక పర్యాయాలు రెవెన్యూ అధికారుల చుట్టూ తిరిగాడు. అనేక సార్లు ఆ భూమి పై మామిండ్ల దేవయ్య తనది అనడం, కాదు మా అన్న తమ్ముళ్లు నాకే ఇచ్చారని ఎల్లయ్య అనుకోవడం, గొడవ పడడం జరుగుతూనే ఉంది. 2017 వరకు జరిగిన విచారణలో ఎల్లయ్య తమ్ముడు అయిన దేవయ్య దొమ్మాటి పరుశురాంకి డబ్బు అవసరం ఉండి అమ్మినట్టు, అతని నుంచి మామిండ్ల దేవయ్యకి 18 సంవత్సరాల క్రితం నర్సయ్య అమ్మినట్టు సదా బైనామా చూపిస్తున్నారు. అదేవిధంగా 1990-91లో దేవయ్య, ఎల్లయ్య పట్టాదారులుగా ఉన్నట్టు చూపించడం కూడా జరిగింది. అదే సమయంలో 2001-02లో దేవయ్యకి 39 గుంటల స్థలం అమ్మినట్టుగా చూపించారు. అయితే మీసేవలో తీసుకున్న సమాచారం ప్రకారం 2016 వరకు ఎల్లయ్యనే పట్టాదారుడిగా ఉన్నాడు కానీ 2001లో హంతకుడు మామిండ్ల దేవయ్య రికార్డులలో ఎట్లా ఉన్నాడు అన్నది తెలలేదు.

అనేక సందర్భాలలో ఎల్లయ్య, ఎల్లవ్వల మీద దేవయ్య దాడి చేయడం, గత పదేళ్లలో 3 సార్లు ఎస్.సి, ఎస్.టి అట్రాసిటీ చట్టం కింద చనిపోయిన ఎల్లయ్య పిర్యాదు చేయడం అది ఎవరు పట్టించుకోలేదు కానీ 2017 ఎఫ్.ఐ.ఆర్. చేసి, కేసులో బలం లేదని, సాక్ష్యాలు లేవని కొట్టివేశారు. అదే ఈ హత్యకి దారితీసింది. ఎల్లయ్య చనిపోయిన తరువాత, 'మా భూమిలోకి అడుగు పెడితే మీ కుటుంబం మొత్తాన్ని నరికి చంపుతాం' అని పేరు లేని ఒక ఉత్తరం కూడా ఎల్లయ్య ఇంట్లో దొరికింది. 'పోలీసువారు, ప్రభుత్వం తమతో ఉన్నారని ఇంకా తమని ఎవరు ఏమి చేయలేరు' అని కూడా ఆ ఉత్తరంలో స్పష్టంగా ఉంది.

ఇక్కడ మనకి స్పష్టంగా తేలింది ఏమిటంటే రెవెన్యూ అధికారుల లంచగొండి తనం, తమ్ముడి స్వార్థం, పోలీసు అధికారుల నిర్లక్ష్యం వలన రెండు నిండు ప్రాణాలు బలి అయ్యాయి. అందుకే, తహసీల్దారు మీద, డి.ఎస్.పి మీద కూడా అట్రాసిటీ కేసు ఎల్లవ్వ పెట్టింది. ఇద్దరు ఒకరి మీద ఒకరు ఫిర్యాదు చేసుకోవడంతో చనిపోయిన ఎల్లయ్య రెవెన్యూ కోర్టు, హై కోర్టుని ఆశ్రయించాడు. హై కోర్టులో ఎల్లయ్య గెలిచాడు. తెలంగాణ ప్రభుత్వం, ఎం.ఆర్.ఓ, మామిండ్ల దేవయ్య మీద కేసు వేశాడు. రెవెన్యూ అధికారులు ఇచ్చిన ఆర్డర్‌ని సస్పెండ్ చేస్తూ 2017లో కోర్టు తీర్పు ఇచ్చింది. ఏమాత్రం తెలివి తేటలు ఉన్నా దాని అర్థం ఆ భూమి పై దేవయ్యకి హక్కు లేదని, సాగులో ఉన్న ఎల్లయ్యదే భూమి అని తెలుస్తుంది కానీ అమ్ముడు పోయిన అధికారులు ఇంకా ఏవో సాకులు చెపుతూనే ఉన్నారు. భూమికి సంబంధించిన ప్రతి రికార్డ్ ఎల్లయ్య దగ్గర ఉంటే, ఒక్క దొంగ సంతకం చేసిన సాదా బైనామా తప్ప మామిండ్ల దేవయ్య దగ్గర ఏమి లేదు. రెవెన్యూ అధికారుల అండదండలు పుష్కలం. అక్కడ ఉన్న స్థానిక టి.ఆర్.ఎస్.కి సంబంధించిన మనిషి దగ్గరుండి ఇవి చూపించాడని ఎల్లవ్వ, గ్రామస్తుల ఆరోపణ.

తెలంగాణ ప్రభుత్వం భూ రికార్డుల ప్రక్షాళన దళితుల, ఆదివాసీల, పేద కులాల వారి భూముల పాలిట శాపంగా మారి వారి ప్రాణాలని తీస్తున్నది. ప్రభుత్వ భూములు, ఇనాం భూములు, శిఖం భూములు, అప్పుడు నక్సలైట్ ఉద్యమం ద్వారా పేదలకి పంచిన భూములు అన్ని దోపిడీ కులాలకు అనువుగా మార్చుకుంటున్నారు. చదువులేని, భూమినే నమ్ముకున్న నిరుపేదల భూములు ఇప్పుడు రికార్డులలో లేవు. అడిగిన వారిని బెదిరించి, అడ్డంగా నరికి చంపుతున్నారు. ఇదే కరీంనగర్, మానకొండూరులో కొన్ని నెలల క్రితం దళిత యువకులు కిరోసిన్ పోసుకుని చనిపోవడం జరిగింది. అనేక భూములకు రెక్కలు వచ్చి వెలమ, రెడ్లు, వాళ్లకి చెంచాలుగా ఉన్న వాళ్ల దగ్గరికి ఎగిరిపోయాయి. బహుశా ఈ ఉద్దేశ్యంతోనే తెలంగాణ సర్కారు భూముల ప్రక్షాళన మొదలు పెట్టి ఉంటుంది అన్న నిజం బయట పడుతుంది. అందులో రెవెన్యూ అధికారులకి పూర్తి బాధ్యతలు అప్పచెప్పడంతో వారు కోట్లు దండుకుంటూ పేదల ప్రాణాలతో, జీవితాలతో చెలగాటాలు ఆడుకుంటున్నారు.

నామీద, ఉసా, బూరం అభినవ్, బండారు లక్ష్మయ్య, మార్వాడి సుదర్శన్ మీద అనేక కేసులు వి.ఆర్.ఓ రాజిరెడ్డి ద్వారా ఫిర్యాదు చేపించి పెట్టినారు. సిరిసిల్ల ప్రాంతం పేదల, దళితుల రక్తంతో పారుతుంది. అది నేరెళ్ల కావచ్చు, కడమంచి వెంకటేశు, సావనపల్లి ఎల్లయ్య, శేఖర్‌లు, రోజు వారీ ఇసుక లారీల కింద నలిగి పోతున్న పేద ప్రాణాలు. అది కె.టి.ఆర్ నియోజిక వర్గం కావడం కూడా ఈ నిర్బంధాలకి, కేసులకు, బైండోవర్‌లకి కారణం అని అక్కడి వారు చెప్పడం కూడా కొట్టిపారేయలేము. ఏది ఏమైనా దళిత ముఖ్యమంత్రిని చేయక పోయినా కనీసం వాళ్లు చెమట, రక్తం ధారపోసి చేసుకుంటున్న ఎకరం, రెండు ఎకరాల భూములు గుంజుకుంటూ వాళ్లని మళ్లీ బిచ్చగాళ్లుగా మారుస్తున్న ప్రభుత్వాన్ని నిలదీయాల్సిన బాధ్యత అందరి మీద ఉంది. ప్రశ్నిస్తే, పేదల పక్షాన, దళితుల పక్షాన ఉంటే కేసులు పెట్టడం మరొక ఎమర్జెన్సీని తలపిస్తుంది. ఇంకా ఉద్యమాలే శరణ్యం అని ఈ హత్యలు, నిర్బంధాలు చెపుతున్నాయి. వచ్చే ఎన్నికలలో ఇవన్నీ ప్రజలు ఎండగడతారు అని పాలకులకి ఒక అంచనా కూడా ఈపాటికి వచ్చే ఉంటుంది.

అటువైపు రాజ్యాధికారం మాత్రమే దళితులని రక్షిస్తుంది అని మౌనంగా ఉన్న దళిత సంఘాలు, మరొక వైపు వర్గం మాత్రమే సమాజాన్ని మారుస్తుంది అని నమ్మే విప్లవ సంఘాలు, నీల్, లాల్ నినాదాలకు పరిమితమైన లెఫ్ట్ పార్టీలు, రోజువారి దళితులపై జరుగుతున్న హింసని అరికట్టలేక పోతున్నాయి. కులనిర్మూలన జరగనిదే, వనరుల పై హక్కు లేనిదే, సామాజిక న్యాయం మాట్లాడకుండా ఏమి చేయలేము. ప్రజల పక్షాన, ప్రజాస్వామ్యం కోరుకునే వాళ్లందరూ ఒక్కతాటిపైకి వచ్చి ఈ కుల హత్యలని ఆపే ప్రణాళికలు రచించాలి, పని చేయాలి, అప్పటిదాకా మనం శవాల గురించి లెక్కలు వేయడం మాత్రమే చేయగలం, ఉద్యమాలు నినాదాలని, వినతి పత్రాలను దాటి ప్రజల దాకా వెళ్లాలి అని ప్రతి ఒక్కరికి విజ్ఞప్తి.

*(రచయిత కన్వీనర్ బహుజన ప్రతిఘటన వేదిక, శాతవాహన యూనివర్సిటీ)* వీ

# తూత్తుకుడిలో ప్రజలపై పేలిన తూటా

**పాలకులకు ప్రజల ప్రాణాలకన్నా కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలే ముఖ్యమనేది తూత్తుకుడిలో మరోసారి రుజువైందనీ, ప్రజలు ప్రాణత్యాగాలు చేస్తే తప్ప తమ హక్కులు సాధించుకునే పరిస్థితి ఈ వ్యవస్థలో లేదనేది మరింత స్పష్టమవుతోందని అంటున్నారు బి. రామకృష్ణ**

స్టెరిలైట్ కాపర్ అనే రాగి ఉత్పత్తి కంపెనీ వేదాంత రిసోర్సెస్ అనే బహుళజాతి కంపెనీకి చెందింది. దీని ఛైర్మన్ బిహార్‌కు చెందిన అనిల్ అగర్వాల్. భారత్, జాంబియా, టాంజానియా, నమీబియా, ఐర్లాండ్, శ్రీలంక, ఆస్ట్రేలియా, లైబేరియా, దక్షిణాఫ్రికా దేశాలలో మైనింగ్ వ్యాపారం చేస్తున్నది. వేదాంత కంపెనీ జన్మస్థానం భారతదేశమే అయినప్పటికీ ప్రపంచ వ్యాప్తంగా ఖనిజ సంపదలపై లండన్ కేంద్రంగా వ్యాపారం చేస్తున్నది. రాగి, జింక్, అల్యూమినియం, ఇనుము, సీసం, వెండి, చమురులను తవ్వి తీయడం, శుద్ధిచేసి అమ్ముకోవడం చేస్తుంది. భారత్‌లోని చాలావరకు కార్పొరేట్ రంగాన్ని నియంత్రిస్తున్నది. 1990వ దశకం ప్రారంభంలో మహారాష్ట్ర, గోవా, గుజరాత్ రాష్ట్రాలలో స్టెరిలైట్ కాపర్ కంపెనీలను స్థాపించే ప్రయత్నాలు జరిగాయి. ప్రజల వ్యతిరేకతతో అది సాధ్యం కాలేదు. చివరకు ఇది తమిళనాడులోని తూత్తుకుడిలో 1993లో అప్పటి జయలలిత ప్రభుత్వకాలంలో స్థాపించబడింది.

స్టెరిలైట్ కాపర్ కంపెనీకి 1995లో పర్యావరణ అనుమతులు ఇవ్వబడ్డాయి. అక్టోబర్ 1996లో మద్రాస్ హైకోర్టులో ఈ కంపెనీకి ఇచ్చిన అనుమతులు చాలెంజ్ చేయబడినాయి. 1997లో ఈ కంపెనీ వల్ల జరుగుతున్న నీటి, గాలి కాలుష్యాలకు సంబంధించి నిరసనలు ప్రారంభం అయినాయి. స్టెరిలైట్ కంపెనీ వదిలే వ్యర్థాలు శుద్ధి చేయబడకుండా వదలడం వల్ల భూగర్భ జలాలు, గాలి కాలుష్యానికి లోనవుతున్న నేపథ్యంలో మద్రాస్ హైకోర్టు నవంబర్ 1998లో కంపెనీని మూసేయమని ఉత్తర్వులను ఇచ్చింది. ఈ ఉత్తర్వులు వెలువడిన నెలలోపే తగు జాగ్రత్తలు తీసుకుంటామని హామీ ఇవ్వడంతో తిరిగి స్టెరిలైట్ ప్రారంభం అయ్యింది. కాలుష్య నియంత్రణ నియమాలను ఉల్లంఘిస్తున్న కారణంగా సెప్టెంబర్ 2010లో మద్రాస్ హైకోర్టు స్టెరిలైట్ కంపెనీని మూసేయమని ఆదేశించింది. అయితే స్టెరిలైట్ ఈ విషయాన్ని సుప్రీంకోర్టుకు తీసుకెళ్లింది. అదే నెలలో అంటే సెప్టెంబర్ 2010లో సుప్రీంకోర్టు స్పందిస్తూ మద్రాస్ హైకోర్టు ఇచ్చిన ఆదేశాలపై స్టే ఆర్డర్‌ను ఇచ్చింది. దాంతో ఈ కంపెనీ తిరిగి తెరువబడింది. ఏప్రిల్ 2003లో సుప్రీంకోర్టు స్టెరిలైట్ కాపర్ కంపెనీ నుంచి వెలువడుతున్న కాలుష్యం వల్ల జరిగిన నష్టానికి 100 కోట్లు జరిమానా విధించింది. కాని కంపెనీని మూసేయమనే ప్రజల డిమాండ్‌ను తోసిపుచ్చింది. దాంతో స్టెరిలైట్ కంపెనీకి దారులు బార్లా తెరువబడ్డాయి.

1998లో నేషనల్ ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగ్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియా (ఎన్ఇఇఆర్ఐఐ) అధ్యయనం ప్రకారం స్టెరిలైట్ కాపర్ కంపెనీ వదిలే వ్యర్థాలను శుద్ధి చేయడంలో తమిళనాడు కాలుష్య నియంత్రణ బోర్డు (టిపిసిబి) నిర్ధారించిన ప్రమాణాలు పాటించబడుట లేదు. ఈ వ్యర్థాలలో ఆర్సన్, సెలీనియం, సీసం వంటి హానికర పదార్థాలు నిర్ణీత ప్రమాణాలకు మించి ఉన్నాయి. భూగర్భ జలాల్లో భార లోహాల స్థాయి ఎక్కువగా ఉంది.

తిరునల్వేలి మెడికల్ కాలేజీ 2008లో చేసిన అధ్యయనం ప్రకారం స్టెరిలైట్ కాపర్ కంపెనీ ఉన్న తూత్తుకుడి పరిసర గ్రామాలలోని భూగర్భ జలాలలో ఇనుము ఉండాల్సిన ప్రమాణాల కంటే 20 రెట్లు అధికంగా ఉంది. ఈ కంపెనీ వదిలే వ్యర్థాలను తమిళనాడు కాలుష్య నియంత్రణ బోర్డు ప్రమాణాల మేరకు శుద్ధి చేయబడకుండా వదిలేయడం వల్ల పరిసర ప్రాంతాలలో కాలుష్యం పెరిగిపోయింది. అస్థమా, శ్వాసకోశ సంబంధిత వ్యాధులు ఈ ప్రాంతంలో తమిళనాడు రాష్ట్ర సగటు కంటే రెండింతలు ఎక్కువగా నమోదు అయ్యాయి. కంపెనీ సమీపంలోని ప్రజలు చెవి, ముక్కు, గొంతు వ్యాధులతో బాధపడుతున్నారు. ఎన్ఇఇఆర్ఐఐ అధ్యయనం 2010 ప్రకారం తూత్తుకుడి పరిసరాలలో స్టెరిలైట్ కాపర్ కంపెనీ వదిలే కాలుష్యాల వలన నికెల్ ఎక్కువ ప్రమాణాలలో ఉన్నాయి. ఇది చర్మ కాన్సర్‌కు దారి తీస్తుంది. ఎన్ఇఇఆర్ఐఐ 1998, 1999, 2003, 2005 సంవత్సరాలల్లో జరిపిన అధ్యయనాలన్నీ కూడా స్టెరిలైట్ కాపర్ కంపెనీ తాను వదిలే వ్యర్థాల ద్వారా తూత్తుకుడి పరిసర గ్రామాలలో కాలుష్యానికి కారణమవుతున్నదని, ఈ వ్యర్థాలను శుద్ధి చేయడంలో తమిళనాడు కాలుష్య నియంత్రణ బోర్డు నిర్ధేశించిన ప్రమాణాలు పాటించబడక పోవడం వల్ల నీళ్లలో ఆర్సన్, కాడ్మియం, రాగి, క్రోమియం, సీసం ఉండాల్సిన దానికంటే ఎక్కువ మోతాదులో ఉన్నాయి. మట్టి నమూనాలలో అధికంగా భార లోహాలు ఉన్నట్టు తేలింది.

స్టెరిలైట్ కాపర్ కంపెనీ ఉత్పత్తిని ప్రారంభించినప్పటి నుండే అనేక పర్యావరణ నియమాలను ఉల్లంఘిస్తూ వస్తున్నది. మద్రాస్ హైకోర్టు ఆదేశాల మేరకు ఎన్ఇఇఆర్ఐఐ అధ్యయనం చేయగా ఈ కంపెనీ తుంగలో తొక్కిన ఎన్నో పర్యావరణ విషయాలు వెలుగులోకి వచ్చాయి. పర్యావరణ సున్నిత ప్రాంతాలకు కనీసం 25 కిలోమీటర్ల ఆవల నిర్మించవల్సిన ఈ ప్లాంట్ 25 కి.మీ లోపలనే నిర్మించబడింది. 250 మీటర్ల గ్రీన్ బెల్టును నిర్మించాల్సి ఉండింది. కాని 25 మీటర్ల గ్రీన్‌బెల్ట్ మాత్రమే నిర్మించారు. 250 మీటర్ల గ్రీన్‌బెల్టును నిర్మించడానికి తమ కంపెనీకి స్టేట్ ఇండస్ట్రీస్ ప్రమోషన్ కార్పొరేషన్ ఆఫ్ తమిళనాడు (ఎస్ఐపిసిఓటి) సమకూర్చిన స్థలం సరిపోవడం లేదని చెబుతున్నది. ఈ ఉల్లంఘనలను కాలుష్య నియంత్రణ బోర్డు అనుమతించింది.

స్టెరిలైట్ కంపెనీ వల్ల తూత్తుకుడి పరిసర గ్రామాలలో తాగునీరు, భూగర్భ జలాలు కలుషితం అయ్యాయి. తాగునీరు తప్పనిసరి పరిస్థితులలో కొనుక్కోవాల్సి వస్తున్నది. వ్యవసాయ భూముల్లో పంటల దిగుబడి చాలా వరకు తగ్గిపోయింది. ఇక్కడి ప్రజలు క్యాన్సర్ వంటి భయంకరమైన వ్యాధుల బారిన పడుతున్నారు. శ్వాసకోశ వ్యాధులు,

అలర్జీలు, చర్మవ్యాధులు మొదలగు రోగాలు నిత్యకృత్యమయ్యాయి. ప్రమాదకరమైన కలుషితాలను వెదజల్లుతూ ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్న స్టెరిలైట్ కాపర్ కంపెనీని మూసేయడానికి ఎన్నో రుజువులున్నప్పటికీ కూడా మూతపడడం లేదు. ప్రజలు నిరసనలు తెలుపుతున్నప్పటికీ కూడా ఆ కంపెనీ ఉత్పత్తిని అధికం చేస్తూ తన వ్యాపారాన్ని నానాటికీ విస్తరించుకుంటూ పోతోంది. ఇప్పుడు అది 4 లక్షల టన్నుల రాగిని ఉత్పత్తి చేసే స్థాయికి చేరింది. పర్యావరణానికి ప్రజల ప్రాణాలకు ప్రమాదకారిగా మారిన స్టెరిలైట్ కంపెనీ ఇంకనూ కొనసాగుతుండడం అనేది కార్పొరేట్ శక్తుల చేతుల్లో పాలకవర్గాలు కీలుబొమ్మలుగా మారిన తీరును స్పష్టం చేస్తున్నది. ప్రజల్లోని వ్యతిరేకత కారణంగా అప్పుడప్పుడు తమిళనాడు ప్రభుత్వాలు, కోర్టులు, కాలుష్య నియంత్రణ మండళ్లు, స్టెరిలైట్ కాపర్‌ను మూసే ప్రయత్నాలు చేసినప్పటికీ అవేవి కూడా పనిచేయలేదు. అంటే ఆ కంపెనీ కొనసాగడానికి కావల్సిన లొసుగులను అలాగే వదిలేస్తున్నారన్నమాట. స్టెరిలైట్ బాహుబలిగా ఎదిగింది. ఈ బాహుబలికి సత్తువను ఇచ్చింది, ఇచ్చేది, ఇస్తున్నది పాలకవర్గాలు, పలుకుబడి కలిగిన రాజ్యాంగబద్ధ సంస్థలేనన్నది మరువలేనిది. ఫలితంగా తూత్తుకుడి పరిసర గ్రామాల ప్రజలకు కష్టాలు, కన్నీళ్లు, కాలుష్యాలు మిగిలాయి. ప్రజల ప్రాణాలను ఫణంగా పెట్టి స్టెరిలైట్‌కు ప్రభుత్వాలు అండగా నిలవడం సిగ్గుచేటు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఏవైనప్పటికీ కూడా స్టెరిలైట్ చేస్తున్న దురాగతాలను అడ్డుకున్నదిలేదు. కాంగ్రెస్ హయాంలో కేంద్ర ప్రభుత్వంలో ఆర్థికశాఖ మంత్రిగా, హోంమంత్రిగా పనిచేసిన తమిళనాడుకు చెందిన పి. చిదంబరం వేదాంత కంపెనీలో బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌లలో ఒకరిగా ఉన్నాడు. ఈ కంపెనీకి అన్నిరకాల ప్రభుత్వాలు అండగా ఉంటూ వచ్చాయి. దాని ఫలితంగానే పర్యావరణ నియమాలు, మానవ హక్కుల ఉల్లంఘనలు యథేచ్ఛగా జరుగుతూ వచ్చాయి.

ఇదే చిదంబరం కేంద్రంలో మంత్రిగా ఉన్నప్పుడు గ్రీన్‌హంట్ పేరుతో అటవీ ప్రాంతాలలో మైనింగ్‌లను అడ్డుకుంటూ పర్యావరణాన్ని, ప్రకృతిని పరిరక్షిస్తూ కార్పొరేట్ శక్తుల కుట్రలను, దోపిడీలను ప్రతిఘటిస్తున్న ఆదివాసీ జనాన్ని వారికి బాసటగా నిలబడిన మావోయిస్టులను క్రూరంగా అణచివేసే కార్యక్రమం మొదలైంది. అది నేటికీ కొనసాగుతూ ఉన్నది. పాలక పార్టీలు ఏవైనాసరే అణచివేతలు ఒకేలాగా ఉంటున్నాయి. వేదాంత కంపెనీ కాంగ్రెస్, బిజెపిలకు అత్యధిక విరాళాలను అందించింది. ఈ విరాళాలను పుచ్చుకున్న రాజకీయ పార్టీలు వేదాంతకు పెంపుడు కుక్కల్లాగా పనిచేస్తూ పోవడం జరుగుతున్నది.

ఓ వైపు ప్రజలు స్టెరిలైట్‌ను మూసేయాలని డిమాండ్ చేస్తున్నప్పటికీ మరోవైపు రాగి ఉత్పత్తిని రెట్టింపు చేయడానికి గతంలోనే దానికి ప్రభుత్వం కేటాయించిన స్థలంలో ఫిబ్రవరి 2018లో కొత్తగా ప్లాంట్‌ను విస్తరించే ప్రయత్నం చేసింది. దీనిపై స్టేట్ ఇండస్ట్రీస్ ప్రమోషన్ కార్పొరేషన్ ఆఫ్ తమిళనాడుగాని, కాలుష్య నియంత్రణ బోర్డు గాని చూసి చూడనట్లుగా ఉన్నాయి.

4 లక్షల టన్నుల రాగి ఉత్పత్తిని రెట్టింపు చేసే లక్ష్యంగా స్టెరిలైట్‌ను విస్తరించే ప్రయత్నాలను తూత్తుకుడి ప్రజలు సహించే స్థితిలో లేరు. చెరుపు చేస్తున్న స్టెరిలైట్‌ను మూసేయాల్సిందిపోయి కనీసం దాని విస్తరణకు అడ్డుగానైనా ప్రభుత్వం నిలబడక పోవడం దారుణమైనది. దాంతో ప్రజలు అటు స్టెరిలైట్‌కు, ఇటు ప్రభుత్వానికి వ్యతిరేకంగా సంఘటితమవుతూ వచ్చారు. విధిలేని పరిస్థితుల్లో ప్రజలు ఫిబ్రవరి 2018 నుండి తూత్తుకుడి ప్రాంతంలో నిరవధిక శాంతియుత నిరసన ప్రదర్శనలు చేస్తున్నారు.

28 మార్చ్ 2018 నాడు పురుషులు, స్త్రీలు, పిల్లలు, విద్యార్థులు, యువకులు, వృద్ధులు, చేపలు పట్టేవారు, ఉప్పు తయారీ కార్మికులు, డ్రైవర్లు, వీధుల్లో తిరిగి అమ్ముకునేవారు, వివిధ వృత్తుల వారు చిన్నచిన్న వ్యాపారస్తులు మొదలగు అన్ని రంగాల వాళ్లు కంపెనీ పరసరాల్లోని 20 గ్రామాల ప్రజలు అలాగే తూత్తుకుడి పట్టణ ప్రజలు 3 గంటలకు పైగా స్టెరిలైట్‌కు వ్యతిరేకంగా ప్రదర్శన చేశారు. అయినా కూడా ప్రభుత్వం ఏ మాత్రం స్పందించలేదు. ప్రజలు నిరసనలను కొనసాగిస్తూ వచ్చారు.

ప్రజల నిరసనలు 100 రోజులకు చేరుకున్నప్పటికీ ప్రభుత్వం నుండి ఎలాంటి స్పందనా రాకపోవడంతో కలెక్టరు కార్యాలయానికి 22మే 2018న ఊరేగింపుగా వెళ్లే కార్యక్రమం తీసుకున్నారు. భారీ సంఖ్యలో యాభై వేల వరకు ప్రజలు ఈ ఊరేగింపులో పాల్గొన్నారు. స్టెరిలైట్‌ను ఇక ఏ మాత్రం సహించేది లేదనే ఒక బలమైన సంకేతాన్ని ప్రపంచానికి చాటిచెప్పి తమ పోరాట పటిమను ప్రదర్శించారు. చావో రేవో అన్నంతలా స్పందించారు.

నిజానికి ఎంతో ప్రమాదకరమైన స్టెరిలైట్‌ను ప్రభుత్వమే చొరవచేసి మూసివేయాల్సి ఉండింది. ప్రభుత్వాలు ఉన్నవే అందుకోసం. ఆ కంపెనీ విడుదల చేస్తున్న విషాలపై పరిశోధించాల్సింది కూడా ప్రభుత్వమే. అందుకోసమే కాలుష్య నియంత్రణా బోర్డు గాని, పర్యావరణ అటవీ మంత్రిత్వశాఖ, గ్రీన్ ట్రిబ్యునల్ వంటివి ఉన్నాయి. శాంతియుతంగా జరుగుతున్న ఊరేగింపు ప్రదర్శనను అనుమతించి ప్రజలతో సహకరించాల్సింది పోయి పోలీసు యంత్రాంగంచే హింసను ప్రయోగించింది. తద్వారా కార్పొరేట్ సంస్థలకు ప్రభుత్వం గాని పోలీసు యంత్రాంగం గాని ఎంతగా దాసోహం అయ్యాయో తేలిపోతున్నది.

ప్రజలకు రక్షణగా ఉండాల్సిన యంత్రాంగం తూత్తుకుడి ప్రాంత పర్యావరణానికి, ప్రజల ప్రాణాలకు, నేల, నీరు, గాలులకు విపరీతమైన హాని చేస్తున్న స్టెరిలైట్‌కు రక్షణ కవచంగా ఉంటుండడం అనేది ప్రభుత్వాలు ఏ వర్గాలకు చాకిరీ చేస్తున్నాయో చెప్పకనే చెబుతున్నాయి.

2018, మే 22న నిరసన ప్రదర్శనకారులపై పోలీసులు నేరుగా కాల్పులకు పాల్పడ్డారు. తప్పనిసరై కాల్పులే జరపవలసి వస్తే చాలా జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది. దానికంటూ ఓ పద్ధతి ఉన్నది. గుంపును చెదరగొట్టడానికి మైకుల ద్వారా హెచ్చరించాలి. వాటర్ కేన్‌లు, టియర్‌గ్యాస్, లాఠీచార్జీలు ప్రయోగించాలి. అవీ కాని పక్షంలో రబ్బరు బుల్లెట్లు ప్రయోగించాలి. అంతేకాని ఏకంగా బుల్లెట్ల వర్షం కురిపించాలనీ ఎక్కడా లేదు. పైవన్నీ ప్రయోగించినా కూడా ఫలితం రాకుంటే మాత్రమే కాల్పులు జరుపొచ్చు. అదీ కూడా మోకాలి కింది భాగంలోనే జరపాలి. కాని తూత్తుకుడిలో జరిపిన కాల్పుల్లో ఇవేవి పాటించబడలేదు. నేరుగా ప్రజా సమూహంపైకి ఎక్కడ పడితే అక్కడ చంపాలనే కసితో కాల్పులు జరిగినట్లు సంఘటనా దృశ్యాలు, ప్రత్యక్ష సాక్షుల అనుభవాలు వీడియోలు తెలుపుతున్నాయి.

స్టెరిలైట్‌కు చెందిన మనుషులు, మఫ్టీ పోలీసులు ఒక పథకం ప్రకారం ఊరేగింపులో చేరిపోయి హింసను ప్రేరేపించినట్లుగా అక్కడి ప్రజలు చెబుతున్నారు. పోలీసు కాల్పులలో చనిపోయిన వారిలో చాలామందికి తల, చాతీ, మొహాల పైనే బుల్లెట్ గాయాలున్నాయి. అంటే చంపాలనే

ఉద్దేశ్యంతోనే కాల్పులు జరిపారని తెలుసుకోవచ్చు.

ఆల్ ఇండియా పీపుల్స్ ఫోరమ్ నిజనిర్ధారణలో పాఠశాలకు వెళ్లే 17 ఏళ్ల అమ్మాయి నోట్లో కాల్చడం వల్ల చనిపోయిందని, 47 ఏళ్ల అమాయక జాన్సీ తలపై పాయింట్ బ్లాంక్ రేంజ్‌లో కాల్చడం వల్ల మెదడు బయటకు వచ్చి చనిపోయిందని తెల్సింది. ఇలా కాల్చడం అనేది చట్టాలను ఉల్లంఘించడమే. ఇలా పోలీసు వ్యవస్థ దానికి అనుమతులిచ్చిన పాలనా వ్యవస్థ ఎంతగా అధికార దుర్వినియోగానికి పాల్పడ్డాయో అర్థం చేసుకోవచ్చు. ఒక పోలీసైతే ఒక్కన్నైనా చంపాలి అని అరిచినట్లుగా చెప్పబడుతున్నది. ఇదెంత దారుణమో చెప్పాల్సిన అవసరం లేదు.

ఇలాంటి పరిస్థితుల్లో ఈ ప్రభుత్వాలు పాలనా యంత్రాంగాలు, రకరకాల రాజ్యాంగ వ్యవస్థలు తమవి కావని వాటిని ప్రజలు బహిష్కరిస్తే ఎవరిని నిందించాలి. ఏకపక్ష కాల్పులకు పాల్పడిన ప్రభుత్వ యంత్రాంగం కార్పొరేట్లకు నమ్మినబంటునని నిరూపించుకున్నట్లైంది. తద్వారా ప్రజలు పోరాడే హక్కును, దోపిడీ పీడనలను నిరోధించే రాజ్యాంగపరమైన హక్కును కాలరాస్తూ 13 మంది ప్రాణాలను బలి తీసుకున్నారు.

నిరసన తెలపడమే నేరంగా చూస్తున్నారు. రాజ్యాంగం గ్యారంటీ చేసిన జీవించే హక్కుకై సామూహికంగా గొంతుకలను వినిపించడం తప్పుగా చూడబడుతున్నది. నినదిస్తున్న గొంతుకల్లో తూటాలు దింపి తమ అహంకారాన్ని చల్లబరుచుకుంటున్నారు. ప్రజాస్వామ్యం నడిబజారులో తూటాలకు బలవుతున్న వైనాన్ని తూత్తుకుడి మారణకాండ ఋజువు చేస్తున్నది. గతంలో ఇలాంటి సంఘటనలెన్నో జరిగాయి. మచ్చుకు కొన్నింటిని గుర్తుకు తెచ్చుకుందాం.

2011లో తమిళనాడులో కూడంకుళం వద్ద అణు విద్యుత్ కేంద్రం స్థాపనకు వ్యతిరేకంగా ప్రజలు నిరసనలు తెలిపితే 7 వేలకు పైగా ప్రజలపై రాజ్యాన్ని కూల్చే ప్రయత్నం చేశారని దేశద్రోహ నేరం కేసులు నమోదు చేశారు. నర్మదా బచావో ఆందోళన్‌పై నిర్బంధాన్ని ప్రయోగించారు. ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళం జిల్లా సోంపేట, కాకరపల్లిల్లో థర్మల్ పవర్ ప్లాంట్ స్థాపనను వ్యతిరేకించిన వారిని కాల్చి చంపారు. మధ్యప్రదేశ్‌లోని భోపాల్‌లో విష వాయువు దుర్ఘటనలో వేలాదిమంది చనిపోయారు. లక్షలాది మంది తీవ్ర అనారోగ్యాల పాలయ్యారు. వారందరికి నేటివరకు సరైన పరిహారం అందనేలేదు. ఆ కంపెనీ యాజమాన్యానికి శిక్షలు పడనేలేదు. దాని యజమాని అండర్సన్ అమెరికాలో సహజ మరణం చెందాడు. తెహ్రీడామ్, కొడైకెనాల్ హిందుస్థాన్ యూనిలివర్ ప్లాంట్, పోస్కో, మహారాష్ట్రలో జైతాపూర్‌లోని అణువిద్యుత్ ప్లాంట్ స్థాపన వంటి వాటికి వ్యతిరేకంగా ప్రజా నిరసనలెన్నో కూడా ఇలాగే అణచివేతలు, హింసల పాల్చేయబడ్డాయి.

మోడీ 'మేక్ ఇన్ ఇండియా' అనే నినాదంతో బహుళజాతి కార్పొరేషన్లకు రెడ్ కార్పెట్ పరుస్తున్నాడు. ఇక్కడ సహజ వనరులు కారుచవక, మానవ శ్రమ కారుచవక, మనుషుల ప్రాణాలు చవక. ఉన్న చట్టాలను ఎన్నింటినో అమలు చేయని దుస్థితి అవసరమైతే ఇక్కడి చట్టాలను మార్చడం తేలిక, అందుకే స్టెరిలైట్ వంటి కంపెనీలు యథేచ్ఛగా 20 ఏళ్లకు పైగా ఇక్కడ నేల, నీరు, గాలులను తీవ్రంగా కలుషితం చేయగలుగుతాయి. అవి లాభాలను అప్పనంగా చేజిక్కించుకుంటాయి. దేశవ్యాప్తంగా అన్నిచోట్ల ప్రభుత్వాలు పెట్టుబడులను ఆకర్షించే పేరుతో పెట్టుబడిదారులకు స్నేహ హస్తం అందిస్తున్నాయి. ఎన్నో రకాల రాయితీలను ప్రకటిస్తున్నాయి. చట్టాలను మార్చేస్తున్నాయి. ఉన్న ప్రజోపయోగ చట్టాలను చట్టుబండలు చేస్తున్నారు. పారిశ్రామిక విధానాల్లో, కార్మిక వేతన భద్రత చట్టాలలో, పర్యావరణ చట్టాలలో కార్పొరేట్ శక్తులకు అనుకూలమైన మార్పులు చేర్పులు చేస్తూ వాటికి దాసోహం అవుతున్నారు. ప్రజలకోసం పనిచేస్తున్నామని ప్రజల అభివృద్ధి పేరు చెబుతూ కార్పొరేట్ శక్తుల అభివృద్ధికి శాయశక్తుల కృషి చేస్తున్నారు. కార్పొరేట్ శక్తుల అన్యాయాలను ఎదిరిస్తున్న ప్రజలపై పోలీసులు, జైళ్లు, కోర్టులు ఇతరత్రా యంత్రాంగాలతో అణచివేతను ప్రయోగిస్తున్నారు.

రెండు దశాబ్దాల ప్రజా నిరసనల నేపథ్యమే గావొచ్చు, 22 మే 2018 నాటి మారణకాండలే కావొచ్చు. పరిస్థితి తీవ్రంగా మారడం, రాజకీయాధికార లబ్ధికోసమే కావచ్చు గాని ప్రతిపక్షాలు తీవ్రంగా స్పందించడం, మీడియాలో ప్రచారం కావడం, ఏదైతేనేమి తమిళనాడు ప్రభుత్వం 2018, మే 28న జి.ఓ(ఎం.ఎస్) నెంబర్.72ను జారీ చేస్తూ కంపెనీని మూసేయమని అలాగే స్టెరిలైట్ కాపర్‌కు కేటాయించిన ప్రభుత్వ భూములను వెనక్కి తీసుకుంటున్నట్లుగా ఉత్తర్వులు ఇచ్చింది. 14 మంది ప్రాణాలు బలై, వందల మంది శరీరాలు రక్తసిక్తం అయితే తప్ప ప్రభుత్వం స్పందించలేదు.

ప్రస్తుతం 2018 మే 28న తమిళనాడు ప్రభుత్వం స్టెరిలైట్‌ను మూసేస్తూ నిర్ణయం తీసుకున్నప్పటికీ అది శాశ్వతంగా అమల్లో ఉంటుందని గ్యారంటీ ఏమీ లేదు. తప్పులు సరిదిద్దుకుంటామనో, లేదా తప్పులే జరగలేదనో కోర్టుల్లో వాదించి గతంలో లాగానే నెగ్గుకొచ్చి తిరిగి ప్రారంభించే అవకాశాలను కాదని అనలేము. అదే విషయాన్ని వేదాంత గ్రూప్ ఛైర్మన్ అనిల్ అగర్వాల్ ప్రకటించి ఉన్నాడు. స్టెరిలైట్ కంపెనీ మూసివేతలో విదేశీ హస్తం ఉన్నదని దీని మూసివేత ద్వారా ఇతర దేశాల నుండి రాగిని దిగుమతి చేసుకోవాల్సి వస్తుందని, రాగి ధరలు పెరుగుతాయని అనిల్ అగర్వాల్ ట్వీట్ చేసి ఉన్నాడు. గత అనుభవాల దృష్ట్యా, పాలక వర్గాల స్వభావాల రిత్యా స్టెరిలైట్ మూసివేత విజయం ప్రజలకు పాక్షిక విజయమే.

గాలి, నేల, నీరు విషపూరితం కావడం వల్ల జరిగిన నష్టాలను పూడ్చడానికి స్టెరిలైట్ కాపర్ మాతృసంస్థ అయిన వేదాంత రిసోర్సెస్ మెడలు వంచే ప్రణాళికేదీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వద్ద లేదు. అటు దిశగా ఏ ప్రభుత్వమూ ఆలోచించడం లేదు. లక్షల వేల కోట్ల వ్యాపార సామ్రాజ్యాన్ని ప్రపంచ వ్యాప్తంగా విస్తరించి పర్యావరణంతో, ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్న వేదాంత కంపెనీపై తగు చర్యలు తీసుకుని నష్ట నివారణ, సరియైన పరిహారం రాబట్టే పని ఈ ప్రభుత్వాలు తమకు తాముగా చేస్తాయని అనుకునే పరిస్థితి లేదు. ఇటువంటి బడా కార్పొరేట్ శక్తులను నియంత్రించడానికి ఏ పాలక పార్టీ కూడా సాహసించదు. పైగా ఆ కంపెనీలే ప్రభుత్వాలను పాలనా యంత్రాంగాలను, న్యాయవ్యవస్థను శాసిస్తుండడం అనుభవంలో ఉన్న విషయమే. శ్రమ ఎవడిదిరో, సిరి ఎవడిదిరో అని చెరబండరాజు నిలదీసినట్లు ఎన్నో ఏళ్లుగా దేశ సంపదలపై మట్టి మనుషులకు హక్కు లేకుండా పోయి అవి కొంతమంది ఆధిపత్య వర్గాలకే ఊడిగం చేస్తున్నాయి. రాజ్యాంగంలో రాయబడిన సమానత్వం, ప్రజాస్వామ్యం, సామ్యవాదం, లౌకికత్వం, సార్వభౌమాధికారం వంటివి ఈ దేశ సంపద సృష్టికర్తలకు అందకుండా పోతున్నాయి. ఈ పరిస్థితుల్లో ప్రజా చైతన్యం, ప్రణాళికాబద్ధ పోరాటాలే పరిష్కారంగా కనిపిస్తున్నాయి. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# తూత్తుకుడి పోరాటం ఒక మార్గదర్శి

***తూత్తుకుడిలో 13 మందిని చంపి అయినా వేదాంతకు చెందిన స్టెరిలైట్ కంపెనీకి అండగా నిలువాలనుకున్న పాలకుల హంతక స్వభావాన్ని బహిర్గత పరచడంలో ప్రజలు చూపిన పోరాట తెగువ స్ఫూర్తిదాయకం అంటున్నారు పి.వి. రమణ***

ప్రపంచ వ్యాప్తంగా రాగి గనులు, రాగి ఉత్పత్తి ఎక్కడ జరిగినా వాటి పరిసర ప్రాంతాలన్నీ తీవ్రమైన కాలుష్యంతో నిండిపోవడం జరుగుతుంది. ప్రత్యేకంగా ఫ్యాక్టరీల నుండి విడుదలయ్యే వ్యర్థాలు ఆర్సినిక్, సీసం, ఇనుము, సల్ఫర్ డైయాక్సైడ్ లాంటి ప్రమాదకర విష పదార్థాలన్నీ గాలిలోను, నీటిలోను, భూమిలోను కలిసిపోయి లక్షలాది ప్రజల జీవితాలను నాశనం చేస్తాయి.

ప్రపంచంలోనే అతిపెద్ద లోహ, ఖనిజ తవ్వకాల సంస్థగా పేరొందిన వేదాంత గ్రూపుకు చెందినదే ఈ స్టెరిలైట్ కంపెనీ. రాగి తయారు చేసే పరిశ్రమ. భారీ స్థాయిలో పర్యావరణ విధ్వంసానికి కారణమవుతున్న సంస్థల్లో వేదాంత ముందు వరసలో ఉంది. ముంబయిలో పారిశ్రామిక వేత్తగా స్థిరపడ్డ అనిల్ అగర్వాల్ వేదాంత కంపెనీ యజమాని. గుజరాత్ సమీపంలో సిల్వస్సా, తమిళనాడులోని తూత్తుకుడిలలో స్టెరిలైట్ సంస్థ కార్యకలాపాలు నిర్వహిస్తోంది. తూత్తుకుడి, పరిసర ప్రాంతాలలో దాదాపు 4 లక్షల మంది నివసిస్తున్నారు. వీరిలో అధిక శాతం నాడార్లు, మత్స్యకారుల కుటుంబాలకు చెందినవారే.

తమిళనాడుకు చెందిన 1,076 కిలోమీర్ల మొత్తం తీర ప్రాంతంలో తూత్తుకుడికి చెందినది 121 కిలోమీటర్ల ప్రాంతం. ఈ తీరప్రాంతం పొడవునా ఏర్పాటైన ఇతర పరిశ్రమల కాలుష్యంతో పాటు స్టెరిలైట్‌కు చెందిన రాగి పరిశ్రమ నుండి విడుదలవుతున్న విషపూరిత కాలుష్యానికి గత 24 సంవత్సరాలుగా ప్రజలు బలవుతూనే ఉన్నారు.

1992లో మహారాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ స్టెరిలైట్‌కు అక్కడి రత్నగిరి జిల్లాలో 500 ఎకరాలు కేటాయిస్తే ఆ మరుసటి సంవత్సరం దాని పనులు మొదలయ్యాయి. రాగిని కరిగించగల భారీ స్మెల్టర్ నిర్మాణానికి సంస్థ పూనుకున్నప్పుడు స్థానికులు తిరగబడి ఆందోళన చేయడం పర్యవసానంగా అక్కడి ప్రభుత్వం నిపుణుల కమిటీని నియమించింది. ఆ కమిటీ నివేదికతో ప్రాజెక్టు నిలిచిపోయింది. మహారాష్ట్రలో హానికారకమని నిలిపివేసిన ప్రాజెక్టు తమిళనాడుకు వచ్చింది. 1994లో అక్కడి కాలుష్య నియంత్రణ మండలి 'నో అబ్జెక్షన్' సర్టిఫికెట్ మంజూరు చేసింది. పర్యావరణ ప్రభావ మదింపు (ఈఐఎ) చేయాలని స్టెరిలైట్‌కు సూచించింది. అంతేకాదు విభిన్న జలచరాలుండే మన్నార్ జలసంధి జీవావరణ రిజర్వ్‌కు ప్రతిపాదిత ఫ్యాక్టరీ 25 కిలోమీటర్ల దూరం ఉండాలని నిర్దేశించింది. స్టెరిలైట్ 'ఈఐఎ'ను సమర్పించకుండానే 1995లో కేంద్ర పర్యావరణ మంత్రిత్వ శాఖ నుండి అనుమతులు పొందింది. దాంతో ఫ్యాక్టరీ నిర్మాణానికి మండలి గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. మన్నార్ జలసంధికి నిబంధనలకు వ్యతిరేకంగా కేవలం 14 కిలోమీటర్ల దూరంలో ఫ్యాక్టరీ ఏర్పాటయింది. ఉత్పాదకత మొదలు పెట్టడానికి చకచకా అనుమతులు వచ్చాయి. ఫ్యాక్టరీ చుట్టూ 25 మీటర్ల మేర గ్రీన్ బెల్ట్ నిర్మించాలన్న షరతు మాత్రం విధించారు. అదీ బేఖతారైంది. ఉత్పత్తి మొదలైన ఏడాదిలోపే స్థానికుల నుంచి ఫిర్యాదుల వెల్లువ మొదలైంది. పరిసరాల్లోని భూగర్భ జలాలు కలుషితం కావడం, ఫ్యాక్టరీ పొగతో ఎందరో అస్వస్థులు అవుతుండడం రివాజుగా మారింది. కాలుష్య నియంత్రణ మండలీ, నాగ్‌పూర్‌లోని జాతీయ పర్యావరణ ఇంజనీరింగ్ పరిశోధనా సంస్థ క్లీన్‌చిట్ ఇస్తూనే ఉన్నాయి. స్థానికులు మాత్రం నానా కష్టాలు పడుతూ ఉన్నారు. అప్పుడప్పుడు పరిస్థితి తీవ్రత గమనించి ఉత్పాదికత నిలిపివేయాలని ఆదేశిస్తే, దాని పునరుద్ధరణకు అనుమతి కోరకుండానే కార్యకలాపాలు సాగించేది.

**వివరణ పేరుతో మినహాయింపు**

ప్రాజెక్టుల్ని నిర్మించాలంటే మొదట చట్టం ప్రకారం ప్రజాభిప్రాయ సేకరణ చేయాల్సిందేనంటూ 2014 మే నెలలో అప్పటి యుపిఎ సర్కారు ఆదేశాలిచ్చింది. ఆ తర్వాత వచ్చిన ఎన్‌డిఎ సర్కారు పరిశ్రమల నుంచి వచ్చిన విజ్ఞాపనల మేరకు పర్యావరణ భద్రతా నిబంధనలకు 'వివరణ' ఇచ్చే పేరిట మినహాయింపులు ఇచ్చిందని నిపుణులు చెబుతున్నారు. ఈ వివరణ ప్రజాభిప్రాయ సేకరణను మినహాయించింది. ఈ ఉత్తర్వులు చట్ట వ్యతిరేకమని 2016లో జాతీయ హరిత ట్రెబ్యూనల్ గుర్తించి పర్యావరణ మంత్రిత్వ శాఖ అధికారులకు గట్టి హెచ్చరిక చేసింది. అయితే ప్రభుత్వ ఉత్తర్వుల్ని వెనక్కి తీసుకుంటే చాలా ప్రాజెక్టులపై తీవ్ర ప్రభావం పడుతుందని మంత్రిత్వ శాఖ అధికారులు బదులిచ్చారు. దీంతో ప్రభుత్వ ఉత్తర్వుల్ని హరిత ట్రెబ్యూనల్ రద్దు చేసింది. ఎన్‌జెటి ఆదేశాల మేరకు పర్యావరణ అనుమతుల్లేని పారిశ్రామిక పార్కుల్లో ప్రాజెక్టుల నిర్మాణానికి తప్పకుండా ప్రజాభిప్రాయ సేకరణ జరపాల్సిందేనంటూ పర్యావరణ మంత్రిత్వ శాఖ తాజా ఉత్తర్వులిచ్చింది. కాని అప్పటికే ప్రజాభిప్రాయ సేకరణ లేకుండానే తూత్తుకుడి పరిశ్రమ విస్తరణకు అనుమతుల్ని సంపాదించేసింది.

**ప్రజల ప్రాణాలతో చెలగాటం**

ఏటా నాలుగు లక్షల టన్నుల ఉత్పత్తి సామర్థ్యం కలిగిన స్టెరిలైట్ కాపర్ ఇటీవల తన సంస్థను విస్తరించి ఉత్పాదక సామర్థ్యాన్ని రెట్టింపు చేయాలని ప్రయత్నించినపుడు, ఉద్యమకారులు ఆ ప్రయత్నాలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ మద్రాసు హైకోర్టు, మధురై బెంచ్ ముందు ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యం దాఖలు చేశారు. కోర్టు సంస్థ వివరణపై నిలుపుదల ఉత్తర్వులిచ్చిన కారణంగా ఆ ప్రయత్నాలకు అడ్డుకట్ట పడింది.

ప్రజల నుండి అభ్యంతరాలు లేని పక్షంలో విస్తరణ కార్యక్రమాన్ని చేపట్టవలసిందిగా కోర్టు తన మధ్యంతర ఉత్తర్వులలో సంస్థ యాజమాన్యాన్ని ఆదేశించింది. దాంతో తమిళనాడు కాలుష్య నియంత్రణ సంస్థ (టిఎన్‌పిసిబి) కంపెనీ చేపట్టిన విస్తరణ పనులకు అనుమతి నిరాకరించింది. అయినా వాటిని ఖాతరు చేయకుండా స్టెరిలైట్ యాజమాన్యం నిర్మాణ పనులు ఆపకుండా తమ సంస్థ విస్తరణ ప్రణాళికను ఒంటెత్తు పోకడతో కొనసాగించింది. దీనికి నిరసనగా అప్పట్నుంచే పర్యావరణ వేత్తలు, సామాన్య ప్రజలు పెద్ద ఎత్తున ఉద్యమించారు. సంస్థకు వ్యతిరేకంగా ప్రజాగ్రహం పెల్లుబకడం అది మొదటిసారేమీ కాదు. 2013లో ఆ పరిశ్రమ నుంచి ప్రజల ఆరోగ్యానికి హానికరమైన ఒక విషవాయువు లీకవడం జరిగింది. ఆ సందర్భంగా పెద్ద ఎత్తున ఉద్యమించిన స్థానికుల ఆందోళనలకు తలొగ్గిన యాజమాన్యం పరిశ్రమను తాత్కాలికంగా మూసేసి, తరువాత కొద్ది కాలానికే ప్రభుత్వాధికారుల దన్నుతో యథాప్రకారం ఉత్పత్తిని మొదలు పెట్టింది. ఈ పరిశ్రమలో కేవలం రాగి మాత్రమే కాక అల్యూమినియం, జింక్, సల్ఫ్యూరిక్ యాసిడ్ కూడా ఉత్పత్తి చేస్తారు. ఆ సంస్థకు వ్యతిరేకంగా పర్యావరణ ఉద్యమకారులు 2010 సెప్టెంబర్‌లో హైకోర్టును ఆశ్రయించారు. హైకోర్టు ఈ పరిశ్రమను ప్రమాదకరమైనదిగా భావించి కాలుష్య నియంత్రణ సంస్థ నిబంధనలను పాటించని కారణంగా పరిశ్రమను మూసివేస్తూ ఉత్తర్వులిచ్చింది. అయితే పరిశ్రమ యాజమాన్యం సుప్రీంకోర్టుకు వెళ్లింది. సుప్రీంకోర్టు రు. 100 కోట్ల అపరాధ రుసుం చెల్లించే షరతుపై పరిశ్రమను నడుపుకోవచ్చని ఉత్తర్వులిచ్చింది. దాంతో పరిశ్రమలో తిరిగి ఉత్పత్తి మొదలైంది. అయితే 2013లో ప్రమాదకరమైన సల్ఫర్ డై ఆక్సైడ్ వాయువు లీకేజీ తరువాత అలాంటిదే రెండు మూడు లీకేజీ ఘటనలు పునరావృతం కావడం సమస్య తీవ్రతను సూచిస్తున్నది.

2011లోనే సుప్రీంకోర్టు నాగ్‌పూర్‌లోని నేషనల్ ఎన్విరాన్‌మెంట్ ఇంజనీరింగ్ రీసర్చ్ ఇనిస్టిట్యూట్ (ఎన్‌ఇఇఆర్ఐ) సంస్థను స్టెరిలైట్ కాపర్ సంస్థ, దాని పరిసర ప్రాంతాలను పరిశీలించి, ఒక నివేదిక సమర్పించాల్సిందిగా ఆదేశించింది. ఆ సంస్థ విస్తృతంగా అధ్యయనం చేసి అక్కడి భూగర్భ జలాలలో రాగి, సీసం, కాడ్మియం, ఫ్లోరైడ్ వంటివి ప్రమాదకర స్థాయిలో ఉన్నట్లు నివేదించింది. అయినా ప్రభుత్వం నుంచి ఎలాంటి స్పందన లేదు. వేదాంత గ్రూపు సంస్థలు ఇంత లెక్కలేని తనంగా కాలుష్య కారక ఉద్గారాలను వెలువరించే పరిశ్రమలను నిరాటంకంగా నడుపుకోవడం వెనక కేంద్ర ప్రభుత్వ అండ, ఆశీస్సులు ఆ సంస్థకు ఉన్నాయని స్థానికుల భావన. విలువైన ప్రజల ప్రాణాల పట్ల రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల నిర్లక్ష్య ధోరణికి నిరసనగానే ఇంతటి ప్రజా ఉద్యమం అక్కడ తలెత్తింది.

2013 ఏప్రిల్ 2న సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులో '1998, 1999, 2003, 2005 లలో 'నీరి' సంస్థ ఫ్యాక్టరీని పరిశీలించి ఇచ్చిన నివేదిక ప్రకారం ఫ్యాక్టరీ నుండి వచ్చిన కాలుష్యం పరిసరాలను కాలుష్యమయం చేసిందని, చట్ట ప్రకారం ఉండవలసిన స్థాయి కంటే గాలి, నీరులలో అత్యధిక శాతం కాలుష్యంతో నిండిన వాయువును విడుదల చేసిందని రుజువైంది. చట్టపరమైన అనుమతులు లేకుండానే కంపెనీ నడిపారని, చాలా విషయాలలో కంపెనీ తప్పుడు సమాచారం ఇచ్చిందని కూడా తేలింది. కాని కంపెనీ ఉత్పత్తి చేస్తున్న రాగి భారతదేశ పరిశ్రమలకు చాలా ముఖ్యమని, ఫ్యాక్టరీని మూసివేస్తే ఆ పరిశ్రమలు దెబ్బతింటాయని, పైగా ఫ్యాక్టరీలో పనిచేస్తున్న 1300 మంది ఉద్యోగులు రోడ్డున పడతారని ఫ్యాక్టరీ మూసివేతకు మేము అంగీకరించడం లేదు. అయినా కాలుష్యం వలన బాధితులైన ప్రజలకు నష్టపరిహారంగా రు. 100 కోట్లు ఇవ్వాలని' తీర్పు ఇచ్చింది. ప్రాణాలు కోల్పోతూ, రోగాల భారిన పడుతున్న వేలాది మంది ప్రజల బాధలను సుప్రీంకోర్టు తేలికగా చూడడాన్ని ప్రజలు జీర్ణించుకోలేక పోయారు.

**కార్పొరేట్ శక్తుల కొమ్ము కాసిన రాష్ట్ర ప్రభుత్వాలు**

తమిళనాడు, తూత్తుకుడిలోని కాపర్ యూనిట్‌ను వ్యతిరేకిస్తూ కొద్ది నెలలుగా కొనసాగుతున్న నిరసనలు మే 22 నాడు రక్తసిక్తమయ్యాయి. పోలీసులు జరిపిన కాల్పుల్లో 13 మంది మరణించారు. వందల మంది గాయాల పాలయ్యారు. తమ ప్రాంతాన్ని కాలుష్య కాసారంగా మార్చివేసిన స్టెరిలైట్ పరిశ్రమను తక్షణమే మూసివేయాలని డిమాండ్ చేస్తూ పరిసర గ్రామాల ప్రజలు చేపట్టిన ఆందోళనపై తమిళనాడు సర్కారు ఉక్కుపాదం మోపింది. తమ ఆందోళన ప్రారంభించిన వంద రోజులైన సందర్భంగా దాదాపు 50 వేల మంది ప్రజలు తూత్తుకుడిలో చేరారు. పెద్ద సంఖ్యలో తరలివచ్చిన కార్మికులు, ఉద్యోగులు, మహిళలు, యువకులు, వృద్ధులు స్టెరిలైట్ పరిశ్రమ వద్ద శాంతియుతంగా నిరసన జరపాలని భావించారు. ప్రజల విజ్ఞప్తులు బేఖాతరు చేస్తూ కంపెనీకి వత్తాసు పలుకుతున్న తమిళనాడు ప్రభుత్వం అసాధరణ రీతిలో రామనాథపురం, తేని, దిండగల్ తదితర జిల్లాల నుండి నలుగురు అడిషన్ ఎస్‌పిలు, 13 మంది డిప్యూటీ ఎస్‌ఫిల పర్యవేక్షణలో దాదాపు 4 వేల మందికి పైగా పోలీసులను రంగంలోకి దింపింది.

వజ్ర, వరుణ్ వాహనాలతో ప్రత్యేక బలగాలు పట్టణంలో మోహరించడంతో పరిస్థితి ఉద్రిక్తంగా మారింది. మొదట రెండు బృందాలుగా ప్రజలు నిరసన ప్రదర్శనకు దిగారు ఒక బృందం మద్దతూరు గ్రామం నుండి పోలీసు నిర్బంధాలను ఎదుర్కొంటూనే నిరసన ప్రదర్శన చేపట్టింది. నిరసనకారులు చర్చ్ వద్దకు చేరుకుని ప్లాంట్ వద్దకు ప్రదర్శనగా వెళ్లేందుకు ప్రయత్నించారు. దానికి పోలీసులు అనుమతించక పోవడంతో పాటూ లాఠీలతో అమానుషంగా విరుచుకుపడ్డారు. దీంతో తమ దిశను మార్చుకున్న ప్రజలు కలెక్టరేట్ వైపునకు ప్రదర్శనగా వెళ్లారు. పోలీసులు అడుగడుగునా ఆంక్షలు విధిస్తూ వీరిని అడ్డుకునేందుకు ప్రయత్నించారు. ప్రభుత్వ ఆదేశాల మేరకు అడుగడుగునా ఆటంకాలు కల్పించారు. బలప్రయోగానికి దిగారు.

పోలీసులు ఏర్పాటు చేసిన బారికేడ్లను ప్రజానీకం తొలగించడంతో అమానుషంగా లాఠీచార్జి చేయడంతో పాటూ, బాష్పవాయువులను ప్రయోగించారు. దీంతో పలువురికి గాయాలయ్యాయి. అనేక మంది సొమ్మసిల్లి పడిపోయారు. ఈ దశలో ప్రజల నుండి ప్రతిఘటన వచ్చింది. దీనిని సాకుగా తీసుకొని పోలీసులు విచక్షణారహితంగా కాల్పులు జరిపారు. ఖాకీల తూటాలకు 13 మంది నిరసన కారులు అక్కడికక్కడే నేలకొరిగారు. వందలాది మంది గాయపడ్డారు. అనూహ్యంగా జరిగిన పోలీసు కాల్పులతో ఆగ్రహించిన ప్రజానీకం విరోచితంగా ప్రతిఘటించారు. పోలీసు వాహనాలను వెంబడించారు. ఒకటి, రెండు వాహనాలను తగలబెట్టారు. ప్రజల ప్రతిఘటనతో పోలీసులు వెనక్కి తగ్గారు. కాల్పులు నిలిపివేశారు.

**ప్రతి ఇంటా స్టెరిలైట్ బాధితులే**

డిపార్ట్‌మెంట్ ఆఫ్ కమ్యూనిటీ మెడిసిన్, తిరునెల్వేలి మెడికల్ కాలేజీ సంయుక్తంగా నిర్వహించిన ఆ అధ్యయనంలో స్టెరిలైట్ పరిశ్రమ చుట్టూ 5 కిలోమీటర్ల రేడియస్‌లో 80,725 మంది నివసిస్తున్నారు. వీరిలో 13.9 శాతం మంది కాలుష్యం భారిన పడి వివిధ వ్యాధులతో సతమత మవుతున్నట్లు తేలింది. ప్రస్తుతం ఆందోళనలు కొనసాగుతున్న కుమారెడ్డియపురం, థేరుకు, వేరపాండియపురం లోని భూగర్భ జలాల్లో ఇనుపధాతువులు గతంలో కంటే 17 నుంచి 20 శాతం అధికంగా పెరిగినట్లు బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్స్ నిర్ధారించింది. ఈ యూనిట్ పరిసరాల ప్రాంతాల్లోని ప్రజలంతా చెవి, ముక్కు, గొంతు సంబంధిత వ్యాధులతో బాధపడుతున్నారు. దీంతో పాటు కీళ్ల నొప్పులు, ఒళ్లు నొప్పులు లాంటి వ్యాధులతోనూ సతమతమవుతున్నారు. ఈ ప్రాంతాల్లోని మహిళలు ప్రత్యేకించి నెలసరి సంబంధిత వ్యాధులను మిగిలిన వారితో పోలిస్తే అధికంగా ఎదుర్కొంటున్నారు. గర్భస్రావాలు జరుగుతున్నాయి. స్టెరిలైట్ కంపెనీ ఏర్పడిన నాటి నుండీ సమీపంలోని సిల్వర్‌పురం గ్రామస్తులు నిత్యం నరకం అనుభవిస్తున్నారు. 2 వేల మంది జనాభా ఉన్న సిల్వర్‌పురంలో 60 కుటుంబాలు క్యాన్సర్ భారిన పడ్డాయి. స్టెరిలైట్ ప్లాంటుకు సమీపంలోని 15 ప్రదేశాలలో తమిళనాడు కాలుష్య నియంత్రణ మండలి నీటి నమూనాలు సేకరించింది. ఇక్కడి భూగర్భ జలాల్లో లెడ్ వంటి న్యూరోటాక్సిన్‌లు సురక్ష పరిమితి కంటే 39 నుంచి 55 రెట్లు ఎక్కువ ఉన్నాయని తేలడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ప్లాంట్ నుంచి విడుదలైన తెట్టు, జీప్సం తూత్తుకుడిలో గత 20 ఏళ్లుగా డంప్ చేస్తున్నారు. ఖనిజం నుంచి లోహాన్ని వేరు చేయగా మిగిలే వ్యర్థాలు ఇక్కడి జలాల్లో కలిసిపోయాయి. ఫలితంగా ప్లాంటుకు చుట్టు పక్కల గ్రామాల్లోని భూగర్భ జలాలు కలుషితమై నీటి వనరులు, బావుల్లోని నీళ్లు రంగు మారిపోయి నిరుపయోగంగా మారిపోయాయి. పబ్లిక్ కుళాయిల్లోని నీరు కూడా తాగలేని పరిస్థితి వచ్చింది.

తమిళనాడులోని తూత్తుకుడి స్టెరిలైట్ ప్లాంట్ అడుగడుగునా పర్యావరణ చట్టాలను ఉల్లంఘించింది. నిబంధనల ప్రకారం కాలుష్యాన్ని వెదజల్లే ఇలాంటి భారి పరిశ్రమలు జనావాసాలకు దూరంగా ఉండాలి.

**బాధితుల ఆక్రోశం**

మిని సగాయపురానికి చెందిన భారతీ ఆనంద్ 'ఇక్కడి నీరు పసుపు రంగులో ఉంటుంది. మా పేటలో కనీసం వారానికి ఒక చావు ఉంటుంది. ప్రధాని మోడీని, ముఖ్యమంత్రి పలనిస్వామిలను ఇక్కడికి రమ్మనండి. వచ్చి కనీసం రెండు రోజులు ఈ ప్రాంతంలో గడిపితే అప్పుడు మేం ఎటువంటి ప్రమాదకర స్థితిలో బతుకుతున్నామో అర్థమవుతుంది. కాని వారు రారు. మాకు తెలుసు' అని అంది. 'నా కూతురు 17 సంవత్సరాల స్నోలిన్ జాక్సన్ మెడమీద తుపాకితో కాల్చారు. ఆమె పళ్లు అన్ని బయటికి వచ్చేశాయి. స్టెరిలైట్ కంపెనీ, పోలీసుల దుర్మార్గాన్ని ఆమె నిర్భయంగా విమర్శించింది. అందుకే ఆమెను పాశవికంగా చంపారు. చనిపోయినప్పుడు ఆమె చేతిలో నిరసన గుర్తుగా నల్లజెండా ఎగురుతుంది' అని ఆమె తల్లిదండ్రులు జాక్సన్, వాసంతిలు భోరున ఏడుస్తూ చెప్పారు. 'మొదట 10 లక్షల నష్టపరిహారం ఇస్తామన్నారు. తరువాత దాన్ని 20 లక్షలకు పెంచారు. ఆ 20 లక్షల రూపాయలు మా కూతుర్ని తెస్తాయా? ఆ సొమ్మును ప్రభుత్వంలో పెద్దలకే ఇస్తాను. వారు డబ్బు కోసం తమ ప్రాణాల్ని ఇస్తారా?' అని వాసంతి ప్రశ్నించింది. 'స్నోలిన్ తొందరలోనే కాలేజీకి వెళ్లాలనుకుంది. కాలేజీలో మానవ హక్కులు, చట్టాల గురించి చదువుకుని, తూత్తుకుడిలో ప్రజలకు సహాయపడతానని ఎప్పుడూ చెప్పేది' అని తల్లిదండ్రులు వాపోయారు.

కొంత మంది నిపుణుల అంచానా ప్రకారం తూత్తుకుడి, పరిసర ప్రాంతాలలో కాలుష్యం కారణంగా క్యాన్సర్ రోగం భారినపడి దాదాపు 2,800 మంది చనిపోయారు. 'ఇక్కడ ప్రాంతాలన్నింటిలో గాలి, నీరు, భూమి అన్నీ పూర్తిగా కాలుష్యంతో నిండిపోయాయి. ఈ చుట్టు పక్కల నివసిస్తున్న ప్రజలందరు రోగాల భారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు' అని పర్యావరణ కార్యకర్త నిత్యానంద్ జయరామన్ తెలిపారు. కుమారెడ్యాపురం, తెర్కు, వీరపాండ్యపురాలలో భూగర్భ జలాల ఇనుము శాతం ఉండవలసిన స్థాయి కన్నా 17 నుండి 20 రెట్ల వరకు ఉందంటే ఎంత ప్రమాదకరమైన పరిస్థితులలో ప్రజలు జీవిస్తున్నారో అర్థమవుతుంది.

అన్నానగర్ వాసి సెల్వి 'రాగి కంపెనీ మా బతుకుల్ని నాశనం చేసింది. మా తమ్ముడు కళ్ల క్యాన్సర్‌తో క్రితం వారమే చనిపోయాడు' అని వాపోయింది. గత 22 సంవత్సరాల నుండి ఇలాంటి సంఘటనలు జరుగుతూనే ఉన్నాయి. 1997 మే 5న ఫ్యాక్టరీ పక్కనే ఉన్న రమేష్ ఫ్లవర్స్ మాన్యుఫాక్చరింగ్ యూనిట్‌కి చెందిన కార్మికులు తీవ్రమైన అనారోగ్యానికి గురయ్యారు. వారిలో అధిక శాతం స్పృహ తప్పి పడిపోయారు. 1997 ఆగస్టు 20న ఫ్యాక్టరీ విడుదల చేసిన కాలుష్యం కారణంగా తమిళనాడు ఎలక్ట్రిసిటీ బోర్డుకి చెందిన ఉద్యోగులందరూ తలనొప్పి, దగ్గు, ఆయాసం, ఊపిరి సలపకపోవడం లాంటి తీవ్రమైన అనారోగ్యాలకు గురయ్యారు. 1999 మార్చి 2న ఫ్యాక్టరీకి దగ్గరలో ఉన్న ఆల్ ఇండియా రేడియో ఉద్యోగులు 11 మంది ఫ్యాక్టరీ నుండి గ్యాస్ లీక్ కారణంగా తీవ్రమైన అనారోగ్యాలకు గురై హాస్పిటల్‌లో చేరవలసి వచ్చింది.

నవంబర్ 21,24, డిసెంబర్ 12, 2000లో తూత్తుకుడిలో కురిసిన భారీ వర్షాల కారణంగా పారిన వరద నీటిలోకి ఫ్యాక్టరీకి చెందిన విషపూరిత వ్యర్థాలను విడుదల చేశారు. తద్వారా ఆ చుట్ట పక్కల ప్రాంతాలన్నింటిలోనూ భూగర్భ జలాలు కాలుష్యమయమై పోయాయి. దీంతో ఆ ప్రాంతాల్లో నీరు తాగిన ప్రజలందరూ తీవ్రమైన అనారోగ్యాలకు గురవుతూనే ఉన్నారు. 2010 సెప్టెంబర్ 18న ఫ్యాక్టరీలో పనిచేస్తున్న ట్యాంకర్ డ్రైవర్ ముత్తుకృష్ణన్ సల్ఫర్ ఆసిడ్ వాయువుల ప్రభావంతో స్పృహ తప్పి పడిపోయి, హాస్పిటల్‌లో చేరి కొద్ది రోజులకే చనిపోయాడు. సెప్టెంబర్ 19న ఫ్యాక్టరీలో పనిచేస్తున్న ఉత్తర భారత వాసి సల్ఫర్ ఆసిడ్ వాయువుల ప్రభావంతో రెండు కళ్ల చూపు కోల్పోయాడు. 2013 మార్చి 3న సల్ఫర్ ఆసిడ్ గ్యాస్ లీక్ కారణంగా శైలేష్ మహదేవ్ అనే కాంట్రాక్టు కార్మికుడు చనిపోయాడు.

2003 మార్చి 23న ఫ్యాక్టరీ నుండి భారి స్థాయిలో ప్రమాకరమైన గ్యాస్ లీక్ అవడంతో చుట్టు పక్కల ప్రాంతాల ప్రజలు దగ్గు, ఆయాసం, ఊపిరి సలపకపోవడం, స్త్రీలకు గర్భస్రావాలు లాంటివి వివిధ సమస్యలను ప్రజలు ఎదుర్కొన్నారు.

ఫ్యాక్టరీ కాలుష్యానికి బలైనపోతున్న ప్రజలు గత 22 సంవత్సరాలుగా చేస్తున్న పోరాటానికి విభిన్న వర్గాల నుండి బ్రహ్మాండమైన మద్దతు లభించడం విశేషం. ఆ ప్రాంతపు మర్చంట్ అసోసియేషన్ అనేక సార్లు

తమ షాపులను మూసివేసి పోరాటానికి సంఘీభావం తెలిపారు. వారే కాకుండా చాంబర్ ఆఫ్ కామర్స్, చిన్న పరిశ్రమల సంఘాలు, ఆటో రిక్షా యూనియన్‌లు, మినీ బస్సు డ్రైవర్ల అసోసియేషన్లు, టీ స్టాళ్ల నిర్వాహకులు లాంటి అనేక మంది ఆందోళనలో భాగమయ్యారు.

ప్రజల పోరాటానికి దిగివచ్చిన తమిళనాడు ప్రభుత్వం ఫ్యాక్టరీని మూసివేయడమే కాకుండా, వేదాంత ఫ్యాక్టరీ విస్తరణ కోసం కేటాయించిన 342.22 ఎకరాల భూమిని స్వాధీనం చేసుకోవడం ప్రజల విజయంగా గుర్తించాలి. అయినా ప్రమాదం పూర్తిగా తొలిగిపోలేదు. ఎందుకంటే గతంలో అనేక సార్లు ప్రజల ఆందోళనలు తీవ్రమైనప్పుడల్లా ఫ్యాక్టరీని మూసివేయడం, మళ్లీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దన్నుతో తిరిగి తెరవడం మరిచిపోకూడదు.

ఈ అమానుష హత్యాకాండపై వాస్తవాల సేకరణ కోసం అఖిల భారత రైతుకూలీ సంఘం (ఏఐకెఎంఎస్), భారత కార్మిక సంఘాల సమాఖ్య (ఐఎఫ్‌టియు), ప్రగతిశీల మహిళా సంఘం (పిఒడబ్ల్యు) ల జాతీయ స్థాయి కమిటీల సమన్వయంతో ఒక బృందం ఏర్పాటు జరిగింది. న్యూ డెమొక్రటిక్ లేబర్ ఫ్రంట్ (ఎన్‌డిఎల్‌ఎఫ్) తమిళనాడు రాష్ట్ర కమిటీ సహకారంతో ఈ బృందం పర్యటన సాగింది.

కమిటీ బాధితులను, పరిసర ప్రాంతాలను పరిశీలించి ప్రకటించిన అంశాలు. స్టెరిలైట్ కాపర్ స్మెల్టింగ్ (రాగి) కంపెనీ ఒక కాలుష్య భూతంగా ప్రజారోగ్యాన్ని దెబ్బతీస్తుంది. వేలాది మంది క్యాన్సర్ రోగులుగా, గర్భస్రావాల బాధితురాళ్లుగా, కలుషిత జలాల రోగులుగా ఈ ప్రాంతం ప్రసిద్ధికెక్కిన నేపథ్యం ఉంది. ఈ కాలుష్యానికి, పర్యావరణ ముప్పుకి వ్యతిరేకంగా గత 22 ఏళ్లుగా నిరంతరంగా ప్రజా ఉద్యమం సాగుతున్నది. రాజ్యాంగ నిబంధనలనన్నింటినీ అతిక్రమించి, పర్యావరణ ప్రమాణాలను ఉల్లంఘించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వేదాంత గ్రూపుకు కొమ్ముకాస్తూ వచ్చాయి. ఒకవైపు ఈ ఉద్యమం కొనసాగుతూ ఉండగా, మరోవైపు ఫ్యాక్టరీ విస్తరణకు కొత్తగా అనుమతించడంతో మరోసారి దశలవారీగా ఉద్యమం సాగుతున్నది. దీనికి వంద రోజులు నిండిన సందర్భంగా 2018 మే 22న ఫాతిమా (రిటైర్డు మహిళా ప్రొఫెసర్) నేతృత్వంలోని స్టెరిలైట్ వ్యతిరేక పోరాట కమిటీ పిలుపుతో 50 వేల మందికి పైగా కలెక్టరేట్‌కు శాంతియుత ప్రదర్శన నిర్వహించారు. దీనికి ఒక్క రోజు ముందు ఈ పోరాట కమిటీ నాయకుడైన తంగదురై అనే యువకుడు క్యాన్సర్‌తో మరణించిన దుర్ఘటన వార్త దావానలంగా వ్యాపించి ఇంత అధిక ప్రజా సమీకరణకు అదనంగా ఒక యాదృచ్ఛిక కారణమైంది. ఈ ప్రజాతంత్ర, పర్యావరణ ఉద్యమ అణిచివేత లక్ష్యంతో ఆ రోజు ఉద్దేశపూర్వకంగా ఉద్యమకారులను గురి చూసి కాల్పులను జరిపిందని' విచారణలో రుజువైంది.

స్టెరిలైట్ వ్యతిరేక పోరాట కమిటి ఆధ్వర్యంలో నిలకడగా, దశలవారిగా సాగుతున్న పౌర, ప్రజాతంత్ర ఉద్యమానికి రాజకీయంగా తీవ్ర గుణపాఠం చెప్పే రాజకీయ లక్ష్యంతో ఈ కాల్పులు జరిగాయని మా బృందం అభిప్రాయ పడింది. పోరాట కమిటీ ముఖ్య నాయకులలో ఒకరైన తమిళరన్ (రెవల్యూషనరీ యూత్ ఫ్రంట్ నేత) ను మొట్ట మొదట ప్రత్యేకంగా పోలీసులు గురిచూసి కాల్చి చంపిన సంఘటన అందుకొక నిదర్శనంగా భావించింది. ఇంకా స్నోలినే వినిష్టాతో సహా అనేక మందిని ఎంపిక చేసిన ఉద్దేశ్యపూర్వక హత్యలుగా బృందం అభిప్రాయ పడింది.

పై రాజకీయ కుట్రలలో భాగంగానే పౌర, ప్రజాంత్ర ఉద్యమం వెనక సంఘ విద్రోహక శక్తులు ఉన్నాయని భారీ స్థాయిలో కార్పొరేట్ మీడియా ఉద్దేశ్యపూర్వకంగానే దుష్ప్రచారం చేసిందని బృందం అభిప్రాయ పడింది.

కాల్పులు జరిగిన వెంటనే తూత్తుకుడి తిరునల్వేలి, కన్యాకుమారి జిల్లాలలో సామాజిక మాధ్యమాలను (సోషల్ మీడియా) నోరు నొక్కే లక్ష్యంతో గూగుల్ సేవలను ప్రభుత్వం నిషేధించిందని బృందం భావించింది.

కాల్పులపై నిరసన తలెత్తకుండా పన్నిన కుట్రలో భాగంగానే అదే రోజు సాయంత్రం త్రెస్‌పురంలో ఝాన్సీ అనే మహిళను గురిచూసి కాల్చి చంపడం, ఆ మరునాడు 23న అన్నానగర్, 7వ వీధిలో కాళియప్పన్ అను దళిత యువకుని ఎంపిక చేసి కాల్చి చంపడం వంటి దుశ్చర్యలు జరిగాయని బృందం భావించింది. ఇదంతా నిరసన గళాలను అణిచివేసే రాజకీయ కుట్రలో భాగమేనని భావించింది.

ఈ ఉద్యమంలో 200 మందికి పైగా అరెస్టయ్యారు. వెంటనే తూత్తుకుడి బార్ అసోసియేషన్ ఏకగ్రీవంగా అరెస్టులను నిరసిస్తూ తీర్మానించింది. వంద మందికి పైగా స్థానిక న్యాయవాదులు రాత్రింబవళ్లు బృందాలుగా ఏర్పడి నిర్బంధితుల విడుదల కోసం ఆదర్శవంతంగా కృషి చేశారు. చెన్నై, హైకోర్టు న్యాయవాద బృందాలతో పాటు మధురై, కోయంబత్తూరు, తిరునల్వేలి, కన్యాకుమారి తదితర జిల్లాల బార్ అసోసియేషన్‌లు కూడా విశేషంగా స్పందించి అనేక న్యాయవాద బృందాలను తూత్తుకుడికి పంపించి నిర్బంధాన్ని సడలింపచేయుటకు విశేష కృషి చేశాయి. ముఖ్యంగా చెన్నై హైకోర్టు, మధురై హైకోర్టు బెంచీలలో అనేక ప్రజా వ్యాజ్యాలు వేసి తమ స్వంత నిధులతో న్యాయవాద సంఘాలే కేసులను నిర్వహిస్తున్నాయి. కొందరు రిటైర్డు వృద్ధ ప్రసిద్ధ న్యాయవాదులు తిరిగి హైకోర్టుకు వచ్చి తమ వాదనలను వినిపిస్తున్న ఆదర్శ కృషిని బృందం గ్రహించింది.

పోలీసు కాల్పుల్లో 13 మంది మృతి చెందినట్లు వార్త తుది నిజం కాదు. నేటికీ జాడ తెలియని యువకుల సంఖ్య చాలా ఉంది. ఈ మృతుల సంఖ్య పెరిగే అవకాశం ఉందని సర్వత్రా అభిప్రాయం ఉంది. ఆ అభిప్రాయం వాస్తవాలకు దగ్గరగా ఉందని బృందం భావించింది.

స్టెరిలైట్ ఫ్యాక్టరీని శాశ్వతంగా మూసివేసేంత వరకు తమ ఆప్తుల భౌతిక కాయాలను తీసుకునేది లేదంటూ మొత్తం 13 కుటుంబాలు ఉమ్మడి నిర్ణయం తీసుకోవడం వారి పోరాట పటిమకు నిదర్శనం.

విషతుల్య రసాయనాలను వెదజల్లే ఫ్యాక్టరీ బేషరతుగా మూసి వేయాలని, 13 మంది ప్రజల ప్రాణాలను బలిగొన్న పోలీసు అధికారులపై న్యాయ విచారణ జరిపించాలని, వారిపై హత్యా నేరాన్ని నమోదు చేయాలని, అభివృద్ధి పేరుతో కాలుష్య కారకమైన పరిశ్రమల ఏర్పాటుకు భారత ప్రభుత్వం అనుమతివ్వరాదని, తదితర అంశాలను కమిటీ డిమాండ్ చేసింది.

ఐక్యంగా దీర్ఘకాలిక పోరాటం ద్వారా సోంపేట ప్రజలు విజయం సాధించారు. అలాగే తూత్తుకుడి ప్రజలు ప్రాణాలకు తెగించి మరీ తమ జీవించే హక్కుకై పొరాడుతున్నారు. స్టెరిలైట్ కంపెనీ పూర్తిగా మూసివేసేంతవరకు, ప్రజలకు న్యాయం జరిగేంతవరకు వారు కొనగించే ప్రజా పోరాటానికి మద్దతునిద్దాం.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# తూత్తుకుడి ఘోరం - పర్యావరణ విధ్వంసం

***దేశ వ్యాప్తంగా పాలకులు అభివృద్ధి పేరుతో కార్పొరేట్ సంస్థలకు అండగా ఉంటూ పర్యావరణాన్ని, ప్రజల ప్రాణాలను ఎలా ధ్వంసం చేస్తున్నారో, ప్రకృతి సంపదను కాపాడుతున్న ప్రజలను ఎలా వేటాడుతున్నారో వివరిస్తున్నారు షేక్ కరిముల్లా***

గత నాలుగు సంవత్సరాలుగా దేశంలో జరుగుతున్న దారుణ సంఘటనలు చూస్తుంటే భారతదేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు మరింత దిగజారిపోయాయి. ఈ దేశం పూర్తిగా ఒక సామాజిక సంక్షోభ దిశకు చేరుకుందనేది సామాన్యునికి సైతం అర్థమయింది. ప్రజాస్వామ్య వ్యవస్థకున్న మేలి ముసుగు పూర్తిగా తొలగిపోయింది. ఇందుకు తాజా ఉదాహరణలే గడ్చిరోలి, తూత్తుకుడి సంఘటనలు. గడ్చిరోలి ఘటనలో 40 మంది మావోయిస్టులను ఆహార పదార్థాలలో మత్తుమందు కలిపి చంపి ఎన్‌కౌంటర్ కట్టు కథలు అల్లారు. గతంలో ఎర్రచందనం కూలీలను కూడా చంపి కథలు చెప్పారు. 2000 సంవత్సరంలో బషీర్‌బాగ్ కరెంట్ ఉద్యమంలో ప్రజల్ని కాల్చి చంపారు. ఇప్పుడు తాజాగా తమిళనాడులో తూత్తుకుడి ఘటనలో 13 మంది అమాయక ప్రజలను కాల్చి చంపారు. వేదాంత గ్రూపుకు చెందిన స్టెరిలైట్ ఫ్యాక్టరీ రాగిని కరిగించే ప్రక్రియలో విడుదలయ్యే విషపూరితమైన పదార్థాలు, వాయువులు పరిసరాలను విషపూరితం చేస్తున్న కారణంగా ఆ ప్రాంత ప్రజలకు ప్రాణాంతక వ్యాధులతో అనారోగ్య సమస్యలు ఏర్పడుతున్నాయని, పర్యావరణం దెబ్బతింటుందని ప్రజలు 1993 నుంచి మొత్తుకుంటున్నారు. అయినా ప్రభుత్వాలు పట్టించుకోలేదు. దీనికి నిరసనగా అప్పటి నుంచి పర్యావరణ వేత్తలు, ప్రజలు పెద్ద ఎత్తున ఉద్యమిస్తున్నారు. ఈ ఫ్యాక్టరీకి 1992లో మహారాష్ట్ర ప్రభుత్వం ఆ రాష్ట్రంలోని రత్నగిరి ప్రాంతంలో 500 ఎకరాల భూమిని కేటాయించింది. పర్యావరణ విధ్వంసానికి పాల్పడే ఈ పరిశ్రమ మాకొద్దంటూ ఆ ప్రాంత ప్రజలు ఉద్యమించడంతో మహారాష్ట్ర ప్రభుత్వం మేలుకొని పరిశ్రమ ఏర్పాటును నిలిపివేసింది. దీంతో ఈ సంస్థ తమిళనాడుకు చేరింది. 1994 నుంచి నిబంధనలు ఉల్లంఘిస్తూ యథేచ్ఛగా పర్యావరణ విధ్వంసానికి పాల్పడుతూ, ప్రజల ప్రాణాలను బలితీసుకుంటుంది. ఈ పరిశ్రమలను మూసివేయాలని 2010లో మద్రాసు హైకోర్టు తీర్పునిచ్చింది. ఈ తీర్పుపై సంస్థ సుప్రీంకోర్టును ఆశ్రయించగా సుప్రీంకోర్టు 2013లో తీర్పునిస్తూ 1997 – 2012ల మధ్య 15 ఏళ్ల పాటు ఈ సంస్థ పర్యావరణ విధ్వంసానికి కారణమైందని నిర్ధారించింది. ఈ విధ్వంసానికి పరిహారంగా కలెక్టర్ వద్ద రు. 100 కోట్లు డిపాజిట్ చేసి బాధితులకు పంచమని ఆదేశించింది. కాని ఇంతవరకు దానిలో ఒక్క పైసా బాధితులకు ఇవ్వలేదు. అలాగే 1995లో కేంద్ర పర్యావరణ మంత్రిత్వ శాఖ అనుమతులిస్తూ మన్నార్ జలసంధికి 25 కిలోమీటర్ల దూరంలో ఫ్యాక్టరీ నిర్మించాలంది. కాని 14 కిలోమీటర్ల దూరంలోనే ఫ్యాక్టరీని నిర్మించారు. ఫ్యాక్టరీ చుట్టూ గ్రీన్‌బెల్ట్ నిర్మించాలని షరతు విధించారు. ఇవన్నీ బేఖాతరైనాయి. 2013లో ప్రమాదకర సల్ఫర్‌డై యాక్సైడ్ వాయువు లీకేజ్ తరువాత ఇలాంటివే రెండు మూడు లీకేజ్ ఘటనలు పునరావృతమైనాయి. సమస్య తీవ్రతను గుర్తించిన ప్రజలు ప్రాణాలు ఫణంగా పెట్టి పోరాడితేనే తప్ప బతుకు దక్కదనే స్థితికి చేరుకున్నారు. ప్రజలు తప్పని స్థితిలో ఆందోళనల బాట పట్టారు. మే 22న నిరసనలు 100 రోజులు పూర్తయ్యాయి. అయినా ప్రభుత్వం స్పందించలేదు. విలువైన ప్రజల ప్రాణాల పట్ల ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి నిరసనగా 'మీకు కాపరా? (మీకు రాగియా) మాకు క్యాన్సరా?', 'మీకు ధనపేటికలా? మాకు శవపేటికలా?' అంటూ నినదిస్తూ 4 సంవత్సరాల వయస్సు పిల్లలు మొదలు సుమారు 50 వేల మంది ప్రజలు స్థానిక కలెక్టరేట్ ముట్టడికి పూనుకున్నారు. ప్రజలంతా స్వచ్ఛందంగా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రజల నిరసనను అర్థం చేసుకొని, పరిష్కరించాల్సిన ప్రభుత్వం ప్రజా ఉద్యమంపై ఉక్కుపాదం మోపింది. కఠినంగా వ్యవహరించాలని పోలీసులను ఆదేశించింది. ఇక రెచ్చిపోయిన పోలీసులు 'కాల్చిపారేయండి... కనీసం ఒక్కడన్నా చావాలి' అంటూ ఘింకరిస్తూ 13 మంది ఉద్యమకారులను కాల్చి చంపి, వందల మందిని క్షతగాత్రులను చేశారు. పోలీసు వ్యవస్థలోని ఈ అమానుష ప్రవృత్తి, అమానవీయత చూస్తుంటే రక్షణ బలగాల చేతిలోని తుపాకీ ఎవరి ప్రయోజనాలు కాపాడుతుందో అర్థం చేసుకోవచ్చు. ఉత్పత్తి రంగంలో పాలుపంచుకోకుండా, సామాన్య ప్రజలు కష్టించి సంపదను సృష్టించి పన్నుల రూపంలో చెల్లించిన సొమ్ముతో ఈ బలగాలకు జీతాలు చెల్లిస్తారు. కాని వీరు మాత్రం అన్యాయంపై, జీవించే హక్కు కోసం పోరాడుతున్న ప్రజలను కాల్చి చంపుతున్నారు. అంటే రాజ్యం అందులోని భాగాలు సంపన్నుల, కార్పొరేట్ల కొమ్ముకాస్తాయన్న సత్యాన్ని ప్రజలు గ్రహించాలి. ఈ వ్యవస్థను మార్చుకోవాలి. తూత్తుకుడి ప్రజలు రాజ్య ధిక్కారానికి పాల్పడలేదు. రాజ్యాధికారం కోరలేదు. ఎర్రజెండా చేబూనలేదు. తుపాకులు ఎక్కుపెట్టి ప్రభుత్వాన్ని కూల్చడానికి ప్రయత్నించనూ లేదు. వారు అడిగిందల్లా తమ ఆరోగ్యాలను హరించి, ప్రాణాలను తీస్తున్న ఫ్యాక్టరీని మూసివేయడమో లేదా తరలించడమో చేయమన్నారు. ఇది తప్పా? రాజ్యాంగం ప్రసాదించిన జీవించే హక్కు (ఆర్టికల్ 21ని) అడగడం నేరమా? ఈ దుర్ఘటనను కనీసం ఖండించడానికి కూడా ప్రధాని మోడీ గారికి తీరికలేదు.

సామాన్యుల నెత్తుటి ధారలు ఏరులైపారుతున్నా, ప్రాణాలు పోతున్నా వారి ఆక్రందనలు ఆకాశానికి తాకుతున్నా ప్రపంచీకరణను నెత్తికెక్కించుకొన్న మన పాలకులు కార్పొరేట్లకు, సంపన్నులకు సేవ చేస్తున్నాయి. వీరి నిజస్వరూపాన్ని ప్రజలు అర్థం చేసుకోవాలి. ఈ క్రౌర్యం, కాఠిన్యం, దుర్మార్గం కొత్తేమీ కాదు. స్వాతంత్ర్యానికి పూర్వం, తరువాత చరిత్రను పరిశీలిస్తే సంపన్నుల కార్పొరేట్ కంపెనీల పేరున అణచివేత

దోపిడీకి వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమించిన ప్రతి సందర్భంలో పాలక వర్గాలు ఏవైనా ఇదే విధంగా స్పందించాయి. ప్రజలు వేసే ఓట్లు, పార్టీలకు వచ్చే సీట్లతో సంబంధం లేకుండా ఇక్కడ ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. ఓట్ల నుంచి సీట్ల దాకా అంతా బేరసారాలు కొనుగోల్ మాల్‌లే! రిసార్టు రాజకీయాలు, చేతులు మారుతున్న కోట్లు, పార్టీ ఫిరాయింపు రాజకీయాలు ప్రజలకు ఇంతకంటే ఏమి చేస్తాయి. ప్రభుత్వాలనే కార్పొరేట్ కంపెనీలు, ప్రపంచ బ్యాంకు వారు శాసిస్తూ, వీరే పరోక్షంగా ప్రభుత్వంలో భాగస్వాములై విధాన నిర్ణయాలు చేస్తే పాలన యంత్రాంగాన్ని తమ కనుసన్నల్లో నడిపిస్తే... సామాన్య ప్రజలకు దిక్కెవరు? కాబట్టి ఈ వ్యవస్థను మార్చుకోవడమే ప్రజల ముందున్న ప్రత్యామ్నాయం. మరోవైపు వేల కోట్లు దాచుకుని, దోచుకుని విదేశాల్లో జల్సాలు చేస్తున్న విజయ్ మాల్యా, నీరవ్ మోడీలు, నల్ల కుబేరులు, రేపిస్టు ఎంఎల్ఎలు, చిన్నారులపై అత్యాచారాలు చేసిన నేరస్థులకు మద్దతుగా మంత్రులు ర్యాలీలు చేసిన, గుజరాత్‌లో 2000 మంది ముస్లిం ప్రజల ప్రాణాలు బలిగొన్న పెద్ద మనుషులు షాబుద్దీన్ ఎన్‌కౌంటర్‌లో ప్రధాన నిందితులైన పెద్దవారు నేరం చేసినట్లు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భావించవు. చట్టం ముందు అందరూ సమానులే (రూల్ ఆఫ్ లా, రాజ్యాంగంలోని అధికరణ – 14) అన్న రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కు వీరికి వర్తించదా?

ఇక ఆంధ్రప్రదేశ్‌లో పశ్చిమ గోదావరి జిల్లా తుందుర్రులో నిర్మిస్తున్న ఫుడ్ పార్కుతో 10 గ్రామాలలోని కొన్ని వేల మంది ప్రజలకు ప్రమాదం పొంచి ఉందని, పైపులైను వేసిన తరువాత ప్రమాదం జరిగి అమ్మోనియం గ్యాస్ లీకయితే ప్రజల ప్రాణాలు పోతాయని అక్కడి ప్రజలు గగ్గోలు పెడుతున్నా చంద్రబాబు ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఆక్వా పార్కును వ్యతిరేకిస్తున్న ప్రజలను లాఠీలతో కొట్టిస్తున్నారు. ఇంకా లోపలికి వెళితే సరిగ్గా 33 సంవత్సరాల కింద 1984 డిసెంబర్ 2న మధ్యప్రదేశ్‌లోని భోపాల్ నగరంలో ఆ నిశిరాత్రి యూనియన్ కార్బైడ్ కెమికల్ ఫ్యాక్టరీ నుంచి విష వాయువులు (మిథైల్ ఐసోసైనెట్) టన్నుల కొద్ది లీకై వేలాది మంది ప్రజలను నిమిషాలలో బలితీసుకుంది. ఆ మృత్యువు భారి నుండి తమను తాము రక్షించుకోవడానికి వేలాది మంది ప్రజలు హాహాకారాలు చేస్తూ వీధుల్లో పరుగులు తీశారు. నిమిషాల వ్యవధిలో 2,259 మంది అమాయక ప్రజలు మరణించారు. మరో 72 గంటల్లో 3,487 మంది చనిపోయారు. అనంతరం ఈ దుర్ఘటన వల్ల 25,000 మంది దాకా ఈ గ్యాస్ లీకేజీ వలన ఉత్పన్నమైన పరిణామాలతో మరణించినట్లు అప్పటి మధ్యప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించింది. అంతే కాకుండా పరోక్షంగా 50 వేల మందికి పైగా ప్రజలు ఈ దుర్ఘటన వలన అనారోగ్యాల భారిన పడ్డారు. కొన్ని వేల మంది ప్రజలు ఊపిరితిత్తుల క్యాన్సర్ తదితర ప్రాణాంతక వ్యాధుల భారినపడి జీవచ్ఛావాలుగా మారారు. తల్లులు కావలసిన ఎంతో మంది గర్భిణీ స్త్రీలకు గర్భస్రావాలు అయ్యాయి. ఇప్పటికీ అక్కడ 33 ఏళ్లు అయినా జన్యుపరమైన లోపాలతో శిశువులు జన్మిస్తున్నారు. ఇంతవరకు ఈ బాధితులకు కనీసం న్యాయం జరగలేదు. ఇది ఎంతో ఘోరకలి. ఒళ్లు గగుర్పాటు కలిగించే ఈ ఘటనకు బాధ్యుడైన ఆ కంపెనీ సిఇఒ వారెన్ అండర్‌సన్ (అమెరికా) ఒక్క రోజు కూడా శిక్ష అనుభవించకుండా, జైల్లో గడపకుండానే రోజుల వ్యవధిలో అతనికి బెయిల్ ఇప్పించి, విమానం ఎక్కించి మరీ దేశం దాటించారు అప్పటి కాంగ్రెస్ పాలకులు. ఇది ప్రపంచంలోనే అతిపెద్ద పారిశ్రామిక కాలుష్య ఘోరకలి అయితే ఈ విషాదం గురించి ప్రపంచ దేశాలకు కనువిప్పు కాగా మన ప్రభుత్వాలకు మాత్రం కనువిప్పు కలుగలేదు.

పారిశ్రామిక అభివృద్ధి పేరుతో సామ్రాజ్యవాద దేశాలు, బహుళజాతి కంపెనీలు ప్రజల ప్రాణాలను ఫణంగా పెట్టి కోట్లాది రూపాయలు దండుకుంటున్నాయి. పర్యావరణ చట్టాలున్నా వాటిని తుంగలో తొక్కుతూ ఈ దేశ పాలకులు దేశ విదేశీ బహుళజాతి కంపెనీలకు సేవ చేస్తున్నాయి. తన స్వంత ప్రజలకు తీరని అన్యాయం చేస్తూ కష్టాలు, కన్నీళ్లు మిగిలిస్తున్నాయి. ప్రపంచంలోనే భారీ స్థాయిలో పర్యావరణ హననానికి కారణమవుతున్న వేదాంత గ్రూపు లాంటి సంస్థలను పూర్తిగా నిషేధించాలి. లేకుంటే మానవాళి తగిన మూల్యం చెల్లించవలసి ఉంటుంది. రెండు, మూడు దశాబ్దాల కిందటి దాకా చెన్నై వాసులు మంచినీటి కోసం ఇబ్బంది పడేవారు కాదు. అలాంటిది ఇప్పుడు అక్కడ తాగేందుకు భూగర్భ జలాలు ఏమాత్రం పనికి రాకుండా అయ్యాయి. పర్యావరణాన్ని పరిరక్షించుకుంటే ఇవే పరిస్థితులు దాదాపు అన్ని చోట్లా తలెత్తుతాయని పలు అధ్యయనాలు చెబుతున్నాయి. పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న రొయ్యల, చేపల చెరువులు, సముద్రతీర ప్రాంతాలలో ఏర్పడుతున్న పరిశ్రమలు, చెట్లు, అడవుల నరికివేతల వలన పర్యావరణం దెబ్బతిని మానవ మనుగడ ప్రశ్నార్థకమవుతుంది. భూగర్భ జలాలు ఉప్పుగా మారి ఇటు తాగడానికి, అటు వ్యవసాయానికి పనికిరాకుండా పోతున్నాయి. పర్యావరణ విధ్వంసాన్ని ప్రకృతి ఎప్పటికప్పుడు అనేక రూపాలలో చెబుతూనే ఉంది. ఉదాహరణలు – పెచ్చరిల్లుతున్న తుఫానులు, భూకంపాలు, సునామీలు, ప్రపంచ జీవ జాతుల మనుగడకు సవాలు విసురుతున్నాయి. ఇక మనదేశంలోనైతే 2000 సంవత్సరం, 2016లలో హైదరాబాద్ నగరం చవిచూసిన వరద కష్టాలు, 2005లో ముంబాయి గనరాన్ని ముంచెత్తిన వరదలు మనకు ఎరుకే. గుజరాత్ రాష్ట్రంలోని సూరత్ నగరం 2006లో వరద ముప్పుకు గురైంది. ఉత్తరాఖండ్ రాష్ట్రంలో బురద వరదలెత్తి వందల మందిని బలికొంది. 2014లో కశ్మీర్‌లోని శ్రీనగర్, 2015 డిసెంబర్‌లో చెన్నై నగరం వరదలతో అతలాకుతలమైనాయి. చివరకు పల్లె సీమలు సైతం కాలుష్యమయం కావడం బాధాకరం. పల్లెల్లో స్వచ్ఛ వాయువులు వీచడం లేదు. ఒకప్పుడు పాలకంకుల పరిమళాలతో, సహజ సుమాల సుగంధాలతో, గరిక గడ్డి గుబాళింపులతో, మట్టి నుండి వెలువడుతున్న మధురమైన వాసనలతో, తేనె పట్టులతో, తూనీగల సవ్వడులతో, పిచ్చుకల రాగాలతో జీవం తొణికిసలాడే పల్లెలు నేడు కాలుష్య వాయువులతో ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అవుతున్నాయి. ఇదంతా పర్యావరణ విధ్వంసం వలననే కాబట్టి పర్యావరణాన్ని పరిరక్షించాలి. ఈ భూమి, నీరు, గాలి, చెట్టు, పుట్ట ఇవన్నీ మన పూర్వీకుల నుంచి వారసత్వంగా అనుభవిస్తున్నాం. వీటిని తిరిగి భవిష్యత్తు తరాలకు అప్పగించాలి. అలాగే జీవ వైవిధ్యమున్న భూమిని ముందు తరాల జీవ జాతులకు అందించాలి. జీవ జాతుల మనుగడ ప్రకృతిలో భాగం అని గ్రహించాలి. ఈ ప్రకృతి ప్రతి జీవ జాతుల అవసరాలను తీర్చగలదు. కానీ దురాశను తీర్చడం మాత్రం సాధ్యం కాదు. అది సోషలిస్టు వ్యవస్థలోనే సాధ్యం అవుతుంది. ఎందుకంటే అక్కడ వ్యక్తిగత ఆస్తి ఉండదు కాబట్టి సమ సమాజ నిర్మాణం కోసం ఉద్యమిద్దాం.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వీ

# రైతుకు చేరని రైతు బంధు పథకం

*తెలంగాణ ప్రభుత్వం రైతుకు పెట్టుబడి సాయం కోసం తెచ్చిన రైతు బంధు పథకం భూమిని నమ్ముకొని బతుకీడుస్తున్న రైతుకు కాకుండా వ్యవసాయం చేయని భూయజమానులకు ప్రయోజనం చేకూరుస్తుందని అంటున్నారు* **ఎ. నర్సింహా రెడ్డి**

వ్యవసాయం సంక్షోభంలో చిక్కుకుంది. రైతులు అప్పుల బాధతో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. కనుక వాటి పరిష్కారం కొరకు రాష్ట్రంలోని ఒక కోటి నలభై లక్షల ఎకరాలకు, 57 లక్షల మంది రైతులకు పెట్టుబడి సాయంగా రైతు బంధు పథకాన్ని తెలంగాణ ప్రభుత్వం ప్రకటించింది. తెలంగాణ ప్రభుత్వం అమలు చేస్తున్న రైతు బంధు పథకం, ఎకరానికి ఒక పంటకు రు. 4 వేల చొప్పున, రెండు పంటలకైతే రు. 8 వేల చొప్పున పెట్టుబడి సహాయం అందిస్తుంది. సహాయం అందిన మేరకు పెద్ద రైతులకు ఇది ఒక వరం. పేద రైతులకు ఎంతో కొంత మేలు. ఎందుకంటే ఈ సహాయం పెద్ద రైతులకు లక్షల్లో అందుతుంది. పేద రైతులకు వేలల్లో ఉంటుంది. అంటే, గుప్పెడు మందికి గంపెడు, గంపెడు మందికి గుప్పెడు అన్న చందంగా ఈ పథకం తయారైంది. దీంతో కౌలు రైతులు, పోడు రైతులకు మాత్రం పూర్తిగా అన్యాయం జరిగింది. రాష్ట్రంలో కౌలుదారులే పెద్దగా లేరన్న కెసిఆర్ తొండివాదన మరీ అన్యాయం.

1950లోనే తెలంగాణ కౌలుదారి చట్టం వచ్చింది. 2011లో అధీకృత కౌలుదారి చట్టం వచ్చింది. ఉమ్మడి రాష్ట్రంలోనే కౌలుదారులకు గుర్తింపు కార్డులిచ్చే ప్రక్రియ మొదలైంది. కెసిఆర్ ప్రభుత్వం ఆ పని పూర్తి చేయకుండానే, 57 లక్షల మంది రైతులలో 56 లక్షల మంది స్వంతంగానే సాగు చేసుకుంటున్నారని తప్పుడు ప్రచారం చేయడం ప్రజలను తప్పుదోవ పట్టించడమే అవుతుంది. కౌలు రైతులు గుర్తింపు పత్రాలు పొందనందున బ్యాంకు రుణాలు పొందడానికి, పంటల భీమా పొందడానికి ఏలాంటి అవకాశాలు లేని అభద్రతతో కొట్టుమిట్టాడుతున్నారు. వారికి భద్రత కల్పించే చర్యలు తీసుకోకుండా రైతుబంధు పథకం నుండి మినహాయించడం దారుణం. ఇది పాలకుల వర్గ, భూస్వామ్య స్వభావానికి నిదర్శనం. పెట్టుబడి సాయం పేరుతో ప్రకటించిన రు. 5609 కోట్లలో అధిక భాగం ధనిక, గైరుహాజర్ రైతులకే వెళ్తుంది. సాయం అవసరమయ్యేది బలహీనులకు. కాగా... బలహీనులైన కౌలు రైతులు, పోడు రైతులు వంటి వారిని విస్మరించి, ఫామ్‌హౌజ్‌ల యజమానులకు ఖజానాను దోచిపెట్టడం ఏ విధంగానూ సమర్థనీయం కాదు. పేదల గురించి మాట్లాడుతూ పెద్దల సేవలో తరించడం తప్ప ఇది మరొకటి కాజాలదు.

భూకౌలుదారు చట్టం ప్రమాదకరమైనదని, దానివల్ల భూయజమాని భూమిపై తన హక్కును కోల్పోయే ప్రమాదముందని ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు ఓ సందర్భంలో అన్నారు. 95 శాతం పట్టాదార్లకు వ్యవసాయం స్వయంగా చేసే ఉద్దేశ్యం ఉంది. అందువల్ల కౌలుదారుల సమస్యలో తీవ్రత లేదని మరో సందర్భంలో అన్నారు. భూమిని యజమాని సాగుచేసినా చేయకపోయినా తన హక్కును మాత్రం ఎల్లకాలం కాపాడు కోవాలనే ఉద్దేశం ముఖ్యమంత్రి మాటల్లో గోచరిస్తోంది. కెసిఆర్ ఉద్దేశం సాగుచేసే రైతులకు, పోడు రైతులకు, కౌలుదార్లకు సహాయం చేయడం కాదు, పంట పెట్టుబడి సాయం చేయడం కాదు, వ్యవసాయంతో ఏ సంబంధమూ లేని, భూయాజమాన్యం ఉన్న అధికార పార్టీ ఆశ్రితులైన ధనిక, బడా భూస్వాములకు లాభం చేకూర్చడానికీ, ఎన్నికలకు ముందు పార్టీ నిధులను పంచి ఓట్లు కొనుక్కునే బదులు, ఏడాది ముందుగానే ప్రజాధనాన్ని ఉపయోగించి ఓటర్లను ఆకర్షించడానికీ ఈ పథకం తయారయిందని భావించక తప్పదు.

రాష్ట్రంలో ఆహార ఉత్పత్తి, దానితో పాటు తలసరి ఆహార ధాన్యాల అందుబాటు క్రమంగా తగ్గిపోతున్నాయి. కారణం, ఆహార ధాన్యాల పెరుగుదల రేటు జనాభా పెరుగుదల రేటు కంటే తక్కువగానే ఉంటున్నది. వ్యవసాయం నుండి వైదొలగే వారి సంఖ్య పెరుగుతూనే ఉంది. అన్నదాతల ఆత్మహత్యలు శరవేగంతో పెరుగుతూ ఉన్నాయి. రాష్ట్రంలో గత నాలుగేండ్లలో 4 వేల మంది రైతులు ఆత్మహత్యల పాలయ్యారు. వ్యవసాయరంగం తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కొంటూ ఉంది. కానీ మన ముఖ్యమంత్రి మాత్రం వ్యవసాయ సంక్షోభానికి శాస్త్రీయమైన పరిష్కారాన్ని చూపకుండానే వ్యవసాయం దండగ కాదు, పండుగ చేస్తానంటున్నారు. కోటి ఎకరాలకు సాగునీరు ఇస్తానంటున్నారు. భూగర్భ జలాలు పాతాళానికి చేరుకుంటుంటే వ్యవసాయానికి 24 గంటల విద్యుత్ సప్లయి చేస్తానంటున్నారు. రైతుబంధు పథకం అమలు చేస్తానంటున్నారు. 150 శాతం మద్దతు ధర సాధిస్తామంటున్నారు. వీటితో రైతు సమస్యలు అంతమవుతాయా?

ఎకరానికి ఉత్పాదకాల ఖర్చు 20 వేలకు పైగా ఉంటుంది. సాగునీటి వసతి ఉంటే ఎకరానికి కౌలు 10 వేలకు పైగానే ఉంది. అంటే మొత్తం ఎకరా పెట్టుబడి 30 వేలు. అదే మిరప పంట అయితే ఉత్పాదకాల ఖర్చే 50 వేల రూపాయలు ఉంటుంది. పసుపు ఖర్చు కూడా 40 వేల వరకు ఉంటుంది. వ్యవసాయ పెట్టుబడులు ఈ విధంగా ఆకాశాన్ని తాకుతూ ఉండగా ఎకరానికి 4 వేల చొప్పున ఇచ్చే ప్రభుత్వ మద్దతు ఏ మూలకు సరిపోతుంది? అయినా వ్యవసాయాన్ని పండగగా మారుస్తానంటున్నారు ముఖ్యమంత్రి. గతంలో సాగుభూమి విస్తరణ, సాగునీటి సౌకర్యం, 'భూసంస్కరణలు', హరిత విప్లవం లాంటి కార్యక్రమాలు వ్యవసాయ సంక్షోభాన్ని నివారించలేకపోయాయి. తెలంగాణ ప్రభుత్వం విడుదల చేసిన సామాజిక, ఆర్థిక గణాంకాలు ఒక విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. తెలంగాణలో 45 శాతం భూ విస్తీర్ణం 15 శాతం మంది భూస్వాముల చేతుల్లో మిగతా 55 శాతం

భూ విస్తీర్ణం 85 శాతం మంది చేతుల్లో ఉంది. భూసంబంధాల్లో తీవ్రమైన మార్పులు రాకుండా వ్యవసాయ సంక్షోభానికి శాశ్వత పరిష్కారం లభించదు.

తెలంగాణలో సగటు భూ కమతం పరిమాణం 1.12 హెక్టార్లు (1 హెక్టార్‌కి రెండున్నర ఎకరాలు). 1 హెక్టార్‌లోపు ఉన్న రైతులను సన్నకారు రైతులు అంటారు. తెలంగాణలో ఈ కేటగిరిలో ఉన్న రైతుల సంఖ్య 62 శాతం ఉంటే వీళ్ల దగ్గర ఉన్న భూ విస్తీర్ణం కేవలం 25.3 శాతం మాత్రమే ఉంది. 1 నుంచి రెండు హెక్టార్లు అంటే 5 ఎకరాల లోపు ఉన్న రైతులను చిన్నకారు రైతులంటారు. తెలంగాణలో ఈ కేటగిరి రైతులు 23.9 శాతం ఉంటే వీళ్ల దగ్గర ఉన్న భూ విస్తీర్ణం కేవలం 30.2 శాతం ఉంది. 2 నుంచి 10 హెక్టార్లు అంటే 25 ఎకరాల లోపు ఉన్న రైతులను మధ్యతరహా రైతులు అంటారు. తెలంగాణలో ఈ కేటగిరి రైతుల సంఖ్య 13.9 శాతం ఉంటే వీళ్ల దగ్గర ఉన్న భూ విస్తీర్ణం 40.5 శాతం. 10 హెక్టార్లు అంటే 25 ఎకరాలపైన ఉన్న రైతులను పెద్ద రైతులు అంటారు. తెలంగాణలో ఈ కేటగిరి రైతులు 0.3 శాతం ఉంటే వీళ్ల దగ్గర ఉన్న భూ విస్తీర్ణం 4 శాతం ఉంది. పైన వివరించిన లెక్కలు చూస్తే అత్యల్ప భూ విస్తీర్ణం సన్న, చిన్నకారు రైతుల చేతుల్లో ఉంటే అత్యధిక భూ విస్తీర్ణం భూస్వాముల చేతుల్లో కేంద్రీకృతమైంది.

**పెట్టుబడి సహాయం ఎవరికి అందాలి?**

రైతులకు పెట్టుబడి ఖర్చులు బాగా పెరిగిపోయాయి. వ్యవసాయంలో నష్టాలు వస్తున్నాయి. వారిని నష్టాల నుండి కాపాడడానికి రైతుబంధు పథకం తెచ్చామన్నారు. అలాంటిదే మద్దతు ధరల పథకం కూడా. నిజానికి పెట్టుబడి పెట్టి, భూమిని సాగుచేసి, పంటలు పండించే వారే ఇలాంటి నష్టాలకు గురి అవుతూ ఉంటారు. కాబట్టి పెట్టుబడి పెట్టి సాగుచేసే రైతులకే ఈ సహాయం అందాలి? సాగు చేయని భూస్వాములు శ్రమ చేయరు. పెట్టుబడి పెట్టరు. పంటలు పండించరు. కాబట్టి వారికి నష్టపోయే సమస్యే లేదు. అలాంటి వాళ్లకు ఈ సహాయం ఎందుకు ఇవ్వాలి? అంతేకాదు, వారు తమ భూములు కౌలుకు ఇచ్చి లక్షలు సంపాదిస్తున్నారు. ఆ భూమిలో వారు పైసా పెట్టుబడి పెట్టరు. దానిమీద వీసమెత్తు పని కూడా చేయరు? అయినా, ఏపని చేయకుండానే కౌలు రూపంలో లక్షలు సంపాదిస్తారు. అలాంటి వారికి మరలా ఈ పథకం ద్వారా లక్షల్లో ప్రజాధనం దోచిపెట్టడమేమిటి? ఇది ప్రజాధనం దుర్వినియోగం చేయడం తప్ప మరొకటి కాదు.

**కౌలు రైతులకు పెట్టుబడి ఎందుకివ్వరు?**

ఆరుగాలం కష్టపడి చివరికి శ్రమ ఫలితం గానీ, పెట్టుబడి గానీ దక్కని కౌలు రైతును తెలంగాణ ప్రభుత్వం రైతు అనదలచుకోలేదు. నిజానికి వీరికే పెట్టుబడి, విత్తనాలు, ఎరువులు, సాగునీరు, పురుగు మందులు, మార్కెటింగ్ కోసం ప్రభుత్వ సహాయం అవసరం. మొత్తం రైతాంగంలో 10 హెక్టార్ల పైన భూమి కలిగియున్న రైతులు కేవలం 14.2 శాతం మాత్రమే. మిగతా 85.8 శాతం చిన్న, సన్నకారు రైతులు ఉన్నారు. మొత్తంగా పెట్టుబడులు పెట్టి, యజమానికి కౌలు చెల్లించి సేద్యం చేసే రైతులు తెలంగాణలో కనీసం ముప్పై శాతంగా ఉన్న నిజమైన సాగుదారులైన కౌలు రైతులు రైతుబంధు పథకం పరిధిలోకి తీసుకురాకపోవడం అన్యాయమే కాదు పాలకుల దుర్బుద్ధికి పరాకాష్ఠ. మన గ్రామసీమలలో నిజంగా సాగు ఇబ్బందులను ఎదుర్కొంటున్నది వారు. సహాయం పొందవలసిన అవసరం, హక్కు ఉన్నవారు వారే. కాని ఏలినవారి పథకంలో వారికి స్థానం లేదు.

నిజానికి ఈ పథకాన్ని వాస్తవ సాగుదార్లకు అంటే, సాగుచేస్తున్న ధనిక రైతులు, మధ్యతరగతి, చిన్నకారు, సన్నకారు రైతులకు మాత్రమే వర్తింప చేయడం హేతుబద్ధంగా ఉంటుంది. కౌలు రైతులంతా ముఖ్యంగా మధ్య తరగతి, చిన్నకారు, సన్నకారు రైతులలోనే ఉంటారు. వారూ పెట్టుబడి పెడతారు. పంటలు పండిస్తారు. లాభ, నష్టాలకు లోనవుతారు. కాబట్టి వారికి కూడా ఈ పథకాన్ని వర్తింప చేయడం అనివార్యమైనది, న్యాయమైనది. కానీ మన ముఖ్యమంత్రి మాత్రం ససేమిరా కాదంటున్నారు. కౌలు రైతులకు రావలసిన ఆ సహాయాన్ని ఎవరికి ఇస్తారు? భూమిని కౌలుకు ఇచ్చే భూస్వాములకు ఇస్తారట. వాళ్లకు దేనికొరకు ఇవ్వాలి? వాళ్లేమైన పెట్టుబడి పెడుతున్నారా? భూమిని సాగు చేస్తున్నారా? పంటలు పండిస్తున్నారా? లాభ, నష్టాలకు లోనవుతున్నారా? ఏమీలేదే! అలాంటప్పుడు వారికెందుకివ్వాలి? దానికి బదులుగా వారు ఎవరికైతే కౌలుకు ఇస్తారో, ఆ కౌలు రైతులకు ఈ సహాయం అందించడం హేతుబద్ధంగానూ, న్యాయసమ్మతంగానూ ఉంటుంది.

తెలంగాణ ప్రభుత్వం, ముఖ్యమంత్రి కెసిఆర్ తరుచు ఘోషించే ఆదర్శ గ్రామం, గంగదేవిపల్లిని పరిశీలిస్తే కౌలు రైతుల పరిస్థితి ఏమిటో మనకు అర్థమౌతుంది. వారి పరిస్థితి కూలీలకంటే కూడా హీనంగా ఉంది. వారికి ఒకవేళ కౌలు వ్యవసాయంలో మిగిలినా, అది నామమాత్రంగానే ఉంటుంది. బతకాలంటే వారు అనివార్యంగా కూలి పనులు, పాడి, వృత్తులు, చిన్న చిన్న వ్యాపారాలు ఇట్లా అనేక రకాలుగా కష్టపడవలసి ఉంటుంది. వారికి బ్యాంకులు అప్పులు ఇవ్వవు. ఎరువులు, విత్తనాలు, సబ్సిడీ ధరలకు అందవు. ప్రకృతి వైపరీత్యాలలో జరిగిన నష్టానికి నష్ట పరిహారం ఇవ్వరు. ప్రభుత్వాలు ఇచ్చే ఏ రాయితీ వీరికి వర్తించదు. ఇట్లాంటి దయనీయ స్థితిలో ఉన్న కౌలు రైతులకు ముఖ్యమంత్రి రైతుబంధు పథకం సహాయాన్ని ఇచ్చేది లేదని తెగేసి చెబుతున్నారు. ఎంత దారుణం?

రైతు సమగ్ర సర్వేలో పోడు భూమి, ప్రభుత్వ భూమి, సాదాబైనామా కొనుగోళ్లను పక్కన పెట్టారు. వీటిని సాగుచేస్తున్న రైతులు రైతుబంధు సహాయాన్ని అందుకోలేరు. తెలంగాణలో ఈనాడు మొత్తం సాగుభూమిలో 35 శాతం కౌలు భూమి ఉందని తెలుస్తుంది. 2015-16 స్టాటిస్టికల్ బ్యూరో లెక్కల ప్రకారం తెలంగాణలో నికర సాగుభూమి 1,04,36,420 ఎకరాలు. ఇది సంవత్సర, సంత్సరానికి కొంత మారుతూ ఉంటుంది. నికర సాగుభూమిలో 35 శాతం కౌలుభూమి అంటే, అది 36,52,747 ఎకరాల వరకు ఉంటుంది. ఈ కౌలు భూమికి పెట్టుబడి సహాయం ఎకరానికి 4వేల చొప్పున లెక్కవేస్తే దాదాపు 1462 కోట్లు. రైతు బంధు ప్రకటిత లక్ష్యాలు మొదట వ్యవసాయాన్ని లాభసాటిగా చేయడం, రైతులను అప్పుల ఊబి నుంచి బయట పడవేసి ఆత్మహత్యలు నివారించడంగా పేర్కొంది. ఆచరణలో చూస్తే ఈ పథకం భూస్వామ్య అనుకూలంగా ఉండడం వల్ల కౌలు రైతులకు చెందవలసిన రు. 1462 కోట్లు భూకామాందులకు దోచిపెడుతున్నారు.

రైతుబంధు పథకం ఆచరణకు వచ్చేసరికి చిన్న, సన్నకారు, కౌలు

రైతులను విస్మరించి సేద్యం చేయని ఎదో పట్టణంలోనో, విదేశాలలోనో, వ్యాపారంలోనో, వృత్తిలోనో, ఉద్యోగంలోనో ఉండి ఇతర ఆదాయ మార్గాలే ప్రధాన ఆదాయంగా ఉండి, కేవలం తాతతండ్రుల నుంచి వారసత్వంగా సంక్రమించిన భూమికి యజమానిగా పేరు ఉంటే చాలు, ఎన్నడూ వ్యవసాయం చేయని అనుపస్థిత (గైర్ హాజరీ) భూస్వాములే ఇప్పుడు తెలంగాణ ప్రభుత్వం దృష్టిలో "రైతులు". వారికి అప్పనంగా ప్రజాధనం అప్పగించడానికి ఏలినవారు తయారుచేసిన పథకం రైతుబంధు. వ్యవసాయం చేయని, భూమితో సంబంధం లేని, కేవలం భూయజమానులకు చెక్కులు ఇవ్వడం వ్యవసాయ పెట్టుబడి ఏలా అవుతుందో కెసిఆర్ ప్రభుత్వానికే తెలియాలి. ప్రభుత్వ భూస్వామ్య అనుకూల విధానాల కారణంగా తెలంగాణ కౌలు, పోడు రైతాంగం నష్టపోతుంది.

**గిరిజన పోడు రైతులకూ పెట్టుబడి వద్దా?**

తెలంగాణలో దాదాపు 7 లక్షల ఎకరాల భూమిలో 2 లక్షల గిరిజనులు, గిరిజనేతర పేదలు పోడు చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం పోడు చేసే గిరిజనులకు రైతుబంధు పథకాన్ని వర్తింపచేయడంలేదు. పోడు వ్యవసాయం చేసే గిరిజనులు కూడా పెట్టుబడి సహాయానికి అర్హులు. కౌలు రైతులు కూలీ దోపిడీ, కౌలు దోపిడీలకు గురై ఆర్థికంగా దిగజారిపోతూ ఉంటే, గిరిజన రైతులు, మైదాన ప్రాంతాల నుండి వెళ్లిన భూస్వాముల దోపిడీకి, ఆ ప్రాంతాల్లో ఉన్న ఖనిజ సంపత్తిని దోపిడీ చేస్తున్న స్వదేశీ, విదేశీ కార్పొరేట్ సంస్థల దోపిడీకి గురై కడు దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. అలాంటి గిరిజనులు పెట్టుబడి పెట్టి పోడు వ్యవసాయం చేసి, పంటలు పండిస్తున్నారు. ఆ వ్యవసాయంలో వచ్చే లాభనష్టాలకు కూడా వారే బాధ్యులు. వాస్తవంగా సాగులో ఉన్న గిరిజనులకు పెట్టుబడి సహాయం అందడం న్యాయం.

సాగుభూమికి పట్టాలు లేనంత మాత్రాన వీరిని, కౌలు రైతులను పెట్టుబడి సహాయానికి దూరం చేయడం అన్యాయం. భూమి పట్టాల వారసత్వం మనకెక్కడ నుండి వచ్చింది? అది 200 ఏళ్లు మన దేశాన్ని కొల్లగొట్టిన బ్రిటిష్ వాళ్లు మనకిచ్చిపోయిన వారసత్వం. ఈ వారసత్వమే వ్యవసాయ రంగాన్ని ముందుకు పోకుండా బందీని చేసింది. ఆ వారసత్వాన్ని పట్టుకొని మన ముఖ్యమంత్రి కౌలు రైతులకు, పోడు వ్యవసాయదారులకు పెట్టుబడి సహాయాన్ని నిరాకరిస్తున్నారు. బ్రిటిష్ వాళ్లు పోయినా వారి వారసులే మనల పాలిస్తున్నరన్న సత్యం రైతుబంధు పథకంతో మరోసారి రుజువైంది.

**ముగింపు**

వ్యవసాయ సంక్షోభానికి కారణాలు అనేకం. 1960లలో ఉనికిలోకి వచ్చిన సస్య విప్లవం నుంచి ప్రపంచ వాణిజ్య సంస్థలో వ్యవసాయాన్ని చేర్చడం వరకు పాలకులు అనుసరించిన విధానాలు అన్నీ రైతు వ్యతిరేకమైనవే. వ్యవసాయరంగ సంక్షోభ మూలాలు తెలుసుకొని వాటి పరిష్కారం కోసం సమగ్ర కార్యాచరణ అమలు చేసినప్పుడే రైతాంగ సమస్యలు పరిష్కారమవుతాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక సంస్కరణల వలన వ్యవసాయ రంగమంతా స్వేచ్ఛా వాణిజ్య ఆర్థిక వ్యవస్థలోకి నెట్టబడింది. విత్తనాలు మొదలుకొని, పంట చేతికొచ్చి మార్కెట్‌లో అమ్ముకునేంతవరకు ఇదివరకున్న రక్షణ వ్యవస్థలన్నీ ధ్వంసమయ్యాయి. గతంలో పంటద్వారా వచ్చిన విత్తనాలను దాచుకొని మరుసటి ఏడాదికి విత్తనాలుగా రైతులుపయోగించే వారు. ఇప్పుడు రైతు విత్తన కంపెనీల చేతుల్లో ఇరుక్కుపోయాడు. విత్తన కంపెనీలు లాభాల కోసం జన్యుక్రమాన్ని తొలగించడం వలన పండిన పంట నుంచి తిరిగి విత్తనాలుగా ఉపయోగించే పరిస్థితి లేకుండా పోయింది. మార్కెట్ శక్తులు, బహుళజాతి సంస్థలు తమవద్దే వ్యవసాయ ఉత్పాదకాలను కొనే పరిస్థితి సృష్టించాయి.

ఈ నేపథ్యంలో నకిలీ విత్తన కంపెనీలు పుట్టుకొచాయి. నకిలీ విత్తనాలు మొలకెత్తక మళ్లీ విత్తనాలు కొనేయడం వలన పెట్టుబడి ఖర్చు రెండింతలు పెరిగిన సందర్భాలనేకం. కృత్రిమ రసాయన ఎరువులు వాడడం వలన భూసారం క్షీణించి పంట దిగుబడి తగ్గింది. ఎరువుల ధరలు ప్రతి ఏటా పెరుగుతున్నాయి. ప్రపంచ వాణిజ్య సంస్థలో భారత ప్రభుత్వం చేరి ఆహార ధాన్యాలను స్వేచ్ఛగా దిగుమతి చేసుకోవడానికి అనుమతించడం వల్ల భారత రైతాంగం ప్రపంచ దేశాల పోటీని తట్టుకోలేకపోతుంది. అగ్రరాజ్యాలు ఆ దేశాల రైతాంగానికి 40 నుంచి 60 శాతం వరకు సబ్సిడీ అందిస్తున్నాయి. మనదేశ రైతాంగానికి పదిశాతం మించని సబ్సిడి ఉండడం వల్ల రైతు పండించిన పంటకు గిట్టుబాటు కావడంలేదు. ఈ నేపథ్యాన్ని విస్మరించి రుణమాఫీ, రైతుబంధు పథకాలతో రైతాంగాన్ని విముక్తి చేస్తామనడం నేల విడిచి సాము చేయడం వంటిదే.

వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించాలంటే భూ సంబంధాలలో ప్రగతిశీల మార్పులు, సాగునీరు, సమతుల్యమైన పంటల విధానం, విత్తనాలపై రైతుల స్వావలంబన, రసాయన ఎరువులు, పురుగు మందుల వాడకంపై నియంత్రణ, మార్కెట్ వసతి, గిడ్డంగులు, గిట్టుబాటు ధరలు, రైతాంగానికి రుణపరపతి, గ్రామీణ స్వయం సమృద్ధి, స్వావలంబన సాధించే సమగ్ర వ్యూహం అమలు జరిగితేనే వ్యవసాయాన్ని సంక్షోభం నుండి బయటపడేయవచ్చు, రైతాంగం ఆత్మహత్యలు నివారించవచ్చు. అయితే తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ విధానాలు ప్రపంచ బ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థ నిర్దేశాల కనుగుణంగా ఉన్నాయి. మొత్తంగా చూస్తే తెలంగాణ ప్రభుత్వ రాజకీయార్థిక విధానాలు కొద్ది మందికి అంతకంతకు ఎక్కువ లబ్ధి చేకూర్చే, అశేష రైతాంగానికి నానాటికి ఎక్కువ నైరాశ్యం మిగిల్చే విధానాలు కొనసాగతున్నాయి.

పాలకులకు చిత్తశుద్ధి ఉంటే ప్రపంచ వాణిజ్య సంస్థ నుంచి బయటికి రావాలి. ఎరువులు, విత్తనాలు, పురుగు మందులు ఉత్పత్తి చేసే బహుళ జాతి సంస్థల పెత్తనం పోవాలి. ప్రభుత్వమే ఎరువులు, విత్తనాలు, పురుగు మందులు ఉత్పత్తి చేసి రైతులకు అందించాలి. అప్పుడే వ్యవసాయ రంగ సంక్షోభాన్ని నివారించగలం. అలాగే రైతు పండించిన ధరను రైతులే నిర్ణయించే పరిస్థితిని కూడా కల్పించాలి. రైతులకు విత్తన హక్కులు అమలు చేయాలి. వ్యవసాయ సంక్షోభాన్ని నివారించడానికి, వ్యవసాయ రంగాన్ని రైతు అనుకూలంగా మార్చడానికి భూసంస్కరణలు వంటి వ్యవస్థాగతమైన మార్పులతో పాటు పాలనపరమైన మార్పులు తక్షణం చేపట్టాలి. పాలకులు ఆ దిశలో విధానాలు రూపొందించే విధంగా సంఘటిత రైతాంగ ఉద్యమాలను నిర్మించాల్సిన కర్తవ్యం రైతు సంఘాలపై ఉంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# నేరమవుతున్న ప్రజాస్వామిక ఉద్యమాలు

***పాలకులు ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించకుండా హక్కుల కోసం గొంతెత్తుతున్న ప్రజాస్వామిక వాదులనే నేరస్తులను చేసి అరెస్టులతో ప్రజలను భయభ్రాంతులకు గురిచేసి నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నారని అంటున్నారు* డా. లక్ష్మణ్ గడ్డం**

ప్రజలు పోరాడి సాధించుకున్న హక్కులు, ప్రజాతంత్ర విలువలు పోలీసుల చేతిలో మంటగలుస్తున్నాయి. భారత రాజ్యాంగంలోని 19వ అధికరణ ప్రకారం పౌరులందరికీ వాక్ సభా స్వాతంత్ర్యాలున్నాయి. సంఘాలు పెట్టుకునే హక్కు ఉంది. తమ రాజకీయ విశ్వాసాలను, అభిప్రాయాలను ప్రకటించుకునే హక్కు, ప్రచారం చేసుకునే హక్కు ఉంది. కాని పాలకులకు మాత్రం ప్రజలకు ఈ హక్కులుండడం మింగుడు పడడం లేదు. కనుక అణచివేతకు, హింసకు పూనుకుంటుంది. నిర్బంధ పాలనలో చట్టబద్ధ పాలన బలవుతుంది. ప్రజల హక్కుల గురించి మాట్లాడితే, ఉద్యమిస్తే, నిరసన ప్రదర్శనలకు దిగతే నేరమయం చేస్తున్నారు. పోలసులను వాడుకుని హింసాత్మకం చేస్తున్నారు. పోలీసులు నిరసన కారులను అదుపుచేసే చట్టబద్ధ విధి నిర్వహణను 'ప్రెస్టేజి'గా భావిస్తున్నారు. ఈ సమయంలోనే తుపాకులు చేతబూని తమ ప్రభు భక్తి ప్రదర్శనకు తాపత్రయ పడుతున్నారు. అసలు సమస్య ఇక్కడే వస్తుంది.

2018 జూన్ 6న ఉదయం 9 గంటలకు వరంగల్‌లో డెమొక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ అధ్యక్షులు కంచెర్ల బద్రి, తన మిత్రులు మంద రంజిత్, గుండేటి సుధీర్‌లతో కలిసి టి తాగడానికి బయటికెళ్లబోతుండగా ఇంటి ఆవరణలోనే సివిల్ డ్రస్సులో వచ్చిన పోలీసులు మూకుమ్మడిగా ఆకస్మాత్తుగా దాడిచేసి ఎత్తుకుని పోయారు. వరంగల్ పోలీసులు ఎత్తుకుపోయి ఖమ్మం పోలీసులకు అప్పజెప్పారు. నాలుగు రోజుల వరకు అరెస్టు ప్రకటించలేదు. కుటుంబీకులు తీవ్ర ఆందోళనకు గురయ్యారు. ప్రజా సంఘాల నాయకులు హోం మంత్రిని కలిసి వివరిస్తే తప్ప ఆయనకు విషయం తెలియదు. హోం మంత్రి మొదలు వరంగల్ కమిషనర్‌కు అక్కడి నుండి కొత్తగూడెం పోలీసు సూపరింటెండెంట్‌కు చేస్తే అరెస్టు ధృవీకరించబడింది. ఈ లోగా తోటి విద్యార్థులు ఉస్మానియా యూనివర్సిటీ పోలీస్ స్టేషన్ ముందు ధర్నాకు దిగితే ఎక్కడో ఘటన జరిగితే మా పోలీస్ స్టేషన్ ముందు ధర్నా చేస్తారా అని భగ్గుం చేశారు. ముగ్గురు విద్యార్థులు కిడ్నాప్‌కు గురైతే పోలీసులు స్పందించిన తీరు వారి పని విధానానికి, ప్రజల ఎడల వారికున్న ఆసక్తికి అద్దం పడుతుంది. వీరు ఎవరిని రక్షిస్తారో, ఎవరిని భక్షిస్తారో స్పష్టమవుతుంది.

చివరికి పోలీసులు భద్రాచలం డివిజన్, వెంకటాపురం మండలం కొత్తపల్లి జంక్షన్ వద్ద పట్టుకున్నామని తెలుపుతూ, జిలెటిన్ స్టిక్స్, పేలుడు పదార్థాలు దొరికాయని చూపెడుతూ యుఎపిఎ చట్టం కింద కేసులు నమోదు చేసి జైలుకు పంపారు. గతంలో కూడా తెలంగాణ విద్యార్థి వేదిక అధ్యక్షుడు మహేష్‌ను కూడా ఇదే రీతిలో కిడ్నాపు చేశారు. 2017 అక్టోబర్ 17న మహేష్ తన మిత్రుడు క్రాంతితో కలిసి రాత్రి 8 గంటలకు సుందరయ్య విజ్ఞాన కేంద్రం వద్ద టి తాగి కొంచెం ముందుకు కదలగానే ఆటోలో మఫ్టీలో వచ్చిన పోలీసులు ఆకస్మికంగా ఇద్దరి మీద దాడిచేసి లాక్కుని ఆటోలో పడేసుకొని వెళ్లిపోయారు. కొద్ది దూరం వెళ్లగానే రెడీగా ఉన్న టాటా సుమోలో ఎత్తి పడేసి నల్గొండ జిల్లా వైపు తీసుకెళ్లి మార్గ మధ్యలోనే రోడ్డుకు దూరంగా చెట్లలోకి తీసుకెళ్లి విపరీతంగా కొట్టారు. నిందితులను బహిరంగ ప్రదేశాల్లో చీకట్లో పడేసి రౌడీల్లా మీదపడి కొట్టే అధికారం పోలీసులకు ఏ చట్టాలిస్తున్నాయి? మళ్లీ కొంత దూరం వెళ్లాక కారులో ఎక్కించుకుని కేతెపల్లి పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్లారు. ప్రజా సంఘాల నాయకులు హోం మినిస్టర్‌ను కలిసి నల్గొండ జిల్లా ఎస్‌పితో మాట్లాడిస్తే అప్పుడు ఆ ఇద్దరిని నకిరేకల్ పోలీస్ స్టేషన్‌కు తీసుకుని వచ్చి అరెస్ట్ చూయించారు. మావోయిస్టులతో సంబంధాలున్నాయని అక్రమ కేసులు బనాయించి జైలుకు పంపారు.

2016 జూన్ 11న ఉదయం తొమ్మిది గంటలకు వరంగల్ పోలీసులు మఫ్టీలో ఆటోలో తాడ్వాయి మండలం నార్లాపూర్ చేరుకున్నారు. కోయ కులస్థుడైన సిద్దబోయిన శివరాజు (26)ను దగ్గరికి పిలుచుకొని కొద్దిసేపు మాట్లాడి అకస్మాత్తుగా రెక్కలు విరిచిపట్టి ఆటోలో లాగిపడేసుకుని వెళ్లిపోయారు. నా కొడుకుని ఎత్తుకుపోయింది దొంగలా దొరలా తేల్చుకోలేక తల్లి కంటికి పుట్టెడు ఏడ్చింది. శివరాజు దగ్గర జిలెటిన్ స్టిక్స్, డిటోనేటర్లు దొరికాయని మావోయిస్టు పార్టీకి కొరియర్‌గా వ్యవహరిస్తున్నాడని కేసులు పెట్టి జైలుకు పంపారు.

తెలంగాణ పోలీసులు విద్యార్థుల భవిష్యత్తును భంగం చేస్తున్నారు. ఏ విద్యార్థులైతే తెలంగాణ కోసం తెగించి పోరాడి సాధించుకున్నారో వారికే తెలంగాణ సమాజంలో నిలువ నీడలేకుండా చేస్తున్నారు.

దేశ వ్యాప్తంగా మరోవైపు మేధావులను, హేతువాదులను, పత్రికా ప్రతినిధులను హత్య చేస్తున్నారు. గౌరీ లంకేశ్‌ను, గోవింద పన్సారేను, దభోల్కర్‌ను, కల్బుర్గిని మతవాదం నెత్తికెక్కిన వాళ్లు తుపాకులతో కాల్చి చంపారు. ప్రత్యామ్నాయ విశ్వాసాలను, హేతుబద్ధ భావాలను గౌరవించే సహనం కోల్పోయి హత్యలు చేస్తున్నారు.

దేశంలో ఒకే రాజకీయ నేపథ్యం చెలామణి అవ్వాలని, అది హిందూ రాజకీయం కావాలని పాలక వర్గ పార్టీలు కోరుకుంటున్నాయి. వామపక్ష తీవ్రవాదంతో లింకు పెట్టి ప్రజల రాజకీయ స్వేచ్ఛను బలిగొంటున్నారు. చట్టబద్ధ పాలన స్థానంలో పోలీసుల పాలన నెలకొంటుంది. అన్ని సమస్యలకు పోలీసులతో సమాధానం చెప్పిస్తున్నారు. పోలీసులేమో తుపాకి గొట్టం ద్వారానే శాంతి భద్రతలు సిద్దిస్తాయని భావిస్తున్నారు. గత నెలలో తమిళనాడులోని తూత్తుకుడిలో స్టెరిలైట్ రాగి పరిశ్రమకు వ్యతిరేకంగా

పోరుబాట పట్టిన నిరసన కారులను 13 మందిని పొట్టన పెట్టుకున్నారు. 'కనీసం ఒక్కడైనా చావాలి' అనే లక్ష్యంతో పోలీసులు కాల్పులకు ఒడిగట్టారు. ఈ మారణకాండను ప్రభుత్వాలు సమర్థించిన తీరును చూసిన ప్రజలు బిత్తరపోయారు. ప్రజాందోళనలు జరిగేటప్పుడు నిరసన కారులను అదుపు చేయడంలో ప్రత్యేక శిక్షణ ఇవ్వాలని 2016లో సుప్రింకోర్టు ఇచ్చిన తీర్పును తప్పుగా అన్వయించుకుని ఆందోళనలు జరుగుతున్నప్పుడు కనీసం ఒక్కరినైనా చంపమని శిక్షణ ఇస్తున్నారేమో! 2000 ఆగస్టు 28న విద్యుత్తు చార్జీలు తగ్గించమని డిమాండ్ చేస్తూ చేపట్టిన నిరసన ర్యాలీపై పట్టపగలు చంద్రబాబు పోలీసులు కాల్పులు జరిపి రామకృష్ణతో సహా నలుగురు యువకులను కాల్చి చంపారు.

2018 ఏప్రిల్ 22న గడ్చిరోలి పోలీసులు ఛత్తీస్‌గడ్ భూ భాగంలోకి చొరబడి ఇంద్రావతి నది ఒడ్డున మావోయిస్టుల క్యాంపుపై దాడిచేసి ఏకపక్ష కాల్పులు జరిపి 40 మంది ఆదివాసీ, మావోయిస్టుల బృందాన్ని కాల్చి చంపారు. ఇందులో 25 మంది సాధారణ ప్రజలు, 21 మంది మహిళలున్నారు. సాధారణ ప్రజలు, మైనర్ బాల బాలికలున్నారని తెలిసి కూడా కాల్చి చంపారు. ఘనకార్యం చేసినట్లుగా సంబురాలు జరుపుకున్నారు. శతృదేశ సైనికులను చంపినప్పుడు కూడా సంబురాలు జరగవు. కాని మహారాష్ట్ర పోలీసులు సంబురాలే కాదు అవార్డులు, రివార్డులు కూడా పొందారు. చట్టబద్ధంగా వ్యవహరించాల్సిన పోలీసులు చట్ట వ్యతిరేక చర్యలకు పాల్పడుతున్నారు. శిక్షించాల్సిన ప్రభుత్వాలు ప్రోత్సహిస్తున్నాయి. ఇక ఈ వైనాన్ని మార్చాల్సిందెవరు.

మహారాష్ట్ర పోలీసులకు సరిహద్దులు దాటి హత్యలు చేయడం, అరెస్టులు చేయడం, అక్రమ కేసులు బనాయించడం కొత్తేమీ కాదు. గతంలో ఢిల్లీలో ఉంటున్న సాయిబాబాను ఢిల్లీ వెళ్లి అరెస్టు చేశారు. జూన్ 6న ఒక కళాకారుడు, న్యాయవాది, ఒక ప్రొఫెసర్, ఇద్దరు సామాజిక కార్యకర్తలను ఇళ్ల మీద దాడిచేసి అరెస్టు చేశారు. జూన్ 6 పూణె పోలీసులు న్యాయవాది, అఖిల భారత ప్రజాన్యాయ వాదుల సంఘం నాయకుడు సురేంద్ర గాడ్లింగును, విస్థాపన వ్యతిరేక ఉద్యమ నేత మహేష్ రావత్‌ను, నాగపూర్ యూనివర్సిటీ ప్రొఫెసర్ సోమాసేన్ లను నాగపూర్‌లో అరెస్టు చేశారు. పకడ్బంది సమన్వయ సహకారంతో దళిత ఉద్యమ నాయకుడు సుధీర్ దావ్లేను బొంబాయిలో, ప్రజాన్యాయ వాదుల సంఘం ప్రజా సంబంధాల కార్యదర్శి, కళాకారుడు రోనావిల్సన్‌ను ఢిల్లీలో అరెస్ట్ చేసి పూణె పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించారు. న్యాయమూర్తి వీరిని 15 రోజులు పోలీస్ కస్టడీకి ఆదేశించాడు. జూన్ 6న అరెస్ట్ చేసిన వారిని జూన్ 23 వరకు కస్టడీ పొడిగించారు. వీళ్లు చేసిన అంత పెద్ద నేరమేమంటే మావోయిస్టులు వెనక ఉండి నడిపించిన భీమా కొరెగాం సభలో రెచ్చగొట్టే ప్రసంగాలు చేశారని. అందుకని అల్లర్లు చెలరేగి ఒకరి మృతికి కారణమయ్యాయని, వీటిని గురించి తెలుసుకోవడానికి పోలీసులకు 15 రోజులు పడుతుందని న్యాయమూర్తి భావించడం ఎంత న్యాయబద్ధంగా ఉందో! ఇంకా ఏఏ కేసులు పెడతారో వేచి చూడాల్సింది. నిజానికి భీమా కొరెగాం ఘర్షణలకు కారకులైన హిందుత్వ సంస్థల నాయకులు మిలింద్ ఎక్బోటె, సంభాజీ బిడేలు స్వేచ్ఛగా తిరుగుతున్నారు. ఎవరు జైల్లో ఉండాలో వాళ్లు స్వేచ్ఛగా ఉన్నారు. ఎవరు స్వేచ్ఛగా ఉండాలో వాళ్లు జైల్లో ఉన్నారు. నిజానికి ఒక్క దావ్లే తప్ప ఇంకెవరూ ఆనాటి సభలో లేరు.

2017 డిసెంబర్ 31 నాటి భీమా కొరెగాం ఘటన నేపథ్యంలో పోలీసులు ఏప్రిల్ 17న ఢిల్లీలో రోనా విల్సన్ రూం మీద, నాగపూర్‌లో సురేంద్ర గాడ్లింగ్, సుధీర్ దావ్లే ఇంటి మీద రైడింగ్ చేసి కంప్యూటర్‌తో పాటు ముఖ్యమైన వస్తువులను తీసుకెళ్లారు. ఈ సర్చ్ ఆపరేషన్స్ 2018 ఏప్రిల్ 17న జరిగితే పూణెలోని విశ్వాంబాగ్ పోలీసులు ఎఫ్ఐఆర్ నం. 4/2018లో జనవరి 2018 నాటి నేరంగా నమోదు చేశారు. అంటే వీరిని కక్షపూరితంగా కొరెగాం హింసాత్మక సంఘటనలకు బాధ్యులుగా చిత్రీకరిస్తూ అక్రమ కేసులు బనాయించారు. లౌకిక రాజ్యంలో మతం రాజ్యమేలుతుంది. సమన్యాయమనే విలువ గొంతునులిమి చంపబడుతోంది.

వాస్తవానికి సురేంద్ర గాడ్లింగ్ నాగపూర్‌లో ప్రముఖ న్యాయవాది. దళిత, ఆదివాసి, రాజకీయ ఖైదీల హక్కుల కోసం పోరాడుతున్న హక్కుల కార్యకర్త. అఖిల భారత ప్రజాన్యాయ వాదుల సంఘానికి సెక్రెటరీ జనరల్‌గా పనిచేస్తున్నాడు. అక్రమంగా జైల్లో నిర్బంధించబడిన సాయిబాబాకు న్యాయవాదిగా కొనసాగుతున్నాడు. రోనా విల్సన్ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయంలో, ఢిల్లీలో తెలంగాణ అంశం మీద పిఎచ్‌డి చేస్తున్నాడు. రాజకీయ ఖైదీల విడుదల కమిటీలో ప్రజా సంబంధాల కార్యదర్శిగా కూడా పనిచేస్తున్నాడు. సుదీర్ దావ్లే దళిత ఉద్యమాల్లో క్రియాశీలకంగా పనిచేస్తున్నాడు. ముంబై నుంచి వెలువడుతున్న 'విరోధీ' పత్రికకు ఎడిటర్‌గా పనిచేస్తున్నాడు. ప్రొ. సోమాసేన్ నాగపూర్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. ప్రజా ఉద్యమాల్లో ముఖ్యంగా మహిళల హక్కుల కోసం గత 30 సంవత్సరాలుగా పనిచేస్తున్నారు. మహేష్ రావత్ టాటా ఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ పూర్వ విద్యార్థి. విద్యార్థిగా ప్రతిష్ఠాత్మకమైన ప్రధాన మంత్రి గ్రామీణాభివృద్ధి పథకం ఫెలోషిప్ కూడా పొందాడు. ప్రస్తుతం విస్తాపనకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నాడు. వీరు భీమా కొరెగాం హింసాత్మక ఘటనలకు బాధ్యులైన వారిని అరెస్టు చేయాలని ఉద్యమిస్తున్నందుకు వీరినే అరెస్ట్ చేసి జైల్లో నిర్బంధించారు.

ఈలోగా పూణె పోలీసులు కొత్త నినాదానికి తెరలేపారు. 2018 ఏప్రిల్ 17న ఢిల్లీలో రోనా విల్సన్ వద్ద జప్తు చేసుకున్న ల్యాప్‌టాప్‌లో ఒక లెటర్ దొరికిందని, అందులో ప్రధాని నరేంద్ర మోడీ హత్యకు చేసిన కుట్రకు సంబంధించిన వివరాలున్నాయని నేరుగా మీడియాకు విడుదల చేశారు. ఎల్‌టిటిఇ శ్రీ పెరంబదూర్‌లో ఆత్మాహుతి దాడితో హత్య చేసిన రీతిలోనే మోడీని కూడా అంతమొందించాలని ఆ లేఖలో ఉందని పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఉజ్వల పవార్ పేర్కొన్నారు. మోడీ హత్యకు మావోయిస్టులు రు. 8 కోట్ల డీల్‌తో పథకం రచించారని, ఆ మొత్తం డబ్బులు విప్లవ రచయిత వరవరరావు సమకూర్చుతారని, ఈ విషయం లేఖలో ఉందని మీడియా ఛానళ్ల ద్వారా ప్రచారం చేశారు. అయితే ఈ లేఖ సృష్టించిందని అది ప్రచార స్టంటు అని సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ సావంత్ వ్యాఖ్యానించారు. ఈ లేఖల సృష్టి కేవలం ప్రచార జిమ్మిక్కు మాత్రమే అని పేర్కొన్నారు. కోర్టు అధీనంలో ఉన్న లేఖ వెంటనే బిజెపి అధికార ప్రతినిధి వద్దకు ఎలా చేరిందని జస్టిస్ కాల్సె పాటిల్ ప్రశ్నించారు. నకిలీ ఆధారాలతో వరవరరావుపై కుట్రపన్నే

# నిమ్నజాతులపై అత్యాచారాలు - న్యాయస్థానాల వైఖరి

***ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల (నిరోధక) చట్టానికి తూట్లు పొడుస్తూ సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు నేపథ్యంలో అత్యాచారాలపై న్యాయస్థానాల వైఖరిని వివరిస్తున్నారు* కల్లోజి సుశీల్ కుమార్**

'ఏ పోరాటంలో అయినా నిమ్న జాతులు ఒకపక్క, హిందువులలో అగ్రకులాలవారు మరొకపక్క ఉన్నప్పుడు పోలీసు బలగం ఎప్పుడూ కూడా హిందూ నియంతృత్వ మెజారిటీతోనే జతకడుతుంది. ఎందుకంటే అటు పోలీసుల్లో గాని ఇటు న్యాయ వ్యవస్థలో గాని నిమ్న జాతులకు అసలు స్థానమంటూ లేకపోవడమే' అంటారు బాబా సాహెబ్ అంబేడ్కర్. 1928లో తను చెప్పిన ఈ మాటలు సరిగ్గా 90 ఏండ్ల తరువాత ఈ మధ్య జాతి అత్యున్నత న్యాయస్థానం ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టంపై ఇచ్చిన తీర్పు అంబేడ్కర్ చెప్పిన మాటలను నిరూపించింది.

ఈ దేశంలో కొన్ని వేల సంవత్సరాలుగా కుల వివక్షకు గురౌతున్న నిమ్న జాతులు చేసిన అనేక పోరాటాల ఫలితంగా సాధించుకున్న హక్కు (ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం). నిమ్న జాతులు ఏ విధంగానైతే వివక్షకు గురౌతూ వస్తున్నారో వారికోసమే రూపొందించిన చట్టం కూడా అదే వివక్షను ఎదర్కొంటూ వస్తోంది.

1950లో రాజ్యాంగం జాతికి అందించిన ఆర్టికల్ 17తో సంక్రమించిన అధికరణ ద్వారా పాలకులు ఈ దేశ ప్రజలకు చేసిన వాగ్దానం ఏమంటే 'అంటరానితనం నేరం దాన్ని సమూలంగా నిర్మూలిస్తామని' కాని స్వతంత్ర్యం వచ్చిన కొన్నినాల్లకే నాయకుల కుటిల నీతి అర్థమైంది. అంటరానితనం రూపుమాపాలంటే దానికో చట్టం కావాలి. చట్టాన్ని రూపొందించకుండా ఆలస్యం చేయడంలోనే అంటరానితనంపై మన పాలకులకున్న చిత్తశుద్ధి అర్థమౌతుంది. అంటరానితనం అమానుశం, నేరం, శిక్షార్హం అన్నారు. కాని ఆ దిశగా అంటరానితనం నిర్మూలనకు ప్రభుత్వం చేపట్టిన చర్యలు ఎక్కడా అంటరానితనాన్ని పోగొట్టలేదు. పాలకులు రాజ్యాంగం సాక్షిగా ప్రకటన చేసినప్పటికీ దళితులు, గిరిజనులపై దాష్టికం, దుర్మార్గాలు ఆగలేదు. దేశంలో వచ్చిన అనేక ప్రజా పోరాటాలకు దిగొచ్చిన ప్రభుత్వాలు 1955లో మొట్ట మొదటిసారి అంటరానితనం 'నేరాలు' అనే చట్టాన్ని రూపొందించింది. ఇది దళితులపై కొనసాగుతున్న వివక్షను రూపుమాపలేకపోయింది. 1976లో పౌరహక్కుల రక్షణ చట్టం తెచ్చారు.

---

ప్రయత్నం చేస్తున్నారు.

ఈ అక్రమ అరెస్టుల పరంపర ఇంకా కొనసాగుతూనే ఉంది. ఎప్పుడొచ్చి పోలీసులు ఎవరిని తన్నుకుని పోతారోనన్న ఆందోళనతో ఉన్నారు. జూన్ 10న కోట శ్రీనివాస్, బండి దుర్గాప్రసాద్‌లు మలక్‌పేటలో అడ్వకేట్‌ను కలిసి బైకుపై తిరిగి వస్తుండగా మరో బైకుపై వెంబడించిన పోలీసులు చాకచక్యంగా కోట శ్రీనివాస్ నడుపుతున్న బైకు తాళాలు లాక్కుని బండిని ఆపేశారు. క్షణాల్లో టక్కున దూసుకుని వచ్చిన ఓ మిని వ్యాన్‌లో బండి దుర్గా ప్రసాద్‌ను రెక్కలు విరిచిపట్టి లాగి వ్యాన్‌లో పడేసుకుని తీసుకునిపోయారు. కోట శ్రీనివాస్‌ను తోసి కింద పడేశారు. నడిరోడ్డు మీద పట్ట పగలు జరిగిన ఈ ఘటన చూసిన జనం ఒక్కసారిగా బిత్తర పోయారు. సాధారణ డ్రస్సులో ఉన్న ఆ వ్యక్తులు రౌడీలా, గూండాలా ఆందోళనకు గురై మీరెవరని ప్రశ్నిస్తే అప్పుడు చెప్పుకున్నారు. మేం పోలీసులమని. మరి పోలీసులు గూండాల్లా ప్రవర్తిస్తే ఇక తెలంగాణకు ఇన్ని త్యాగాలు ఎందుకు చేసినట్లు? ఏదైనా ఆరోపణలున్న వ్యక్తిని ప్రజాస్వామిక వ్యవస్థలో అరెస్టు చేసే విధానం ఇదేనా? మాజీ మంత్రి చిదంబరాన్ని ఈ విధంగా ఈ పోలీసు వ్యవస్థ అదుపులోకి తీసుకోగలదా! మర్యాదగా పిలిపించి ప్రశ్నించి పంపించారు కదా! అరెస్టు చేసే విధానానికి సంబంధించి చట్టాలు ఏం చెపుతున్నాయో పోలీసులకు తెలియనిదా? మరి చట్టాలను వ్యతిరేకించే పోలీసులను శిక్షించేదెవరు? చట్టాలను చట్ట వ్యతిరేకంగా ఒకరి విషయంలో అమలు పరచడం, చట్ట బద్ధంగా ఇంకొకరి విషయంలో అమలు పరిచే విధానాన్ని పోలీసులు ఎప్పుడు మార్చుకుంటారో!

నిర్బంధం విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒకే పాలసీ విధానాన్ని అమలు చేస్తున్నాయి. వేల కోట్ల ప్రజల సొమ్మును దోచుకుని, దాచుకున్న విజయ్ మాల్య, నీరవ్ మోడీలు కేంద్ర ప్రభుత్వానికి కరుడుగట్టిన నేస్థులుగా కనిపించడం లేదు. కశ్మీర్‌లో చిన్నారులపై అత్యాచారాలు చేసిన నేరస్థులకు మద్దతుగా మంత్రులు ర్యాలీలు నిర్వహించినా దాన్ని ప్రభుత్వం నేరంగా భావించదు. అయితే ఆదివాసి ప్రాంతాలన్నింటినీ పారా మిలటరీ బలగాలతో నింపేసి ఆదివాసులను బలవంతంగా నిర్వాసితులను చేస్తూ అత్యంత విలువైన సహజ సంపదను బహుళజాతి కంపెనీలకు దోచిపెడుతున్నారు. ఈ దోపిడీని వ్యతిరేకించే ఆదివాసులను ఆపరేషన్ సమాధాన్‌తో సమాధానం చెబుతున్నారు. ఈ అణచివేత హింసా విధానాలను వ్యతిరేకిస్తున్న మైదాన ప్రాంత మేధావులను అక్రమంగా అరెస్టులు చేసి నల్ల చట్టాల సెక్షన్లను ప్రయోగించి ఏళ్ల తరబడి జైళ్లలో నిర్బంధిస్తున్నారు.

ప్రజాస్వామ్య వాదులను జైల్లో వేయడాన్ని ప్రశ్నిస్తూ మిగిలిన ప్రజాస్వామ్య వాదులందరు ప్రతిఘటించాలి. లేకపోతే చట్ట విరుద్ధ చర్యలకు రాజ్యవ్యవస్థ పాల్పడడం కొనసాగితే మనవంతు దగ్గర పడుతుంది.

*(రచయిత లధ్యక్షుడు, పౌరహక్కుల సంఘం)* వీ

అయినా దళిత గిరిజనులపై దాడులు ఆగకపోగా మరిన్ని దాడులు పెరిగాయి. ఇది గమనించిన ప్రభుత్వాలు 1989లో మరో చట్టాన్ని తీసుకొచ్చింది. అదే 'ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం'. ఈ చట్టం రూపొందించడానికి ముందు 1968 డిసెంబర్ 25న తమిళనాడులోని కీలవేన్‌మణిలో దళితుల ఊచకోత దేశాన్నే కుదిపేసింది. కేవలం కూలీ గిట్టుబాటు ధర పెంచండని అడిగినందుకు దళిత గూడెంపై మారణాయుధాలతో చుట్టుముట్టి గుడిసెలను గడ్డి, కట్టెలతో తగులబెట్టి 44 మంది మహిళలతో సహా చిన్నారులను సజీవదహణం చేసిన అమాణవీయ సంఘటనది. ఒక ప్రాంతమని కాకుండా దేశవ్యాప్తంగా ఈ తరహా దాడులు జరుగుతూనే ఉన్నాయి. బీహార్‌లో ఎమ్.సి.పి.ఐ., మావోయిస్టు పార్టీలు కూలీలను, దళితులను, ఇతర బలహీన వర్గాలను చైతన్యపర్చి భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటాలను చేస్తున్నందుకు కక్షగట్టిన భూస్వాములు, భూమిహార్, రణభీర్ సేనా పేరిట ప్రైవేటు సైన్యాన్ని ఏర్పాటు చేసుకొని 1977లో 'భెల్చి' ప్రాంతంలో 11 మంది దళితులను సజీవ దహనం చేసింది. ఆధిపత్య కుల దురహంకారులకు మానవతా విలువలు ఉండవనే వాస్తవాన్ని 1985 జులై 17న కారంచెడులో ఆరుగురు యువకుల హత్య, 1991 ఆగస్టు 6న చుండూరులో 8 మంది దళితుల హత్యలు నిరూపించాయి. ఆ తర్వాత కూడా దళితులు, ఆదివాసులు, ఇతర బలహీన వర్గాలపై దాడులు జరుగుతూనే వచ్చాయి. దీని పర్యావసానంగా ప్రభుత్వాలపై దళితుల, ప్రజా సంఘాల ఆందోళనలతో 'ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టాన్ని' మరింత పటిష్టపర్చి అమలు చేయాలనే ఆలోచనకు ప్రభుత్వాలు అనివార్యంగా రాక తప్పలేదు. ఇందుకోసం అప్పటికే అమల్లో ఉన్న 1989 నాటి ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టానికి ఆరు సంవత్సరాలు ఆలస్యంగా 1995లో విధి విధానాలను రూపొందించింది ప్రభుత్వం. ఏ చట్టానికైనా విధి విధానాలనేటివి చాలా ప్రాముఖ్యమైన అంశం. చట్టంతో పాటే విధి విధానాలు రూపొందిచబడతాయి. బాధితుల రక్షణ చర్యల నుండి ఎవరెవరు ఏ విధులు నిర్వర్తించాలి, ప్రత్యేక న్యాయస్థానాల విధులేంటి, ఎస్.ఐ నుండి ఎస్.పి దాక, కలెక్టర్ నుండి ముఖ్యమంత్రి దాకా ఎవరి బాధ్యత ఎంత అనే విషయాలను విధి విధానాలు నిర్వచిస్తాయి. నేరస్తులకు శిక్షలు కరారు చేయడంలో విధి విధానాల పాత్ర చాలా కీలకం. అటువంటి ప్రాధాన్యత కలిగిన అంశాలను చట్టం రూపొందించిన ఆరు సంవత్సరాలకు రూపొందించారంటే, ఈ చట్టంపై పాలకుల కుటిల నీతి వేరే చెప్పాల్సిన పనిలేదు.

1950లో రాజ్యాంగం 'అంటరానితనం నేరం' అనే హెచ్చరిక చేసినా, 1955లో అంటరానితనం (నేరాలు) అనే చట్టం తీసుకొచ్చినా, 1976లో పౌరహక్కుల రక్షణ చట్టం అమలు చేసినా ఈ చట్టాలేవి కీలవేన్‌మణి, బెల్చి, నారాయణపూర్, కారంచెడు, చండూరు, లక్ష్మింపేట లాంటి ధారుణాలను ఆపలేక పోయింది. ఒకవైపు నిమ్న జాతుల నిరసనలతో చట్టం బలోపేతం అవుతున్న క్రమంలోనే దళితులు, ఆదివాసీలపై దాడులు పెరుగుతూ వచ్చాయి. ఎస్‌సి, ఎస్‌టి చట్టానికి ఆలస్యంగానైన విధి విధానాలు రూపొందించిన ప్రభుత్వం దళితులు, ఇతర బలహీన వర్గాలపై జరుగుతున్న అకృత్యాలను మాత్రం ఆపలేకపోయింది. వామపక్షాల ఆధ్వర్యంలో సంఘటితమై కూలీ రేట్లు పెంచాలని, లేని పక్షంలో భూస్వాముల భూముల్లో పనులు చేయబోమని అన్నందుకు కక్ష పెంచుకున్న బీహార్ భూస్వాముల సైన్యం రణవీర్ సేనా 1996 జులై 11న 'భటానితోలా' ప్రాంతంలో 21 మంది దళితులను దారుణంగా హత్య చేసింది. ఈ సంఘటనలో చనిపోయిన వారిలో ఎక్కువ మంది స్త్రీలు, పిల్లలే.

రణవీర్ సేనా, భూమి హార్‌లు కొనసాగించిన హత్యాకాండలో అత్యంత హేయమైనది పెద్దదిగా చెప్పుకునేది 1977 డిసెంబర్ 1న బీహార్‌లోని సోన్ నదీ పరివాహక ప్రాంతంలోని 'లక్ష్మిపూర్ భాతే' గ్రామంలో జరిగిన ఘాతుకం. ఆ రోజు అర్ధరాత్రి దాటాక దాదాపు వందమంది రణవీర్ సేనా కార్యకర్తలు యథేచ్ఛగా ఇళ్లల్లో నిద్రిస్తున్న దళితులను కాల్చి చంపారు. దాదాపు మూడు గంటల పాటు కొనసాగిన ఈ మారణకాండలో 63 మంది దళితులు ప్రాణాలు కోల్పోయారు. ఈ సంఘటనపై అప్పటి రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ స్పందిస్తూ స్వతంత్ర భారతదేశంలోనే ఇది అత్యంత హేయమైన చర్యగా అభివర్ణించారంటే రణవీర్ సేనా సృష్టించిన మారణ హోమ తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

'రాజ్యాంగంలోను, ఇతర చట్టాలలోను విస్తృతమైన అధికారాలు ఉన్నప్పటికీ, ఇప్పడికి షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు, ఇతర బలహీన వర్గాలపైన సాంఘిక అన్యాయం, దోపిడీ జరుగుతూ ఉన్నాయనేది ఒక దురదృష్టకరమైన వాస్తవం. ఈ వర్గాల వారిపై అత్యాచారాలు జరుగుతూనే ఉన్నాయని, అవి మాటి మాటికి జరుగుతూనే వస్తున్నాయని పత్రికలలో వార్తలు రావడం చూస్తే మనస్థాపం కలుగుతుంది. భారతదేశం గణతంత్ర దేశంగా ప్రకటించుకొని యాభై సంవత్సరాలు అయిన తర్వాత కూడా దళితులు, ఆదివాసీలు అవమానాలకు గేరవుతూనే ఉన్నారనేది మనం సిగ్గుపడవలసిన విషయం'. ఈ మాటలు ఎవరో అన్నవి కాదు నేషనల్ హ్యూమన్ రైట్స్ కమిషన్ (ఎన్‌ఎచ్‌ఆర్‌సి) చైర్మన్ 2002లో అన్నవి.

'తన తోటి మనుషులను అవమానపాలు చేయడం ద్వారా ఎటువంటి గౌరవాన్ని తాము పొందుతారో నాకయితే అర్థం కావడంలేదని' ఆయన ఆవేదన చెందారు. (ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు, బొజ్జాతారకం, పుట-6).

కాని, ఇలాంటి వారి ఆవేదనను రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు, నాయస్థానాలు ఏనాడు పట్టించుకోలేదు. ప్రభుత్వాలు అనుసరించిన కుత్రపూరితమైన విధానాల కారణంగానే దేశంలో దళితులు, గిరిజనులు, ఇతర బలహీన వర్గాలపై దాడులు ఆగలేదనేది అందరూ అంగీకరించాల్సిన వాస్తవం. అట్రాసిటీస్ చట్టం రూపొందించడంలోనే వివక్ష కొనసాగిందనడానికి చట్టం రూపొందించిన ఆరు సంవత్సరాల తర్వాత దాని విధి విధానాలను రూపొందించడమే ఇందుకు నిలువెత్తు నిదర్శనం. పేరుకు మాత్రమే చట్టం, దాని అమలు విషయంలో ప్రభుత్వాలు కనబర్చిన ఉద్దేశపూర్వక నిర్లక్ష్యం ఎంతో మంది దళితుల ప్రాణాలను బలిగొంటూ వస్తోంది, ఈ దమన నీతి కేవలం శాసన వ్యవస్థ, శాసనకర్తలు, రాజకీయ పార్టీల వరకు మాత్రమే పరిమితం కాలేదు, ఇది న్యాయ వ్యవస్థలోను కొనసాగుతూ వస్తోంది. ఎస్‌సి, ఎస్.టి అత్యాచారాల నిరోధక చట్టం కేసుల్లో కోర్టులు ఇస్తున్న తీర్పులే ఈ

విషయాన్ని బలపరుస్తున్నాయి. అన్యాయం జరిగినపుడు ఏ పౌరుడైనా చిట్టచివరగా నమ్మేది, ఆశ్రయించేది కోర్టులనే. ఎందుకంటే అంతిమంగా బాధితునికి న్యాయం అక్కడే దొరుకుతుంది అనే నమ్మకం. కాని, ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం కేసుల్లో కోర్టులు ఇస్తున్న తీర్పులు దిగ్భ్రాంతిని కలిగిస్తున్నాయి. కీలవేన్మణి నుంచి నిన్న మొన్నటి 'ఉనా' దాక అన్నీ యదార్ధ ఘటనలే. కల్పిత కథలో కట్టు కథలో కాదు. ఇవన్నీ కులం పేరుతో ఈ దేశంలో జరిగిన దారుణాలే. చరిత్రలో కనుమరుగై ఉండవచ్చు. కాని, పారిన రక్తం నిజం, జరిగిన హత్యాకాండ నిజమే. గుట్టలుగా శవాలను సామూహిక ఖననం చేసిన సందర్భాలు ఉన్నాయి. ప్రత్యక్ష సాక్షులు ఉన్నారు. జరిగిన మారణ హోమం వెనుక ఆధిపత్య కులాల హస్తమున్నదని ప్రపంచానికి తెలియజేసిన ప్రముఖ వార్తా పత్రికల కథనాలు ఉన్నాయి. ఇన్ని ఆధారాలున్నా కోర్టులకు మాత్రం సాక్ష్యాలు సరిపోవడం లేదట. 'బటానితోలా' ఊచకోత కేసులో 'అరా' కోర్టు ముగ్గురికి ఉరి శిక్ష, ఇరవై మందికి జీవిత ఖైదు విధిస్తే, పాట్నా హైకోర్టు ఆ ఇరవైమూడు మందిని నిర్దోషులుగా తీర్పుచ్చింది. 'లక్షిపూర్ బాతే'లో 63 మంది దళితులను ఊచకోత కోసినందుకు సెషన్స్ కోర్టు పదహారు మంది ముద్దాయిలకు మరణ శిక్ష, పది మందికి జీవిత ఖైదు విధిస్తే, సరైన సాక్ష్యాలు లేవనే సాకుతో నేరంతో సంబంధమున్న ఇరవై ఆరుగురిని నిర్దోషులుగా తీర్పు చెప్పింది పాట్నా హైకోర్టు. ఈ కేసులో విచిత్ర మేమిటంటే, ముద్దాయిలను ఒక కోర్టు దోషులని ప్రటిస్తే, అప్పీల్ కోర్టు నిర్దోషులని ప్రకటించడాన్ని ఏ రకంగా అర్ధం చేసుకోవాలి? అందరూ నిర్దోషులైతే మరి చంపింది ఎవరో కోర్టులే సమాధానం చెప్పాలి.

ఈ రకమైన తీర్పునే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు కూడా ఇచ్చింది. చుందూరులో ఎనిమిది మంది దళితులను ఊచకోత కోసిన కేసులో, సాక్షాత్తు కోర్టే సంఘటనా స్థలానికి తరలి వెళ్లిన సందర్భం బహుశా దేశ చరిత్రలోనే మొదటిది. అంతటి ప్రాముఖ్యత ఉన్న కేసులో ప్రత్యేక కోర్టు 2007లో 21 మందికి జీవిత ఖైదు, 35 మందికి ఒక సంవత్సరం జైలు శిక్ష విధిస్తే, ప్రాసిక్యూషన్‌వారు సరైన ఆధారాలను సమకూర్చలేదనే నెపంతో దోషులందరినీ నిర్దోషులుగా ప్రకటించింది. కోర్టులే ఇలాంటి తీర్పులిస్తే, న్యాయవస్థపై నమ్మకంతో సుధీర్ఘ కాలం న్యాయం కోసం వేచిచూసిన బాధితులు తమ గోడు ఇంకెవరికి చెప్పుకోవాలి?

ఇక మహారాష్ట్రలోని ఖైర్లాంజి అత్యాచారం కేసులో కోర్టు ఇచ్చిన తీర్పును చూస్తే నిజంగా ప్రజాస్వామ్య దేశంలోనే ఉన్నామా అనే అనుమానం కలుగక మానదు. దేశవ్యాప్తంగా సంచలనం రేపిన ఈ కేసులో తల్లిని, కూతురిని వివస్త్రను చేసి ఊరంతా ఊరేగించి, సామూహిక మానభంగం చేసి వారి మానాల్లో వెదురు బొంగులు దూర్చి చిత్రహింసలకు గురిచేశారు. తల్లినీ, చెల్లెను రక్షించుకొనే క్రమంలో అడ్డుపోయిన ఇద్దరు కుమారులను తల్లి, చెల్లెపై అత్యాచారం చేయాలని బలవంతపెడితే అందుకు నిరాకరించిన ఆ ఇద్దరు యువకుల మర్మాంగాలను కర్రలతో చితగొట్టి అత్యంత క్రూరంగా ఆ నలుగురిని హతమార్చి, ఊరవతల కాలువలో పడేసిన కేసులో "బండార" సెషన్స్ కోర్టు మొత్తం పదకొండు మందిలో ఆరుగురికి ఉరిశిక్ష, ఇద్దరికి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. కాని ఏం లాభం 2010 జులైలో నాగపూర్ హైకోర్టు మరణ శిక్షను 25 సంవత్సరాల శిక్షగా మార్చింది, అంతే కాదు, మరణ శిక్ష విధించడానికి అది అరుదైన కేసుల్లో అరుదైన కేసై ఉండాలట. క్రూరాతి క్రూరంగా హత్యలు జరిగితే అరుదైన కేసుగా కోర్టుకు అనిపించలేదట. కేవలం కేసుల్లో మాత్రమే అపీల్ కోర్టులో నేరస్తులకు శిక్షలు పడుతున్నా మొత్తంగా చూస్తే ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం కింద నమోదైన తొంబై శాతం కేసుల్లో శిక్షలు పడుతున్న ముద్దాయిలు చాలా తక్కువనే చెప్పాలి.

మన సమాజంలో న్యాయస్థానాలు దేవాలయాలు, నాయమూర్తులు దైవ సమానులు అనే భావన ఉంది. ఎందుకంటే, ఆ దేవుళ్లు రాగద్వేషాలకు అతీతంగా ధర్మాన్ని మాత్రమే ప్రవచిస్తారు అనే నమ్మకం. కాని, రాజ్యాంగ ధర్మ సూత్రాలు కాక మనుధర్మ సూత్రాలు మాత్రమే ఒంటపట్టించుకున్న కొందరు న్యాయమూర్తులు ప్రకటిస్తున్న తీర్పులు వివక్షకు, వివాదానికి కారణమౌతున్నాయి. మరీ ముఖ్యంగా ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం కింద నమోదైన కొన్ని ముఖ్యమైన కేసుల్లో నిర్లజ్జగా ఇస్తున్నటువంటి తీర్పులు రాజ్యాంగ ధర్మాన్ని, న్యాయస్ఫూర్తిని అవమానించే విధంగా ఉంటున్నాయి. అట్రాసిటీస్ కేసుల్లో న్యాయస్థానాలు ప్రకటిస్తున్న తీర్పులు వివాదాస్పదమౌతున్న దృష్ట్యా ఇప్పుడు ఏకంగా చట్టాన్నే బలహీనపర్చి కోర్టులదాక కేసులు వచ్చే అవకాశం లేకుండా ప్రాథమిక దశలోనే కేసును నీరుగార్చే కుట్ర జరుగుతోంది. మార్చి 20న ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టంపై సుప్రీంకోర్టు ద్విసభ్య బెంచ్ ఇచ్చిన తీర్పు ఈ విషయాన్నే ధృవీకరిస్తోంది. కేంద్ర ప్రభుత్వం దాఖలు చేసిన రివ్యూ పిటీషన్‌పై బెంచ్ స్పందించిన తీరు దురదృష్టకరం.

"మేం చట్టంలో ఒక పదం చేర్చలేదు, ఒక పదాన్ని తొలగించలేదు, కేవలం ముందస్తు అరెస్టులు చేయరాదు, బెయిల్స్ ఇవ్వచ్చు అని మాత్రమే చెప్పాం" అంటున్నారు. చట్టంలో అన్ని అంశాలు పొందుపర్చబడి ఉన్నప్పుడే ప్రభుత్వాలు దళితులు, బలహీనవర్గాలపై జరుగుతున్న దాడులను ఆపలేకపోతున్న దుస్థితిలో ఇక అరెస్టులు, బెయిల్స్‌పై సడలింపుని ఇస్తే దళితులపై దాడులు జరగవనే హామీని న్యాయస్థానాలు ఇవ్వగలవా?

అట్రాసిటీస్ కేసుల్లో ముద్దాయిల హక్కుల గురించి మాట్లాడుతున్న కోర్టులు, దేశంలో దళితులపై పెరిగిపోతున్న నేరాల గురించి మాట్లాడకపోవడం శోచనీయం. చట్టంలో ఏమార్పూ చేయలేదని కోర్టు వ్యాఖ్యానిస్తూనే చట్టంలో కీలకమైన అంశాలపై మినహాయింపు నివ్వడం ఆ చట్టాన్ని నీరుగార్చడం కాక మరేమవుతుంది?

తమిళనాడులోని కీలవేన్‌మణి నుండి గుజరాత్‌లోని ఉనా సంఘటనల వరకు దళితులు, గిరిజనులు, బలహీన వర్గాల హక్కులను పాలకవర్గాల న్యాయస్థానాలు, పోలీసులు కాలరాస్తూనే ఉన్నారు. అగ్రకుల అహంభావంతో కొందరు న్యాయమూర్తులు ఇస్తున్న అప్రజాస్వామికమైన తీర్పులు న్యాయ వ్యవస్థపై నమ్మకాన్ని ప్రశ్నిస్తోంది. ఇటువంటి తీర్పులకు నిజమైన ప్రజాస్వామ్యంలో స్థానం ఉండదు. పోరాడి సాధించుకున్న ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టాన్ని ప్రజలు తిరిగి పోరాటాల ద్వారానే కాపాడుకుంటారు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ లింగ్విస్టిక్స్, ఉస్మానియా యూనివర్సిటీ)*

వీ

# అమెరికా - ఉత్తర కొరియా చర్చలు

***ఉత్తర కొరియా - అమెరికాల మధ్య జరిగిన చర్చలు పాలకుల, పెట్టుబడిదారుల ప్రయోజనాల ప్రాతిపదికనే జరిగాయే తప్ప ప్రపంచ ప్రజల ప్రయోజనాల కోసం కాదనీ, యుద్ధం ఎప్పుడైనా తెరమీదకు రావచ్చుననీ అంటున్నారు* బైరెడ్డి సతీష్**

కత్తులు దూసుకున్న చేతులే కరచాలనం చేసుకున్నాయి. మాతో పెట్టుకుంటే మాడి మసయి పోతారు, మా జోలికొస్తే మా సత్తా ఏంటో చూపుతాం అని మాటలతోనే మంటలను రాజేసిన రెండు దేశాల అధినేతలు ముసి ముసిగా నవ్వుకుంటూ మెత్త మెత్తగా మాట్లాడుకున్నారు. పరస్పరం దూషించుకున్న వాళ్ళే ఒకరి భుజాల్ని ఒకరు తడిమి తారీఫు చేసుకున్నారు. ఇద్దరు తమ చిత్ర విచిత్ర మాటలు చేష్టలతో యుద్ధం అంచును తాకి మనసు మార్చుకొని మాట్లాడుకున్న అరుదైన సంఘటన జూన్ 12న సింగపూర్‌లో జరిగింది.

అనూహ్యంగా అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్, వారసత్వంగా అధికారాన్ని గుప్పెట్లో పెట్టుకున్న ఉత్తర కొరియా అధ్యక్షుడు కిమ్ జాంగ్ ఉన్ తమ బెదిరింపులతో ప్రపంచాన్ని ఆందోళనకు గురిచేసి ఆలింగనం చేసుకోవడంతో అదే ప్రపంచం ఆశ్చర్యపోయింది. అఫ్ఘనిస్తాన్, ఇరాన్, లిబియా తర్వాత మరే దేశం మీద దాడి జరగదని, ఇరాన్ అణు ఒప్పందం దరిమిలా కొద్దిమేరకైనా పరిస్థితులు మెరుగవుతాయని అనుకుంటున్న తరుణంలోనే ఇరాన్‌తో ఒప్పందాన్ని రద్దు చేసుకుంటున్నట్టు ప్రకటించడం, మరోవైపు అణ్వాయుధ పరీక్షలతో దూసుకుపోతూ అమెరికానే సవాల్ చేసిన కిమ్ వ్యవహారశైలి కలగలసి మరో యుద్ధం ముంచుకొస్తుందేమోనని ప్రపంచ ప్రజలు మరింత అందోళనకు గురయ్యారు. దూషణలు, బెదిరింపుల పర్వం ముగిశాక శాంతి వచనాలు వారి నోటి గుండా వెలువడడం ఒకింత ఆశ్చర్యకరమైనదే. అయినా వారి కలయిక తాత్కాలికంగానైనా ప్రపంచానికి ఊరట కలిగించింది.

నిజంగా ఈ ఆకస్మిక జ్ఞానోదయం, శాంతి జపం వెనుకాల ప్రపంచ ప్రజల ప్రయోజనాలు ప్రధానంగా కొరియా ద్వీప కల్ప ప్రజల ప్రయోజనాలున్నాయా? ప్రపంచ శాంతిని వాంచించే ఈ 'సంధి' జరిగిందా? జాగ్రత్తగా గమనించాలి.

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన 1945 లలో కొరియా విభజన జరిగింది. జపాన్ సామ్రాజ్యం కుప్పకూలిపోయిన నేపథ్యంలో ప్రచ్ఛన్న యుద్ధ ప్రభావంతో ఉత్తర కొరియాలో రష్యా అండదండలతో కమ్యూనిస్ట్ ప్రభుత్వం ఏర్పడితే దక్షిణ కొరియాపై అమెరికా పెత్తనం పెరుగుతూ వచ్చింది. అదే సమయంలో చైనా స్వాతంత్రం సంపాదించుకోవడంతో క్రమ క్రమంగా భౌగోళిక రాజకీయాల రీత్యా ఉత్తర కొరియాపై చైనా ప్రభావం రష్యా నుండి బదిలీ అయ్యిందని చెప్పాలి.

ఆనాటి అమెరికా అధ్యక్షుడు హారీ ట్రూమన్ చైనా ప్రభావంతో దాని చుట్టు పక్క దేశాలు కమ్యూనిస్ట్ దేశాలుగా మారుతాయనే భయంతో దక్షిణ కొరియాను మరింతగా వెనుకేసుకు రావడం మొదలుపెట్టాడు. రెండు కొరియా దేశాలు వారి వారికి మద్దతిస్తున్న దేశాల దన్నుతో 1950ల నుండి వివిధ రూపాల్లో యుద్ధంలోనే ఉన్నాయి. 2018 ఏప్రిల్ 18న రెండు కొరియా దేశాలు పాన్ ముంజోమ్ ప్రకటన వెలువడి ఇరు దేశాలు అణు నిరాయుధీకరణకు, శాంతి ప్రక్రియకు కట్టుబడుతామని, యుద్ధాన్ని ముగిస్తామని సంతకాలు చేసారు.

దాదాపు 68 సంవత్సరాలకు పైగా ఆధిపత్య దేశాల ప్రేరేపణతో యుద్ధం చేస్తూనే ఉన్నాయి. ప్రచ్ఛన్న యుద్ధం ముగింపు, చైనా అంతర్గత అభివృద్ధిపై దృష్టి పెట్టడంతో ఉత్తర కొరియా తన భద్రతపై తనే దృష్టి పెట్టాల్సి వచ్చింది. మరోవైపు అమెరికా దుందుడుకు చర్యలు, 28 వేల మందికి పైగా సైనికులతో కూడిన స్థావరాన్ని కొరియా ద్వీపకల్ప సమీపాన ఏర్పాటు చెయ్యడమే కాకుండా దక్షిణ కొరియాతో కలసి సైనిక (యుద్ధ) విన్యాసాలు చేయడం ఉత్తర కొరియాను మరింత అందోళనకు గురిచేసింది. మునుపటి స్థాయిలో రష్యా, చైనాల భద్రతాపరమైన మద్దతు లేకపోవడంతో అణ్వాయుధంతో మాత్రమే అమెరికా దూకుడుకు కళ్లెం వేయవచ్చునని ఒక దాని వెంట ఒకటి అణ్వాయుధ పరీక్షలను చేస్తూ పోవడమే కాకుండా అమెరికాలో ఏ నగరాన్నైనా చేరగలిగే బాలిస్టిక్ మిస్సైల్ల సామర్థ్యం సాధించుకున్నామనే బలమైన బెదిరింపులను పంపించింది.

ఈ బెదిరింపుల ప్రభావం ఎంతగా అంటే రెండవ ప్రపంచ యుద్ధ నేపథ్యంలో శాంతియుత రాజ్యాంగాన్ని ఏర్పరచి యుద్ధ సైన్యాన్ని రద్దు చేసుకున్న జపాన్ సైతం రాజ్యాంగాన్ని సవరించి మరీ సైన్యాన్ని ఏర్పరిచే వరకు వెళ్లింది. అమెరికా ఎలాగూ తన సామ్రాజ్యవాద యుద్ధోన్మాద వైఖరినే ప్రదర్శిస్తూ దూకుడుగా వ్యవహరిస్తూ అగ్నికి ఆహుతి అవుతారంటూ ట్రంప్ 'ట్వీట్ల' కు పదును పెట్టాడు. యుద్ధపు వాకిళ్లలోకి వచ్చిన ఈ రెండు దేశాలు ఆకస్మికంగా శాంతి జపాన్ని పఠించడం మొదలుపెట్టాయి. నిజానికి ట్రంప్‌కి కొత్తగా సలహాదారుగా వచ్చిన బోల్టన్ యుద్ధోన్మాదిగా పేరున్న వాడే. లిబియా తరహా ప్రభుత్వ మార్పును («) కూడా ఉత్తర కొరియాలో కూడా అమలు చేయాలనే సలహాను ట్రంప్‌కు బలంగానే సలహా ఇచ్చాడని తెలుస్తున్నా ఆ సలహాని పక్కన పెట్టడం ఆయన విచిత్ర వ్యక్తిత్వాన్ని, ఎటూ పొందని చపల చిత్తాన్ని చూసినపుడు ఆశ్చర్యపరిచే అంశమే.

కొత్తగా విదేశీ కార్యదర్శి అయిన పాంపేయ్ ఉత్తర కొరియా సందర్శించడం ముందస్తు చర్చలు జరపడం చక చకా జరిగిపోయినవి. ఉన్నట్టుండి ట్రంప్ మే 24న కిమ్‌తో మీటింగ్ ఉండబోదని ఆకస్మికంగా ప్రకటించడం మళ్లీ పరిస్థితులను ఉద్రిక్త పరిచింది. ఈలోగా రక్షణశాఖా మంత్రి మాటిస్ ఉత్తర కొరియాపై దాడి చేస్తే జరిగే నష్టం గురించీ 28,500 సైనికుల, లక్షలాది జపాన్, కొరియా ప్రజల భద్రతాపరమైన అంశాలు లేవనెత్తి ట్రంప్‌ను ఒప్పించాడని అంతర్జాతీయ మీడియా ప్రచారం చేసింది.

కిమ్ అమ్ముల పొదిలో అరవ వరకు అణ్వాయుధాలు ఉన్నట్టు, ఆయన ఏ దుస్సాహసానికైనా తెగబడొచ్చు అనే అందోళన కూడా ట్రంప్‌కి ఏదో ఒక మూలన లేకపోలేదు. అన్నింటికీ మించి అంతర్జాతీయ దౌత్యరంగాన ఏకాకి అవుతున్న ట్రంప్‌కు తన దౌత్య ప్రతిభను

నిరూపించుకోవాలి అని అనిపించి ఉండవచ్చు. ఈ శాంతి ఒప్పందం ద్వారా తన కంటే ముందు అధ్యక్షుడుగా ఉన్న ఒబామా లాగా నోబెల్ శాంతి బహుమతిని పొందాలనే కోరిక ఉన్నట్టు హాస్య పూరితంగానైనా అనేక వార్తలు వెలువడినయి!

ప్రధానంగా ట్రంప్ రాజకీయ నాయకుడు కాదు ఓ బడా వ్యాపార వేత్త. వ్యాపార కోణాలు తన ప్రధాన నిర్ణయాలను ప్రభావితం చేస్తాయి. 'అమెరికా ఫస్ట్' అనే నినాదం వెనుక గతంలో అనేక దేశాల్లో యుద్ధాల్లో ఇరుక్కుని పోయి అమెరికా ఆర్థిక వ్యవస్థ చితికిపోయిందని, అమెరికా పౌరులు చెల్లించిన పన్నులు ఇతర దేశాల్లో యుద్ధాలపై ఎందుకు ఖర్చు పెట్టాలనే ఒక వాదన ఆయన చేస్తూ ఉన్నాడు. అన్నింటికీ మించి అమెరికాలో ఆయన రేటింగ్ 9 శాతానికి పడిపోయింది. దీంతో ఏదో ఒక పాపులర్ నిర్ణయాన్ని అమలు చేయాలనుకున్నాడు. అది ఈ రూపంలో బయటకి వచ్చిందేమో.

సామ్రాజ్యవాద ఆధిపత్య దేశాలు యుద్ధం చేసినా, శాంతి కుదుర్చుకునా తమ ప్రయోజనాలకనుగుణంగానే ఉంటాయనేది మరువ రాదు. ఈ యుద్ధాన్ని ఆపాల్సిన అవసరం అందరికంటే దక్షిణ కొరియాకే ఎక్కువగా ఉంది. ఉత్తర కొరియా అమెరికా పైన దాడి కంటే దక్షిణ కొరియా పైననే తన ప్రతాపాన్ని చూపే ప్రమాదం ఉంది. ఇది గమనించిన దక్షిణ కొరియా 'క్యాండిల్ రెవల్యూషన్' నేపథ్యంలో అధికారంలోకి వచ్చిన మూన్ జే వింటర్ ఒలంపిక్స్ క్రీడల సందర్భంగా ఫిబ్రవరిలో క్రీడా దౌత్యంతో ఇరు దేశాలు కలసి ఆ క్రీడల్లో పాల్గొనేలా ఒప్పించడం, ఇరు దేశాల అధ్యక్షులు నిస్సైనికీకరణ ప్రాంతంలో కలుసుకోవడం జరిగింది.

సరిగ్గా ఇక్కడే మూన్ జే దక్షిణ కొరియా పెట్టుబడిదారీ వర్గాల, సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనాలను కాపాడుతున్నాడు. ట్రంప్ తన యంత్రాంగం కంటే మూన్ జే పైనే ఎక్కువ నమ్మకంతో కిమ్‌ను కలవడానికి సమ్మతించాడు. చేబల్ పేరుతో కొద్ది కుటుంబాల చేతుల్లో ఉండే పారిశ్రామిక, వ్యాపార ఆర్థిక సామ్రాజ్య ప్రయోజనాలకు రెండు కొరియాల మధ్య ఉన్న ఘర్షణ విఘాతంగా పరిణమించింది.

గత ప్రభుత్వాలు అనుసరించిన 'సన్ షైన్' అనే విదేశాంగ విధాన ప్రక్రియ అంతా కూడా ఉత్తర కొరియాతో శాంతిని నెలకొల్పుకుని వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరించుకోవాలనే ఈ పారిశ్రామిక మాఫియా చొరవతోనే జరిగింది. దాని ఫలితంగా ఉత్తర కొరియా నుండి 'చీప్ లేబర్' ను పొందడమే కాకుండా ముడిసరుకులు, సహజ వనరులు, మార్కెట్ విస్తరణ అనే ప్రధాన ప్రయోజనాలే ఇవ్వాళ ఈ శాంతి ప్రక్రియను వెనుకుండి నడిపించాయి. హ్యూందాయ్ లాంటి సంస్థ ప్రధాన పాత్ర పోషించింది. ఇక్కడే మూన్ జే రేటింగ్ 83 శాతానికి పెరగడం గమనార్హం.

అటువైపు చూస్తే కిమ్ జాంగ్ ఉన్ కూడా వాస్తవ పరిస్తితిని వంట పట్టించుకున్నాడు. భౌగోళికంగా ఉత్తర కొరియా పర్వత ప్రాంతం కావడం, పరిశ్రమలు పెద్దఎత్తున లేకపోవడంతో ఉపాధి ఉద్యోగ సమస్య తీవ్రమవడం, ఆర్థిక అభివృద్ధికై కాకుండా సైనిక పెట్టుబడి పెరగడంతో దేశ ప్రజల్లో ప్రధానంగా యువతరంలో తీవ్ర నిరాశ నిస్పృహలు గూడు కట్టుకున్నాయి. జరిగిన కొద్దిపాటి అభివృధి అంతా కూడా నగరాలు కేంద్రంగా జరగడంతో గ్రామీణ కొరియాలో పాలకులపై తీవ్రమైన ఆగ్రహం నెలకొని ఉన్నది. పాశ్చాత్య మీడియా పని గట్టుకొని చేసిన ప్రచారం అంత కాకపోయినా తీవ్రమైన పేదరికం అయితే ఉన్నది. దీనికి తోడు 2012లో కిమ్ వ్యవస్థాగత సంస్కరణలు చేపట్టి ఉద్యోగ భద్రత లేకుండా చేయడం, ప్రైవేటు కంపెనీలకు విపరీతమైన స్వేచ్ఛనివ్వడం ప్రజా ప్రయోజనాల కంటే ప్రైవేటు ప్రయోజనాలకే ప్రాధాన్యత దక్కడంతో ప్రజల్లో సహజంగానే తిరుగుబాటుతత్వం, తెగింపు ధోరణి పెరిగింది.

అంతర్జాతీయ ఆంక్షల నడుమ విదేశీ సహాయం కూడా ఏదీ అందని పరిస్థితి. దీనికి తోడు ఈ ఆర్థిక విధానాల మూలంగా ఎదిగి వచ్చిన మధ్య తరగతి కూడా తమ జీవితాలను ఆస్వాదించేందుకు సరైన భౌతిక పరిస్థితులు ఉండాలని బలంగా కోరుకుంటుంది. ఈ నేపథ్యంలో శత్రుదేశాల బూచి చూపి తన అధికారాన్ని ఎక్కువ కాలం నిలుపుకోవడం కూడా కష్టమే అని గ్రహించిన కిమ్ వాస్తవ పరిస్థితులను బాగానే ఆకళింపు చేసుకున్నాడు. గతంలో తన తన తండ్రి కాలంలో లాగా హ్యూందాయ్ లాంటి సంస్థల నుండి అనేక మిలియన్ డాలర్ల డబ్బు అందకుండా పోయే ప్రమాదమూ ఉంది! దీనికి తోడు యుద్ధమంటూ జరిగితే లక్షలాది కొరియన్లు చైనాకు శరణార్థులుగా వెళ్ళే అవకాశం ఉంది. అయితే ఇది చైనాకు ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదు. ఈలోగా చర్చల కంటే ముందే చైనా అధ్యక్షున్ని కలసి వచ్చాడు కిమ్.

చైనాకు అమెరికాకు మధ్య సంబంధాలు యుద్ధ కాలం కంటే మెరుగ్గా ఏమీ లేవు. మరో యుద్ధం రాకుండానే ఈ శాంతి ప్రక్రియను బలపరచడం ద్వారా తానూ రెండు విధాలుగా తన ప్రయోజనాలను కాపాడుకునే ప్రయత్నం చేస్తున్నది. జపాన్‌కి ఈ శాంతి ప్రక్రియ మరింత అనివార్య మైనది. యుద్ధమంటూ జరిగితే దక్షిణ కొరియా తర్వాత అంతే విధ్వంసాన్ని ఎదుర్కునే ప్రమాదం ఉన్నది జపాన్‌కే. మరింత కాలం పాలనలో ఉండాలన్నా, గడాఫీ లాంటి పరిస్తితిని తప్పించుకోవాలన్నా, అంతర్జాతీయంగా ఉత్తర కొరియా ఏకాకిగా మిగల కూడదన్నా , శాంతి తప్పదనుకున్నా ఇందులో రెండు కొరియా దేశాల పాలక వర్గాల ప్రయోజనాలవే ప్రధానమైన ప్రభావవంతమైన పాత్ర అనేది మరువరాదు.

ప్రపంచం దృష్టిని ఇంతగా ఆకర్షించిన ఈ రెండు దేశాల శిఖరాగ్ర సదస్సు ప్రపంచం ఆశించిన ఫలితాలను కాకపోయిన ఆ రెండు దేశాలు పెట్టుకున్న లక్ష్యాలనైనా సాధించాయా? ఉత్తర కొరియా అణుపాటవ పరీక్షల సామర్థ్యాన్ని విచ్చిన్నం చేయడం, అణు నిరాయుధీకణ మండలంగా కొరియాను ప్రకటించడం, ఉత్తర కొరియా భద్రతకు అమెరికా గ్యారంటీ ఇవ్వడం, ఉత్తర కొరియా ఆర్థికాభివృద్ధికి చేయూత నివ్వడం, కొరియా ద్వీపకల్పంలో మోహరించిన 28,500 అమెరికా సైనిక శక్తిని వెనక్కి తీసుకొని, దక్షిణ కొరియాతో జట్టుగా చేస్తున్న సైనిక విన్యాసాలు పూర్తిగా నిలిపివేయడం వంటి ప్రధాన డిమాండ్లతో పాటు రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఉత్తర కొరియాలో చనిపోయిన అమెరికా సైనికుల అవశేషాలను అప్పగించాలనే సెంటిమెంట్స్‌తో కూడిన అంశాలు ఉన్నాయి. దీంట్లో ప్రధానంగా ఉత్తర కొరియా అణు పరీక్షలు జరిపే ప్రదేశాలను పూర్తిగా ధ్వంసం చేసినట్టు అప్పటికే ప్రకటించింది. అమెరికా తన వంతుగా దక్షిణ కొరియాతో సంయుక్తంగా తలపెట్టిన సైనిక విన్యాసాలను రద్దుపరుస్తున్నట్టు ప్రకటించింది. ఈ రెండు మినహా నిర్దిష్టంగా మరే ఇతర, ప్రధానంగా ఆంక్షల సడలింపు విషయంలో అమెరికా ఖచ్చితమైన హామీ ఇవ్వలేదు.

ఈ సదస్సు పై పెదవి విరిచింది మాత్రం పాశ్చాత్య మీడియా, అమెరికా రక్షణ ఆయుధ ఉత్పత్తి సంస్థలు. ఒక రోగ్ దేశానికి, యుద్ధోన్మాదికి, అనేక మంది చావుకు కారకుడైన నియంతకు అమెరికా సమాన హోదా ఇచ్చి చర్చించడం ఏంటని పాశ్చాత్య మీడియా, ప్రధానంగా అమెరికా మీడియా తెగ బాధపడిపోయింది. అయ్యో యుద్ధం జరిగితే తమ ఉత్పత్తుల గిరాకీ పెరిగేది, డాలర్ల కొద్ది డబ్బు కురిసేదే అనే నిరాశలో ఆయుధ ఉత్పత్తి సంస్థలున్నాయి. ఇరాక్‌ను ధ్వంసం చేసి పునర్నిర్మాణ కాంట్రాక్టులు దక్కించుకున్నట్టు ఉత్తర కొరియాలో జరగలేదే అని నిట్టూర్చుతున్న బడా కంపెనీలు అనేకం అమెరికాలో ఉన్నాయి.

# రైతులకు ఉరితాడైన భూసేకరణ చట్టం 2017

***కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు భూసేకరణ విషయంలో ప్రతిబంధకంగా ఉన్న చట్టాలను మార్చి కార్పొరేట్ సంస్థలకు అప్పనంగా భూములను కట్టబెడుతూ, రైతుల హక్కులను హరిస్తూ వారిని ఆత్మహత్యలవైపు నెడుతున్నారని అంటున్నారు* ముప్పాళ్ళ భార్గవశ్రీ**

**భూ**యజమానుల అభిప్రాయాలతో ఏమాత్రం సంబంధం లేకుండా ఎక్కడ కావాలంటే అక్కడ చంద్రబాబు ప్రభుత్వం ఇష్టారాజ్యంగా భూములు తీసుకొనేందుకు, అడ్డంగా ఉన్న నిబంధనలకు నిలువెత్తు పాతరేసి మార్గాన్ని సుగమం చేసుకొంది. విలువైన భూములను చౌకగా, బలవంతంగా లాక్కొని అస్మదీయులకు కట్టబెట్టి వాటాలను పంచుకోవాలనే లక్ష్యంతో చంద్రబాబు సర్కారు రూపొందించిన ఎ.పి. భూసేకరణ చట్టసవరణ 2017కు ఎట్టకేలకు మే27, 2018న భారత రాజ్యాంగంలోని 201వ అధికరణ ప్రకారం రాష్ట్రపతి ఆమోదముద్ర పడింది. ఆమోదించిన భూసేకరణ చట్టానికి ఎపి అసెంబ్లీ సవరణలు చేసి గతేడాది రాష్ట్రపతి ఆమోదం కోసం పంపించింది. దీనికి ఆమోదం లభించక కేంద్ర హోంశాఖ వద్దే చాలాకాలం పెండింగ్‌లో ఉంది. కేంద్ర వ్యవసాయ శాఖ, గిరిజన శాఖ అభ్యంతరాలు తెల్పడంతో బిల్లుని తిప్పిపంపారు. కేంద్ర సూచనలకనుగుణంగా మరోసారి రాష్ట్ర అసెంబ్లీ సవరణలు చేసి పంపి పలుసార్లు కేంద్ర హోంశాఖ అధికారులతో చర్చలు జరిపారు. గిరిజన శాఖ, పర్యావరణ తదితరశాఖలు ఈబిల్లులోని అంశాలపట్ల అభ్యంతరాలు పెట్టాయనే పేరుతో కాలయాపన చేసి మోడీ ప్రభుత్వం చివరికి రాష్ట్రపతిచేత ఆమోదముద్ర వేయించింది. అసలు విషయం ఏమిటంటే ఏపి ప్రభుత్వం కోరిన సవరణలకు గుజరాత్, తమిళనాడు, తెలంగాణ ప్రభుత్వాలు రాష్ట్రపతి నుండి ఆమోదాలు పొంది చాలాకాలంగా తమ రాష్ట్రాల్లో ఈచట్టాన్ని అమలు చేస్తున్నాయి.

రెండు దశాబ్దాలకు పైగా గుజరాత్‌కు ముఖ్యమంత్రిగా చేసిన నరేంద్రమోడీ ఆదానీలాంటి బహుళజాతి కంపెనీలకు భూసేకరణ చట్టాన్ని అడ్డం పెట్టుకొని లక్షలాది ఎకరాలను కారు చౌకగా కట్టబెట్టారు. ఇప్పుడు ప్రధానమంత్రి అయిన తర్వాత మోడీ ప్రైవేటీకరణ విధానాలను మరింత దూకుడుగా అమలు జరుపుతున్నారు. రాష్ట్రపతి ఆమోదం పొందిన ఏపీ భూసేకరణ చట్టం 2017సవరణలకు రాష్ట్రపతి ఆమోదముద్ర వేయడంతో 2013లో కేంద్ర ప్రభుత్వం తెచ్చిన 'రైట్ టు ఫెయిర్ కాంపెన్సేషన్ అండ్ ట్రాన్స్‌పరెన్సీ ఇన్ ల్యాండ్ అక్విజిషన్ అండ్ రిహాబిలిటేషన్ అండ్ రీసెటిల్‌మెంట్' (భూసేకరణ చట్టం) 2013కు కూడా తూట్లు పొడిచే విధంగా తయారైంది. రాష్ట్రాలలో ఉన్న ప్రత్యేక పరిస్థితుల పేరుతో 2013 భూసేకరణచట్టానికి సవరణలు చేసి అమలు చేసే అధికారాన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు అధికారం కట్టబెట్టడంతోనే మోడీ ప్రభుత్వ అవకాశవాద వైఖరి బట్టబయలౌతుంది.

మోడీ ప్రభుత్వం సరిగ్గా అభివృద్ధి ఆగిపోతుందనే వాదనను భుజాన వేసుకొని భూసేకరణ చట్టం 2015ను ఆర్డినెన్స్ రూపంలో తీసుకొచ్చింది. వాస్తవంగా ఏదైనా చట్టానికి మార్పులు చేసేటప్పుడు ఈ చట్టం అమలు కాలంలో ఎదురైన ఇబ్బందులను తొలగించేందుకు సవరణలు ప్రతిపాదిస్తారు. అసలు చట్టాన్ని అమలు చేయకుండానే సవరణల గురించి ప్రతిపాదించడం వెనకాల మోడీ ప్రభుత్వానికి గల ప్రపంచీకరణ విధానాలపై మోజు స్పష్టంగా బయటపడింది.

2015 ఆర్డినెన్స్‌తో మోడీ ప్రభుత్వం దేశ పారిశ్రామికాభివృద్ధికి ఆటంకంగా ఉన్నాయనే మిషతో ప్రజల నుండి ముందస్తు సమ్మతి, సామాజిక ప్రభావ అంచనాలైన ముఖ్యాంశాల తొలగింపుకు తెగబడింది. అంటే అభివృద్ధి పేరుతో రైతుల నుండి భూములను నిర్బంధంగా తీసుకొనే విధంగా 2015 చట్టానికి పదును పెట్టింది. పాతచట్టం ప్రకారం రైతుల నుంచి సేకరించిన భూమిని అయిదు సంవత్సరాల లోపల ఉపయోగించకుండా ఉంటే ఆ భూమిని తిరిగి రైతులకు చెందే వీలును కల్పించింది. ఇప్పుడు కొత్త చట్టంలో చేసిన సవరణల ప్రకారం అయిదు సంవత్సరాలు

---

యుద్ధ సలహాదారులు కూడా ఒకింత నిరాశలోకి జారుకున్నారు. కరచాలనం కంటే కత్తుల్ని నూరే శక్తులే అమెరికా పాలకవర్గాల్లో మెజారిటీగా ఉన్నారనేది చరిత్రలో అమెరికా చేసిన యుద్ధాలని చూస్తే అర్థమవుతుంది.

ఈ మొత్తం తతంగంలో అమెరికా కంటే ఉత్తర కొరియానే కొంచెం తెలివితో వ్యవహరించిందా, అంటే ఒకింత అవుననే చెప్పాలి. అణు ఆయుధాలు సంపాదించిన తర్వాతే చర్చల్లోకి దిగింది. అయినా ఇదొక తాత్కాలిక ఊరట మాత్రమే. యుద్ధ క్రీడకు తెర ఎపుడైనా లేవవచ్చు. ఎందుకంటే ఇది ప్రపంచ శాంతి, ప్రపంచ ప్రజల ప్రయోజనాల కంటే పాలక వర్గాల, పెట్టుబడీ దారుల ప్రయోజనాల ప్రాతిపదికనే జరిగిందన్నది మరువరాదు.

డిమాండ్‌కు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రాచబాట వేశాయి. భూములు, గనులు, సముద్ర తీర ప్రాంతాలను దోచుకొని కోట్లాది రూపాయల లాభాలు గడించే కేంద్రాలుగా కార్పొరేట్ కంపెనీలు మార్చుకొన్నాయి. తమిళనాడులోని తూత్తుకుడి నుండి కన్యాకుమారి వరకు (దక్షిణ ప్రాంతం) కాలుష్యకర కంపెనీలు అనేకం వెలిశాయి. ఇదే పరిస్థితి నేడు దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాల్లోనూ కొనసాగుతుంది. ఎక్కడ చూసినా ప్రమాదకరమైన కాలుష్యకర ఫ్యాక్టరీలు, ప్రాజెక్టులు నిర్మించబడు తున్నాయి. ప్రజలు ప్రజాస్వామ్యయుతంగా నిరసనలు తెలియజేస్తుంటే వారిపై లాఠీలు, కాల్పులు, మారణకాండలు సాగిస్తున్నారు.

ఐక్యంగా దీర్ఘకాలిక పోరాటం ద్వారా సోంపేట ప్రజలు విజయం సాధించారు. అలాగే తూత్తుకుడి ప్రజలు ప్రణాలకు తెగించి మరీ తమ జీవించే హక్కుకై పోరాడుతున్నారు. స్టెరిలైట్ కంపెనీ పూర్తిగా మూసివేసేంత వరకు, ప్రజలకు న్యాయం జరిగేంత వరకు వారు కొనసాగించే ప్రజా పోరాటానికి మద్దతునిద్దాం.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

వీ

కానీ లేక మొదట్లో ఎన్ని సంవత్సరాలు అవసరం అని రాసుకొన్నామో అన్ని సంవత్సరాలు, రెండింట్లో ఏది ఎక్కువ అయితే అన్ని ఏళ్ల తర్వాతనే రైతులకు తిరిగి ఇచ్చే విధానాన్ని మార్చడం బడా పారిశ్రామిక వర్గాల, వ్యాపారవేత్తల ప్రయోజనాలను కాపాడడానికేనని వేరే చెప్పనక్కరలేదు.

మోడీ ప్రభుత్వం చేసిన కొత్త చట్టంలో చేసిన కీలకమైన మార్పుల్లో భూసేకరణ చట్టం నుండి రక్షణ రంగం, గ్రామీణ మౌలిక సదుపాయాలు, పారిశ్రామిక కారిడార్లులాంటి ప్రాజెక్టులను మినహాయించడం అంటే దాదాపు అన్ని ప్రాజెక్టులకు ప్రజల ముందస్తు అనుమతి నుండి మినహాయింపును కోరడమేనని వేరే వివరించనవసరం లేదు. వివిధ రంగాల సెజ్‌లు, విమానాశ్రయాలు, రోడ్లు, ఓడరేవులు, పర్యాటక కేంద్రాలు తదితర ప్రాజెక్టులను సామాజిక ప్రభావ అంచనా నుండి మినహాయించడం ద్వారా ఆయా ప్రాజెక్టుల ప్రాంతాల్లో మోజారిటీగా ఉండే వ్యవసాయ కూలీలు, కౌలు రైతులు, కమ్మరి, కుమ్మరి, గీత, నేత తదితర గ్రామీణ వృత్తుల వారితో పాటు చిరు వ్యాపారుల సాంఘిక జీవనాన్ని విధ్వంసం చేయడానికి మోడీ ప్రభుత్వం పూనుకోవడం అమానుషం. వీరందరినీ దిక్కులేని వారిగా, ఉపాధి లేని వారిగా దిగజార్చి దుర్భర జీవన పరిస్థితుల్లో నికృష్ట జీవనాలు గడిపేందుకు నగరాలకు తరిమి వేయబడటం దారుణం.

కేంద్ర ప్రభుత్వంతో బేరసారాలాడి చివరికి రాష్ట్రపతి ఆమోద ముద్ర వేయించుకొన్న ఎపి భూసేకరణ చట్టం 2017 మోదీ ప్రభుత్వం ఆర్డినెన్స్‌ల పేరుతో ప్రజల మీద రుద్దడానికి చేసిన భూసేకరణ చట్టం 2015ని తలదన్నేలావుంది. ఈచట్టం భూసేకరణచట్టం-2013కు నిలువెత్తు పాతరేసేలా రూపొందించారు. ఇప్పటివరకు ఏప్రాంతంలోనైనా పారిశ్రామికీకరణ ఇతర అవసరాల కోసం భూమిని సేకరించాలంటే ఆప్రాంతంలోని 80శాతం మంది రైతుల ఆమోదం కావాలి. అలానే భూమిని సేకరించటానికి ఆప్రాంత సామాజిక ప్రభావఅంచనా సర్వే తప్పని సరిగా నిర్వహించి, ఆప్రాంతంలో భూసేకరణ విధానం ప్రజలకు నష్టం కల్గించేదిగా సర్వే రిపోర్టువస్తే భూసేకరణ నుండి ఆప్రాంతాన్ని తప్పని సరిగా మినహాయించాలి. రాజధాని ప్రాంతంలో భూసమీకరణ క్రింద భూములు ఇవ్వడానికి నిరాకరించి కోర్టులకు వెళ్లిన రైతుల సర్వే నిర్వహిస్తే 70శాతం మందికి పైగా వ్యతిరేకిస్తారు. చంద్రబాబు ప్రభుత్వం ఎక్కడా లేని భూసమీకరణ విధానం ద్వారా రైతుల జీవితాలు మారిపోతాయనే పేరుతో 35వేల ఎకరాల రైతుల భూములను సమీకరించింది. రాజధానిని నిర్మించటానికి ఆటంకంగా ఉన్న బహుళ పంటలు పండే భూములను గుంజుకోవటానికి చంద్రబాబు ప్రభుత్వానికి 2017 చట్టం పెద్ద ఆయుధంగా ఉపయోగపడ్తుంది. ఇటువంటి స్వార్ధపూరిత ప్రయోజనంతోనే రాష్ట్రప్రభుత్వం ఈచట్టంలో సామాజిక ప్రభావ అంచనాకు మంగళం పాడింది.

ఈచట్టాన్ని అడ్డంపెట్టుకొని ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యం (పీపీపీ) పేరుతో కేంద్రచేపట్టే ప్రాజెక్టులు, రహదారులు, గృహనిర్మాణ ప్రాజెక్టులు, ప్రభుత్వ అవసరాలకు వినియోగించే భూములను సామాజిక ప్రభావ మదింపు అంచనా లేకుండా రైతులనుండి భూములను సేకరించే హక్కును దఖలు పర్చుకొంది. ఈచట్టం ప్రకారం రైతులు ఏమీచేయలేని ప్రేక్షకులుగా మిగిలిపోతారు.

ఈచట్టంలో ఉన్న మరో ప్రమాదకరమైన అంశం, భూసేకరణ క్రింద తీసుకొనే భూమి విలువను నిర్ణయించే అధికారాన్ని కలెక్టర్ల చేతిలో పెట్టడం. ఇంతకంటే ప్రమాదకరమైనది దీనిపై రైతులకు కోర్టుకెళ్లే అధికారాన్ని కూడా కత్తిరించివేశారు. 2013 భూసేకరణ చట్టం ప్రకారం భూసేకరణ క్రింద తీసుకొనే భూమి విలువకు రెండున్నర రెట్లుకు పైగా రైతులకు నష్టపరిహారం చెల్లించాలి. ఇప్పటి చట్టం ప్రకారం రైతులతో నష్టపరిహారం మొత్తం గురించి కలెక్టర్‌తో సంప్రదింపులు జరిపినా చివరగా కలెక్టర్ నిర్ణయించిన మొత్తానికే రైతులు అంగీకరించి సంతకాలు పెట్టాలి. ఆరుగాలం కష్టపడే రైతుల జీవితాలను కలెక్టర్ దయాదాక్షిణ్యా లకు వదిలివేయడం అమానుషం.

ఎ.పి సవరించిన చట్టంలో సామాజిక ప్రభావ అంచనాను తొలగించి కన్సెంట్ అవార్డును తెరపైకి తెచ్చింది. ఏదైనా ప్రాంతంలో ప్రభుత్వభూమిని తీసుకోదలిస్తే ఇవ్వడానికి అంగీకరించని రైతులపై సామాదాన భేద దండోపాయాలతో ఒత్తిడి తెచ్చి కన్సెంట్ ముసుగులో రైతులనుండి భూమిని లాక్కొంటుంది. ఇందుకోసమే సామాజిక ప్రభావ అంచనాను తొలగించి కన్సెంట్ అవార్డును సవరణ చట్టంలో చేర్పించిందని అధికారులతో పాటు సామాజికవేత్తలు కూడా వ్యాఖ్యానిస్తున్నారు. కాబట్టి భూసేకరణ కోసం వత్తిడితెచ్చినా సంతకాలు చేయవద్దని రైతులకు నిపుణులు సూచిస్తున్నారు. గతంలో లాగా అధికారులు బెదిరించి సంతకాలు చేయించుకొన్నారని రైతులు కోర్టులో చెప్పినప్పటికి ఎపి భూసేకరణ చట్టం 2017లో రూపొందించిన అంశాలవల్ల కోర్టులు కూడా అంగీకరించే పరిస్థితిలేదు. కన్సెంట్ అవార్డు తర్వాత కోర్టుకు వెళ్లడానికి వీల్లేదనడం రాజ్యాంగ హక్కులను కాలరాయడమే అవుతుంది. అందువల్ల ఈ చట్టాన్ని న్యాయ సమీక్ష చేయాలని సుప్రీంకోర్టులో సవాల్ చేయడానికి రాజధాని ప్రాంత రైతులు నేషనల్ అలయన్స్ ఫర్ పీపుల్స్ మూవ్‌మెంట్ ప్రతినిధుల సహకారంతో ఇప్పటికే 2013 కేంద్ర భూసేకరణ చట్టానికి ఆంధ్రప్రదేశ్‌తో పాటు ఇతర రాష్ట్రాలు చేసిన సవరణలను కూడా పరిగణనలోకి తీసుకొని న్యాయపోరాటం చేయటానికి సన్నాహాలు చేస్తున్నారు. ఇప్పటికే తెలంగాణ ప్రభుత్వం చేసిన సవరణలపై రైతు సంఘాలు, సామాజిక వేత్తలు కేసులు వేసి న్యాయపోరాటం ప్రారంభించారు.

రాష్ట్రపతి ఎపి భూసేకరణ చట్టం 2017కు ఆమోదం తెలపడం ద్వారా రైతులు ప్రాథమిక హక్కులకు భంగం కల్గించారు. రైతులు, గ్రామీణ పేదలకు ఉరితాడుగా మారిన బ్రిటిష్‌కాలం నాటి 1894 భూసేకరణ చట్టానికి వ్యతిరేకంగా అనేక రూపాల్లో పోరాటాలు జరిపిన ఫలితంగా 2013 భూసేకరణ చట్టాన్ని చివరికి పార్లమెంట్ ఆమోదించింది. 2013 చట్టం కూడా సమగ్రమైనది కాకపోవడంతో భూసేకరణ క్రింద భూములు కోల్పోయిన రైతాంగం ఆనాడే కాదు ఈనాడు కూడా నష్టాలు, కష్టాలు అనుభవిస్తున్నారు. అటువంటి లోపాలున్న చట్టానికి కూడా కేంద్రపాలకులు రిలయన్స్ లాంటి బహుళజాతి కంపెనీలు, కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలను కాపాడే సవరణలను నేరుగా పార్లమెంట్ ఆమోదం పొందలేక ఆర్డినెన్స్‌ల రూపంలో దొడ్డిదారిలో చట్టాన్ని అమలు చేసే విధానాలకు పాల్పడ్డారు. మోడీ ప్రభుత్వానికి రాజ్యసభలో మెజారిటీ ఉన్నా లోక్‌సభలో మెజారిటీ లేకపోవడంతో చట్టాన్ని పార్లమెంట్‌లో ఆమోదింపచేయడం సాధ్యంకాక ఆఖరికి ఆర్డినెన్స్‌లతో కాలం గడపాలని చూసినా, చివరికి కాలపరిమితి కారణంగా ఆర్డినెన్స్‌ను కూడా అమలు చేయలేకపోయింది. అందుకని తమకు లోక్‌సభలో కూడా మెజారిటీ వచ్చేలోపు చట్టాన్ని అమలు చేసే అధికారం తమకు లేనందున తమకు అనుకూలమైన రాష్ట్రాల చేత అమలు చేయించే విధానానికి మోడీ ప్రభుత్వం దొడ్డిదారిన తలుపులు తెరిచింది.

రైతుల జీవితాలతో చెలగాటం ఆడే ఎపి చట్టాన్ని ఆమోదించవద్దని లక్షలాది రైతులతో సంతకాలు చేయించి. రాష్ట్రపతికి వినతి పత్రాలు

# కడప ఉక్కు సీమ హక్కు

***కడపలో ఉక్కు కర్మాగారం నిర్మించే విషయంలో కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు ఒకరిపై ఒకరు నెపం మోపుకుంటూ కాలం గడుపుతున్నారనీ, అత్యంత వెనుకబడిన ప్రాంతమైన రాయలసీమకు ఉక్కు కర్మాగారం రావాలనీ అంటున్నారు* డా. అప్పిరెడ్డి హరినాథరెడ్డి**

ఆంధ్రప్రదేశ్ విభజన చట్టం పదమూడవ షెడ్యూల్‌లోని మౌలిక సదుపాయాల కల్పనలో విభజన చట్టం అమలు తేది 2014, జూన్ 2 నుండి ఆరునెలల లోపు తెలంగాణలోని ఖమ్మం జిల్లాలో, ఆంధ్రప్రదేశ్‌లోని కడప జిల్లాలో సమగ్ర ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణానికి అనువుగా ఉండే పరిస్థితులు, అనుకూలతలను స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (సెయిల్) పరిశీలించాలని తెలియచేస్తుంది. సాంకేతికంగా పై వాక్యాలలోని పదజాలం కాస్తా అటూ ఇటూ ఉన్నా, విభజన నాటి ఉద్విగ్న పరిస్థితులలో వెలువడిన ఈ నిర్ణయం తప్పనిసరిగా ఉక్కు కర్మాగారం నిర్మాణాలు చేపట్టాలనే స్ఫూర్తిని ఇమిడి ఉంది.

ఇతర ఎన్నో ప్రోత్సాహకాలను విభజన చట్టంలో ప్రస్తావించినా వాటిని స్పష్టంగా ఎక్కడ నిర్మించాలనే వివరాలు లేవు. రాష్ట్ర ప్రభుత్వం విచక్షణతో వాటిని వికేంద్రీకరించి చట్టంలోని ప్రయోజనాలు అన్ని ప్రాంతాలకు లబ్ది చేకూర్చవలసిన బాధ్యత ఉంటుంది. రాజధాని, హైకోర్టు, రైల్వేజోన్, ఎయిమ్స్, వ్యవసాయ విశ్వవిద్యాలయం లాంటి కీలకమైన అవకాశాలు రాయలసీమ ప్రాంతం ఇప్పటికే కోల్పోయింది. వెనుకబడిన ప్రాంతాల ప్యాకేజీ, కడప ఉక్కు కర్మాగారాలను నిర్దిష్టంగా సీమ ప్రాంతానికే విభజన చట్టంలో ప్రతిపాదించటం జరిగింది. కనీసం చట్టంలో స్పష్టంగా, నిర్దిష్టంగా పేర్కొన్న కడప ఉక్కు కర్మాగారమైనా సీమలో ఏర్పాటవుతుందని ఈ ప్రాంత ప్రజానీకం ఇన్నాళ్లు నమ్మకంతో ఉన్నారు.

ఈ నెల 13వ తేదీన ఉక్కు కర్మాగార విషయమై కేంద్రం సుప్రీంకోర్టుకు సమర్పించిన అఫిడవిట్‌లో ఉక్కు కర్మాగారం ఏర్పాటుకు అనుకూలత లేదని, గిట్టుబాటు కాదని, ముడిసరుకు కొరత ఉందని సెయిల్ నివేదిక ఇచ్చిందనే విషయాన్ని ప్రధానంగా ప్రస్తావించి, ఈ విషయమై టాస్క్‌ఫోర్స్ పరిశీలనలో ఉందని తెలియచేసింది.

2014, డిసెంబర్ 2న సెయిల్ ఉక్కు కర్మాగారం సాధ్యం కాదని నివేదిక ఇచ్చింది. ఈ అంశాన్ని పునఃపరిశీలనకు 2015, ఆగస్ట్ 4న కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక కార్యదళ బృందాన్ని నియమించింది. ఈ బృందం కూడా మార్కెట్ పరిణామాలు అనుకూలంగా లేవని 2016 మే, జూన్ నెలలలో కేంద్రానికి నివేదిక ఇచ్చింది.

రాష్ట్ర ప్రభుత్వ సంప్రదింపుల అనంతరం ఉక్కు కర్మాగార సాధ్యాసాధ్యాలను సమగ్రంగా పరిశీలించేందుకు 2016, అక్టోబర్ 19న కేంద్రం ప్రత్యేక టాస్క్‌ఫోర్స్‌ను ఏర్పాటు చేసింది. ఈ బృందాలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ప్రతినిధులు, సెయిల్, రాష్ట్రీయ ఇస్పాత్ నిగం లిమిటెడ్, జాతీయ ఖనిజోత్పత్తి సంస్థ, మెకాన్ లిమిటెడ్ తదితరులు ప్రతినిధులుగా ఉన్నారు. కెపిఎంజి సహకారంతో మెకాన్ సంస్థ ఉక్కు కర్మాగార విషయమై అధ్యయనం చేయాలని, రాష్ట్రంలో ఇనుప ఖనిజ లభ్యత వివరాలను రాష్ట్ర ప్రభుత్వం నిర్ధారించాలని, పరిశ్రమ ఏర్పాటుకు రాష్ట్ర ప్రభుత్వం అందించే ప్రోత్సాహకాలు తెలియచేయాలని ఈ బృందం తొలి సమావేశంలో తీర్మానించింది. ఈ టాస్క్‌ఫోర్స్ ఐదవ సమావేశం 2017, డిసెంబర్ 27న నిర్వహించింది. ఈ సమావేశంలో మెకాన్ సంస్థ అనంతపురం జిల్లాలో 110 మిలియన్ టన్నుల ఇనుప ఖనిజంతో 15 ఏళ్ల నుండి 20 ఏళ్ల పాటు నిర్వహించవచ్చని తెలిపింది. లభ్యమయ్యే ఇనుప ఖనిజం నాణ్యత (ఎఫ్ఇ కాంటెంట్) 58.5 శాతంగా ఉందని అంచనా వేసింది. అంతేకాక ఈ సమావేశంలో కర్మాగారం ఏర్పాటు, ఖనిజ నిర్వహణ విషయమై కూడా అభిప్రాయాలు తెలియచేశారు.

మెకాన్ సంస్థ 2018 జనవరిలో రాయలసీమ జిల్లాలో విస్తృతంగా ఇనుప ఖనిజ ప్రాంతాలను, ఉక్కు కర్మాగార నిర్మాణ ప్రదేశాన్ని సందర్శించింది. కడప జిల్లాలో ఉక్కు కర్మాగారం ఏర్పాటు చేయవచ్చని తన ప్రాథమిక నివేదికలో తెలిపింది. 2015, జనవరి 6న ఆంధ్రప్రదేశ్ అధికారులతో మెకాన్ సంస్థ సమావేశమై పరిశ్రమ ఏర్పాటుపై పలు అంశాలతో కూడిన ప్రతిపాదనలను తెలియచేసింది. రాష్ట్ర ప్రభుత్వం అందుకు అంగీకరించి జనవరి 12న వివరాలను పంపింది. వీటన్నింటి ఆధారంగా ఫిబ్రవరి 16న మెకాన్ సంస్థ కేంద్ర ఉక్కు మంత్రిత్వ శాఖకు పరిశ్రమ ఏర్పాటుకై సాధ్యాసాధ్యాల నివేదిక అందించింది.

మార్చి 15న పార్లమెంట్‌లో ఉపరాష్ట్రపతి వెంకయ్యానాయుడు తన కార్యాలయంలో నిర్వహించిన సమావేశంలో కేంద్ర ఉక్కు శాఖ మంత్రి బీరేంద్రసింగ్ మాట్లాడుతూ మెకాన్ సంస్థ నివేదిక ఉక్కు పరిశ్రమ ఏర్పాటుకు సానుకూలంగా ఉందని పేర్కొన్నాడు.

ఈనెల జూన్ 12న జరిగిన టాస్క్‌ఫోర్స్ ఆరవ సమావేశంలో మెకాన్ సంస్థ తుది నివేదిక రూపొందించేందుకు అవసరమైన సమాచారం రాష్ట్ర ప్రభుత్వం పంచుకోవాలని కేంద్రం తెలియజేసింది. పరిశ్రమకు అవసరమైన భూమి, ఖనిజ వనరులు, నీటి వసతి, విద్యుత్తు, రవాణా సౌకర్యాలు కల్పిస్తామని రాష్ట్ర ప్రభుత్వం ముందుకు వచ్చినట్లు తెలుస్తుంది.

---

పంపినా రాష్ట్రపతి ఆమోదం తెలపటం రైతు వ్యతిరేక చర్యకాక ఏమౌతుంది! బ్రిటిష్ పాలకులు రూపొందించిన 1894 చట్టాన్ని తలదన్నేలా రైతులపాలిట ఉరితాడుగా మారిన ఎపి భూసేకరణ చట్టం 2017 పై రైతు పరిరక్షణ కమిటీ నాయకుడు శ్రీవద్దే శోభనాద్రేశ్వరరావు నాయకత్వాన ఈచట్టాన్ని సవాల్ చేస్తూ హైకోర్టులో న్యాయపోరాటం సాగించడానికి సిద్ధమయ్యారు. ఏ రూపంలో సాధ్యమైతే ఆ రూపాల్లో రైతాంగ జీవితాలకు ఉరితాడులా మారిన ఈచట్టం రద్దుకోసం రైతాంగం సాగించే పోరాటాలకు భుజం భుజం కలిపి అన్ని ప్రజాస్వామిక శక్తులు ఉద్యమ దీక్షలో ముందడుగులు వేయాలి.

*(రచయిత సి.పి.ఐ(ఎం.ఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

2014 నుండి ఇప్పటిదాకా ఉక్కు కర్మాగార విషయమై ఇంత వ్యవహారం జరుగుతుండగా ఈనెల 13న కేంద్రం సుప్రీంకోర్టుకు సమర్పించిన అఫిడవిట్‌లో ఈనెల 12 నాటి వివరాలు అందచేయకుండా 2014 నాటి సెయిల్ నివేదికను చర్చకు తీసుకొనిరావడం ఆందోళన కలిగించే అంశంగా మారింది. టాస్క్‌ఫోర్స్ పరిశీలనలో ఉందంటూనే సెయిల్ అభిప్రాయాలను పునరుద్ఘాటించడం కేంద్రం ద్వంద వైఖరిని తెలుపుతుంది. రాష్ట్ర ప్రభుత్వం కూడా ఈ విషయమై స్పష్టమైన వైఖరి ప్రదర్శించలేదనిపిస్తుంది.

కేంద్ర ప్రభుత్వం ఉక్కు కర్మాగారం విషయంలో పెట్టుబడులు, ముడి సరుకు కొరత, గిట్టుబాటు, రాష్ట్ర ప్రభుత్వ ప్రోత్సాహకాలు తదితర అంశాలపై అనేక అనుమానాలతో ఉంది. విశాఖ స్టీల్ ప్లాంట్ విషయంలో కూడా ఆ రోజుల్లో అనేక తర్జనభర్జనలు జరిగాయి. విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు అని ఎన్నో ఉద్యమాలు కొనసాగాయి. అందులో రాయలసీమ వాసుల త్యాగం, పోరాటం మరువలేనిది. ఎట్టకేలకు 1971 జనవరి 20వ తేదీన అప్పటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ విశాఖ స్టీల్ ప్లాంట్‌కు శంఖుస్థాపన చేశారు. ఎన్నో అననుకూలతలు ఎదురైనా నాటి కేంద్రం ఉక్కు కర్మాగార నిర్మాణానికి పూనుకుంది. 1975 ఏప్రిల్‌లో సమగ్ర నివేదిక సమర్పించేందుకు ఎం.ఎస్. దస్తూర్ అండ్ కంపెనీని సలహాదారుగా నియమించింది. 3.4 ఎం.టి.పి.ఎ కర్మాగారం ఏర్పాటుకు 1977లో నివేదిక అందింది. రష్యా సహకారంతో 1980లో సమగ్ర నివేదిక అందింది. 1981లో రష్యాతో ఒప్పందం చేసుకొని 1982లో కర్మాగార నిర్మాణం ప్రారంభమైంది. 1982లో రాష్ట్రీయ ఇస్పాత్ నిగం లిమిటెడ్‌గా విశాఖ స్టీల్ ప్లాంట్ ప్రారంభమై 33 వేల ఎకరాల విస్తీర్ణంలో 60 వేల మందికి ఉద్యోగాలను కల్పిస్తుంది.

కేవలం సముద్రతీరం, రవాణా సౌకర్యాలకు అనువుగా ఉండటమే ప్రధాన అర్హతగా భావించి ఇతర ఎన్ని సమస్యలు ఎదురైన అప్పటి ప్రభుత్వాలు ప్రజల భావోద్వేగాలను పరిగణనలోకి తీసుకుని ఉక్కు కర్మాగారాన్ని సాకారం చేశాయి.

3.4 ఎంటిపిఎ నుండి 6.3 ఎంటిపిఎగా 2009 మే 29న అప్పటి ప్రధాని మన్మోహన్‌సింగ్ 8,692 కోట్లతో విశాఖ స్టీల్ విస్తరణకు పూనుకున్నారు. 30 లక్షల మెట్రిక్ టన్నుల స్థాయి నుండి 73 లక్షల మెట్రిక్ టన్నుల స్థాయికి పెంచారు. 2025 కల్లా 20 ఎంటిపిఎ సామర్థ్యం పెంపొందించాలని ప్రతిపాదనలు ఉన్నాయి. ఈ మధ్యన 1.5 మిలియన్ టన్నుల హైడ్రాలిక్ స్టీల్ పరిశ్రమను 15 వేల కోట్లతో విశాఖలో ఏర్పాటు చేయదలిచామని, ఉక్కుశాఖ మంత్రి ప్రకటించారు. 18 వేల కోట్లతో భిలాయ్ ఉక్కు కర్మాగారాన్ని 47 లక్షల టన్నుల స్థాయి నుండి 75 లక్షల టన్నుల స్థాయికి విస్తరించి జాతికి అంకితం చేశారు. భారతదేశం 40 శాతం ఉక్కు దిగుమతులు తగ్గించుకొని స్వయం సమృద్ధి వైపు అడుగులు వేస్తూ ప్రపంచ దేశాలకు ఉక్కు ఎగుమతికి కృషి చేస్తోంది.

నిజంగా ఉక్కు పరిశ్రమ గిట్టుబాటు కాకుంటే ఈమధ్య కాలంలో ఇన్ని విస్తరణలు సెయిల్ ఎందుకు చేపట్టారో సమాధానం చెప్పాలి. తమకు నచ్చిన ప్రాంతాలలో విస్తరణలకు ప్రోత్సహిస్తూ నూతన కర్మాగారాల విషయంలో సెయిల్ పక్షపాత ధోరణి చూపుతోంది. ముడి ఖనిజం మొదలుకొని అన్ని అనుకూలతలు ఉన్న కడప ఉక్కు కర్మాగారం విషయంలో వెనుకడుగు వేయడంలో భవిష్యత్‌లో ఇక్కడి ముడి ఇనుమును విశాఖ స్టీల్ ప్లాంట్ పరం చేయాలనే దురాలోచన కూడా దాగి ఉంది.

ఉక్కు కర్మాగారం ఏర్పాటుకు ముడి ఇనుము ఖనిజంతో పాటు మాంగనీసు, సున్నపురాయి, డోలమైట్ వంటి ఖనిజాలు అవసర మౌతాయి. కడప జిల్లాలో సున్నపురాయి, డోలమైట్ విస్తారంగా ఉంది. కడపలో ఉక్కు కర్మాగారం నిర్మించాలంటే 250 మిలియన్ టన్నుల ముడి ఇనుము అవసరమని అక్కడ 150 మిలియన్ టన్నులు మాత్రమే లభిస్తుందని కేంద్రం చెబుతోంది. జియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా నివేదికల ప్రకారం ముడి ఇనుము వివరాలు ఇలా ఉన్నాయి.

కడప జిల్లాలో చాబలి, పగడాలపల్లి, రాజంపేట ప్రాంతాలలో 55-65 శాతం ఎఫ్ఇ కంటెంట్‌గా, 20 ఎం.టి గా అంచనా వేశారు.

చిత్తూరు జిల్లాలో శిరసనబేడు, కోవనూరు, సురమల, నరహరిపేట, కృష్ణాపురంలలో 38-63 శాతం ఎఫ్ఇగా, 0.65 ఎం.టిగా ఉంది.

అనంతపురం జిల్లాలో ఓబుళాపురం, సిద్ధాపురం, చల్లాపురం, మల్లప్పనగుడి, కాల్వమడుగు తదితర ప్రాంతాలలో 60 శాతం ఎఫ్ఇ, 1 ఎం.టిగా ఉంది; కర్నూలు జిల్లాలో వెల్దుర్తి, రామళ్లకోట 50-60 శాతం ఎఫ్ఈ, 3.7 ఎం.టిగా ఉంది; నెల్లూరు జిల్లాలో రాసుపాలెం 0.60 ఎం.టిగా ఉంది.

ప్రకాశం జిల్లాలో ఒంగోలు, కొనిజేడు, సానమపూడి, ఎర్లపాలెం, తుమ్మవరం, మానికేశ్వరంలలో 30-37 శాతం ఎఫ్ఇగా, 295 ఎం.టి.గా ఉంది. ఈ విధంగా కడప జిల్లాతో పాటు పరిసర జిల్లాలలోని ముడి ఇనుమును ఉక్కు పరిశ్రమలకు ఉపయోగించుకోవచ్చు. ముడి ఇనుము అనే సమస్య తలెత్తే అవకాశం లేదు. విస్తారమైన భూమి, నీటి వసతి, రైలు, విమాన, భూ రవాణా వసతి, కృష్ణపట్నం తీరం, విద్యుత్తు, ముడిసరుకు ఇలా అనేక అనుకూలతలు ఉన్న కడప ఉక్కును తప్పక నిర్మించాలి.

2007లోనే ఇలాంటి అన్ని సౌకర్యాలు ఉండబట్టి బ్రహ్మణి స్టీల్స్ వారు 20 వేల కోట్ల రూపాయలతో కోటి టన్నుల సామర్థ్యంగల కర్మాగార నిర్మాణానికి సిద్ధమయ్యారు. అనేక కారణాల వల్ల అది సాధ్యం కాలేదు.

ఇప్పుడున్న పరిశ్రమలలో కేంద్ర ప్రభుత్వం కనీసం యాభై వేల కోట్ల రూపాయలలో ఉక్కు కర్మాగారం చేపట్టాలి. దాదాపు యాభై వేల మందికి ఉద్యోగ కల్పన జరపాలి. సెయిల్ ఇప్పటికే ఉన్న ఉక్కు కర్మాగారాల విస్తరణపై దృష్టి పెట్టడంతో పాటు ఈ కొత్త కర్మాగారం ఏర్పాటు విషయమై బాధ్యతగా ఆలోచించాలి. మెకాన్ సంస్థ అధ్యయన తుది నివేదిక సాధ్యమైనంత త్వరగా వెలువడి కడప ఉక్కు సాకార మయ్యేందుకు టాస్క్‌ఫోర్స్ కృషి చేయాలి. ఇందుకు రాష్ట్ర ప్రభుత్వం కూడా చిత్తశుద్ధిగా వ్యవహరించాలి.

ఎన్నో విధాలుగా తరతరాలుగా వెనుకబడిన రాయలసీమ ప్రాంతం కనీసం కడప ఉక్కు కర్మాగారంతో అయినా కొద్దో గొప్పో మార్పు రాగలదు. ఈ ఉక్కు కర్మాగార సాధన విషయంలో రాయలసీమ ప్రజా సంఘాలు రాజకీయ పార్టీల ఆటలో పావులుగా మారకుండా స్వతంత్ర ఉద్యమానికి సీమ యువత, ప్రజానీకాన్ని సమీకరించాలి. ఆంధ్ర ప్రాంత వాసులు ఈ న్యాయమైన సీమవాసుల హక్కుకై అండగా నిలబడాలి.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఒకరిమీద ఒకరు నెపం మోపుకొని దోబూచులాడుతూ ఏదో ఒక కారణంతో కడప ఉక్కు కర్మాగార విషయమై వెనకడుగు వేస్తే రాయలసీమ ప్రాంతంలో యాభై వేల కోట్ల రూపాయల పెట్టుబడులతో, యాభై వేల మందికి ఉద్యోగ అవకాశాల కల్పించేలా రాయలసీమ ఇతర పారిశ్రామిక రంగాలను అభివృద్ధి చేయాలని పోరాటా నికి సిద్ధం కావాలి. మరో ప్రత్యేక హోదా పోరాటంలా కడప ఉక్కు కర్మాగార ఉద్యమం మారకుండా ఉక్కు కర్మాగార స్థాయి ప్రయోజనాలకై సీమవాసులు పట్టుపట్టాలి. కొంత ఆలస్యమైనా రాయలసీమ ఉక్కు కర్మాగారం సీమ హక్కుగా ఏదో ఒకరోజు రానే వస్తది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# కార్పొరేట్ సేవలో బాబు నాలుగేళ్ల పాలన

***పెట్టుబడి, అభివృద్ధి, నవ్యాంధ్ర వంటి ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాతో మభ్యపెట్టడమే తప్ప చంద్రబాబు ఈ నాలుగేళ్లలో చేసిందేమీ లేదని, రాష్ట్రం అన్ని రంగాల్లో వెనుకబడిపోయిందని అంటున్నారు* సంతోష్**

టిడిపి ఎన్నికల ప్రణాళికలో రైతాంగానికి డజను పైగా వాగ్దానాలు చేసింది. మెట్ట ప్రాంతాల్లో 50 శాతం సాగు నీటి ప్రాంతాల్లో 25 శాతం, అధిక దిగుబడులు సాధించడం లక్ష్యంగా ప్రకటించింది. వ్యవసాయ అనుబంధ రంగాలను అభివృద్ధి పరుస్తామని హామీ ఇచ్చింది. 2014 జూన్ 8న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తూ రైతు రుణమాఫీ, చేనేత, డ్వాక్రా రుణమాఫీ, ఇంటికో ఉద్యోగం లేదా రు. 2000 నిరుద్యోగ భృతి, కాంట్రాక్టు కార్మిక వ్యవస్థను రద్దు చేసి దశల వారీగా పర్మినెంట్ చేస్తాం, మహిళా సాధికారత సాధిస్తాం, ఎస్సీ, ఎస్టీ, బీసీ సబ్ ప్లాన్ నిధులు కేటాయించి ఖర్చు చేస్తామన్నారు. పోలవరం, హంద్రీనీవా, గాలేరు-నగరి, ఉత్తరాంధ్ర సుజుల స్రవంతి, వెలిగొండ ప్రాజెక్టులను సత్వరమే పూర్తి చేస్తామని చెప్పింది.

అధికారంలోకి రాగానే రాష్ట్రాన్ని దేశంలో నెంబర్ వన్ స్టేట్‌గా చేస్తానని, రాజధాని నగరాన్ని ప్రపంచ నగరాల్లో ఒకటిగా రూపొందిస్తానని, పారిశ్రామిక అభివృద్ధి సాధిస్తానని చెప్తూ దేశదేశాలు తిరిగి 'అదిగో పెట్టుబడి ఇదిగో ఉద్యోగం అంటూ ఊరించడం తప్ప చేసింది శూన్యం. పైగా లక్షలాది ఎకరాల భూమిని రైతుల నుండి, దళితులు, గిరిజనుల నుండి బలవంతంగా గుంజుకొని బడా కార్పొరేట్ కంపెనీల పరం చేశాడు. కార్పొరేటు ప్రయోజనాల పరిరక్షణే ధ్యేయంగా విజన్ 2029 కార్యక్రమం ప్రకటించింది. ప్రభుత్వ ప్రయివేటు భాగస్వామ్యం ద్వారా వ్యవసాయాన్ని లాభదాయకం చేస్తామని ప్రకటించింది. ఉద్యాన పంటలు, పాడి, రొయ్యలు, చేపల సాగును ప్రోత్సహించడం ద్వారా 2022 నాటికి రైతుల ఆదాయాలు రెట్టింపు చేస్తామని పేర్కొన్నారు. ఈ క్రమంలోనే తిరుపతిలో భారీగా రైతు సదస్సు జరిపారు. ఆ సభలోనే డా. ఎంఎస్ స్వామినాథన్‌ను సత్కరించారు. ఆయన సమక్షంలోనే ముఖ్యమంత్రి తమ ప్రభుత్వం చేపడుతున్న కార్పొరేట్ వ్యవసాయం గురించి, జీరో బడ్జెటు వ్యవసాయం గురించి ప్రకటించారు. రైతులు పండించిన పంటలను గిట్టుబాటు ధర కల్పించకుండా రైతాంగాన్ని సంక్షోభం నుండి కాపాడలేరని డా. స్వామినాథన్ కుండ బద్దలు కొట్టినట్లు చెప్పారు.

ప్రజాస్వామ్యం, పారదర్శకత, ప్రజాతంత్ర హక్కులు వంటి మాటలు వల్లించే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తన ఈ నాలుగేళ్ల పాలనలో మాత్రం వాటికి ఏమాత్రం చోటివ్వడంలేదు. ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్నారు. న్యాయ వ్యవస్థనూ లెక్క చేయడంలేదు. ప్రజల కదలికలపై సర్కారు నిరంతర నిఘా వేస్తోంది. సెక్షన్ 30 లేదా సెక్షన్ 144 రాష్ట్రంలో ఏదో ఒక చోట అమలులో లేని రోజు లేదంటే అది అతిశయోక్తి కాదు. సిఎం ఎక్కడ పర్యటించినా ప్రతిపక్షాలకు చెందిన నాయకులు, ప్రజా సంఘాల కార్యకర్తల ముందస్తు అరెస్టులు, గృహ నిర్బంధాలు సర్వ సాధారణం. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ప్రతిరూపమైన శాసనసభలో అంతా ఏకపక్షమే! అన్ని బిల్లులనూ ఇలా ప్రవేశపెట్టి అలా చట్టాలుగా రూపొందించుకోవడం జరిగింది. నాలుగేళ్లలో ఒక్కసారి కూడా అఖిలపక్ష సమావేశం జరపకపోవడం సర్కారు పెత్తందారీ పోకడకు నిదర్శనం.

రాష్ట్రం రెండంకెల వృద్ధి సాధించాలంటే పారిశ్రామిక అభివృద్ధి జరగాలి. అందుకుగాను దేశీయ, విదేశీ కార్పొరేట్ కంపెనీల పెట్టుబడులను ఆహ్వానించాలి. పెట్టుబడులను ప్రోత్సహించడానికి సహజ వనరులైన నీరు, భూమి, ఖనిజాలు వారికి సమకుర్చాలి. అంతేకాదు కార్మిక చట్టాలను కార్పొరేట్ల కనుగుణంగా సవరించాలి. దీనిలో భాగంగానే చంద్రబాబు సంపన్నులకు, కార్పొరేట్లకు ఎర్ర తివాచీ పరిచి భూపందేరం చేస్తూ రైతులను, సామాన్యులను రోడ్డెక్కిస్తున్నారు. ఫలితంగా రైతులను, ప్రజలను నిర్వాసితులను చేసే ప్రక్రియ వేగవంత మైంది. సామాన్యులకు చాప కూడా మిగులకుండా చేస్తూ ప్రశ్నించే గొంతులను ప్రభుత్వ యంత్రాంగంచేత నులిమేయ చూస్తోంది.

**కుంటుపడుతున్న వ్యవసాయం**

వ్యవసాయం, అనుబంధ రంగాలపై ఆధారపడి 70 శాతం ప్రజానీకం జీవనోపాధి పొందుతున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో టిడిపి అధికారంలోకి వచ్చినప్పటి నుంచి తిండి గింజల సాగు అంతకంతకూ కుదించుకు పోతుంది. 2014-15 సీజన్లో పంటల దిగుబడులు 160.04 లక్షల టన్నులు, 2015-16 సీజన్లో 143.78 లక్షల టన్నులు, 2016-17 సీజన్లో 149.16 లక్షల టన్నులు, 2017-18 సీజన్లో 157.59 లక్షల టన్నులు మాత్రమే. 2014-15 అనంతరం వ్యవసాయ రంగం దిగుబడులు తగ్గిపోయాయి తప్ప ఏ మాత్రం పెరగలేదు. ఈ కాలంలో వరి సాగు విస్తీర్ణం 25.63 లక్షల హెక్టార్ల నుండి 20.77 లక్షల హెక్టార్లకు తగ్గింది. అక్రమ ఆక్వా సాగును ప్రోత్సహిస్తూ ఆ రంగంలో 30 నుండి 40 శాతం అభివృద్ధి సాధిస్తాం అని చెప్తూ వస్తున్నారు. అక్వా, పౌల్ట్రీ పరిశ్రమలకు పట్టం కడుతూ ఆయా రంగాల్లోని వృద్ధినే వ్యవసాయ వృద్ధిగా చూపిస్తూ రాష్ట్రంలో సేద్యానికి ఎంతో గొప్ప కృషి చేస్తున్నామని గొప్పలు చెప్పుకుంటోంది.

తృణధాన్యాలు వంటి పంటలను ప్రోత్సహించి జీవవైవిధ్యానికి బాటలు వేయాల్సిన ప్రభుత్వం వాణిజ్య పంటలపైనే దృష్టి సారించడమంటే ప్రకృతితో పరాచికాలాడటమే. పచ్చని పొలాలను కాలుష్య కాసారాలుగా మార్చి నిస్సారం చేస్తున్నాయి. వరి పండే పొలాలు లక్షలాది ఎకరాలు రొయ్యల చెరువుగా మారుతున్నాయి. మొర్రో అంటూ ప్రజానీకం గగ్గోలు పెడుతున్నా ఎక్కడిపడితే అక్కడ రొయ్యల చెరువులకు అనుమతులిచ్చి ప్రోత్సాహకాలందిస్తూ ప్రభుత్వం పర్యావరణాన్ని కాపాడే బాధ్యతను గాలికొదిలేసింది. కృష్ణా, ప.గోదావరి, తూ.గోదావరి జిల్లాల్లో లక్షలాది ఎకరాల పంట పొలాలు రొయ్యల చెరువులుగా మారిపోతున్నాయి. పరిసరాల్లో నీరు, భూమి కలుషితమవుతోంది. భారీ స్థాయి రొయ్యల

ప్రాసెసింగ్ యూనిట్లకు అనుమతులివ్వడమేగాక తీవ్ర స్థాయిలో ప్రజా వ్యతిరేకత వ్యక్తమౌతున్నా పట్టించుకోకుండా తాము కార్పొరేట్ల ప్రతినిధులమని చంద్రబాబు ప్రభుత్వం చాటుకుంది.

**ప్రజల గొంతులు కోసే భూసేకరణ చట్టాలు**

రైతులు, గ్రామీణ పేదలకు ఉరితాడుగా మారిన బ్రిటిష్ కాలం నాటి 1894 భూసేకరణ చట్టానికి వ్యతిరేకంగా అనేక రూపాల్లో పోరాటాలు జరిపిన ఫలితంగా యుపిఎ ప్రభుత్వం ప్రవేశపెట్టిన 2013 భూసేకరణ చట్టాన్ని పార్లమెంట్ ఆమోదించింది. 2013 చట్టం కూడా సమగ్రమైనది కాకపోవటంతో భూసేకరణ క్రింద భూములు కోల్పోయిన రైతాంగం ఆనాడే కాదు ఈనాడు కూడా నష్టాలు, కష్టాలు అనుభవిస్తున్నారు. ఇప్పటి వరకు ఏ ప్రాంతంలోనైనా పారిశ్రామికీకరణ ఇతర అవసరాల కోసం భూమిని సేకరించాలంటే ఆ ప్రాంతంలోని 80 శాతం మంది రైతుల ఆమోదం కావాలి. గ్రామ సభ తీర్మాణం ఉండాలి. అలానే భూమిని సేకరించటానికి ఆ ప్రాంత సామాజిక ప్రభావ అంచనా సర్వే తప్పని సరిగా నిర్వహించి, ఆ ప్రాంతంలో భూసేకరణ విధానం ప్రజలకు నష్టం కలిగించేదిగా సర్వే రిపోర్టు వస్తే భూసేకరణ నుండి ఆ ప్రాంతాన్ని తప్పని సరిగా మినహాయించాలి. ఈ చట్టం ప్రకారం సామాజిక ప్రభావ మదింపు న్యాయబద్ధమైన పరిహారం, పునరావాసం, ఆహార భద్రత, భూసేకరణ సమయంలోనే బాధితులకు పరిహారం, సహాయం, పునరావాసం ప్రకటించాల్సి ఉంది.

మోడీ ప్రభుత్వం అంబానీ, ఆదానీ, జిందాల్ వంటి బహుళజాతి కంపెనీలు, కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలను కాపాడే భూసేకరణ చట్ట సవరణలను నేరుగా పార్లమెంట్ ఆమోదం పొందలేక మోడీ ప్రభుత్వం 2015లో ఆర్డినెన్స్‌ల రూపంలో దొడ్డిదారిలో చట్టాన్ని అమలు చేసే విధానాలకు పాల్పడింది. మోడీ ప్రభుత్వానికి లోక్ సభలో మెజారిటీ ఉన్నా రాజ్యసభలో మెజారిటీ లేకపోవటంతో చట్టాన్ని పార్లమెంట్‌లో ఆమోదింపచేయటం సాధ్యం కాక ఆఖరికి ఆర్డినెన్స్‌లతో కాలం గడపాలని చూసినా, చివరికి కాలపరిమితి కారణంగా ఆర్డినెన్స్‌ను కూడా అమలు చేయలేకపోయింది. అందుకని తమకు రాజ్యసభలో కూడా మెజారిటీ వచ్చేలోపు చట్టాన్ని అమలు చేసే అధికారం తమకు లేనందున తమకు అనుకూలమైన రాష్ట్రాల చేత అమలు చేయించే విధానానికి మోడీ ప్రభుత్వం దొడ్డిదారిన తలుపులు తెరిచింది.

ఈ నేపథ్యంలోనే పరిశ్రమలకు భూసేకరణ చట్టం-2013 అడ్డంకిగా ఉందని నూతన చట్ట రూపకల్పనకు ఎపి ముఖ్యమంత్రి చంద్రబాబు నవంబర్ 2017లో 'ఎపి భూసేకరణ (సవరణ) చట్టం-2017' అసెంబ్లీలో ప్రవేశపెట్టి ఆమోదం పొందాడు. ఆ తరువాత ఆమోదం కోసం రాష్ట్రపతికి పంపారు. 2018 మే 27న రాష్ట్రపతి ఆమోదం పొందింది. దీంతో రైతుల నుంచి విచక్షణ రహితంగా భూమి గుంజుకునే వీలుంది. ప్రజాభీష్టమే పరమావధిగా నిలిచిన 2013 భూసేకరణ చట్టానికి ఇప్పుడు చంద్రబాబు ప్రభుత్వం నిలువునా తూట్లు పొడిచింది. ఏడాదికి మూడు పంటలు పండే సారవంతమైన భూములను సైతం గుంజేసుకునే వీలు కల్పించే దౌర్భాగ్యపు సవరణలను టిడిపి ప్రభుత్వం తాజా చట్టంలో పొందుపరిచింది.

2017లో జరిగిన రాష్ట్ర అసెంబ్లీ సమావేశాల్లో ప్రవేశపెట్టిన భూసేకరణ సవరణ చట్టం, పారిశ్రామిక కారిడార్ల చట్టం, సిఆర్‌డిఎ సవరణ చట్టం, నాలా సవరణ చట్టం, అద్దె నియంత్రణ చట్టం, వడ్డీ వ్యాపారుల చట్టం మొదలైన వాటిని క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే ఒక విషయం బోధపడుతుంది. ఇవన్నీ కూడా ఒకదానికొకటి అనుసంధానంగా చేసిన చట్టాలు. ఈ చట్టాలన్నీ ఒకేసారి అమల్లోకి వస్తే భూములను లాక్కోవడం, వాటిలో కార్పొరేట్లకు పెత్తనం కట్టబెట్టడం, వారి అజమాయిషీకి అధికారం ఇవ్వడం, వారికి తోచిన విధంగా భూముల స్థితిని ఇష్టప్రకారం మార్చుకోవడం, వారి ఉత్పత్తులు పట్టణాల్లో అమ్ముకునేందుకు వీలుగా అవసరమైన భవనాల అద్దెలు నియంత్రించడం ఒక క్రమపద్ధతిలో జరిగిపోతాయి. ప్రపంచ బ్యాంకు కనుసన్నల్లో, కార్పొరేట్ల అడుగులకు మడుగులొత్తుతూ భూములను కారుచౌకగా కట్టబెట్టేందుకు చంద్రబాబు చేస్తున్న కుట్రలు, కుయుక్తులకు ఈ అసెంబ్లీ సమావేశాల్లో చట్టబద్ధత కల్పించుకున్నారు.

భూ సేకరణ చట్టం-2017, పారిశ్రామిక కారిడార్ చట్టం-2017 రాష్ట్రంలో ప్రజాజీవనాన్ని, స్వేచ్ఛను, భూములు కోల్పోయే ప్రజలకు ఉండాల్సిన హక్కులను కాలరాసేలా ఉన్నాయి. వీటిపై కనీస చర్చ లేకుండానే ప్రభుత్వం అసెంబ్లీ నిర్వహించేసింది. నిజానికి ఎన్నికల ప్రణాళికలో ప్రకటించిన ప్రజల ఏ ఒక్క సమస్యను నేటికి పరిష్కరించలేదు. చంద్రబాబు నాలుగేళ్ల పాలనను గమనిస్తే ప్రజా శ్రేయస్సు కంటే కార్పొరేట్ల ప్రయోజనమే ప్రధానంగా పాలన సాగుతుందనడానికి ఆయన అనుసరించిన ప్రజావ్యతిరేక విధానాలే వెల్లడి చేస్తున్నాయి. ఎపి భూసేకరణ చట్టం 2017 వలన 2013లో కేంద్ర ప్రభుత్వం తెచ్చిన 'రైట్ టు ఫెయిల్ కాంపెన్సేషన్ అండ్ ట్రాన్స్‌పరెన్సీ ఇన్ ల్యాండ్ అక్విజిషన్ అండ్ రిహాబిలిటేషన్ అండ్ రీసెటిల్‌మెంట్ భూసేకరణ చట్టం-2013కు తూట్లు పొడిచే విధంగా తయారైంది. దేశంలో ఆంధ్రప్రదేశ్ ధాన్యాగారంగా ఖ్యాతిగడించింది. బాబు చర్యల వలన అనతికాలంలోనే 'అన్నమో రామచంద్రా' అంటూ అలమటించాల్సిన పరిస్థితి రాక తప్పదని ప్రజలు ఆందోళన చెందుతున్నారు.

రైతుల జీవితాలు మారిపోతాయనే పేరుతో రాజధాని నిర్మాణం కోసం మొత్తం లక్ష ఎకరాల సేకరణలో భాగంగా రెండు పంటలు పండే 35 వేల ఎకరాల పంట భూములను సమీకరించింది. రాజధానిని నిర్మించటానికి ఆటంకంగా ఉన్న బహుళ పంటలు పండే భూములను గుంజుకోవటానికి చంద్రబాబు ప్రభుత్వానికి 2017 చట్టం పెద్ద ఆయుధంగా ఉపయోగపడుతుంది. ఇటువంటి స్వార్థపూరిత ప్రయోజనంతోనే రాష్ట్రప్రభుత్వం ఈ చట్టంలో సామాజిక ప్రభావ అంచనాకు మంగళం పాడింది. ఈ చట్టాన్ని అడ్డం పెట్టుకొని ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యం (పిపిపి) కింద చేపట్టే ప్రాజెక్టులు, రహదారులు, గృహ నిర్మాణ ప్రాజెక్టులు, ప్రభుత్వ అవసరాలకు వినియోగించే భూములను సామాజిక ప్రభావ మదింపు అంచనా లేకుండా రైతుల నుండి భూములను సేకరించే హక్కును పొందుతుంది. ఈ చట్టం ప్రకారం రైతులు ఏమీచేయలేని ప్రేక్షకులుగా మిగిలిపోతారు.

అభివృద్ధి ప్రయోజనాలు ప్రజలకు అందించడానికే భూసేకరణ సవరణ బిల్లును ప్రవేశపెట్టామని చంద్రబాబు ప్రభుత్వం పేర్కొనడం తిమ్మిని బమ్మి చేసే ప్రయత్నమే! ఈ సవరణల ద్వారా రైతులకు రాజీ పడకుండా అధిక నష్ట పరిహారం ఇవ్వొచ్చనీ, పునరావాసం కల్పించొచ్చనీ ప్రభుత్వం చెబుతున్న మాటలు కూడా మోసపూరితమైనవే. ప్రభుత్వం చేసిన సవరణల్లో అతి ముఖ్యమైనది పలు ప్రాజెక్టుల భూసేకరణను సామాజిక ప్రభావ అంచనాల నుండి మినహాయించడం. ఇలా మినహాయింపు పొందే జాబితాలో జాతీయ భద్రత, దేశ రక్షణ, రక్షణ ఉత్పత్తిలో భాగమైన ప్రాజెక్టులతో పాటు, విద్యుద్దీకరణ పొందే జాబితాలో

జాతీయ భద్రత, దేశ రక్షణ, రక్షణ ఉత్పత్తిలో భాగమైన ప్రాజెక్టులతోపాటు, విద్యుద్దీకరణ, గ్రామీణ మౌలిక సదుపాయాలు, గృహ నిర్మాణం, గృహ వసతి, రాష్ట్ర ప్రభుత్వ అనుబంధ సంస్థలు ఏర్పాటు చేసే పారిశ్రామిక కారిడార్లు, వాటి కోసం ఏర్పాటుచేసే రైల్వేలైన్లు, రోడ్లు వంటివాటిని చేర్చింది.

ఈ ప్రాజెక్టులన్నింటినీ సామాజిక ప్రభావ అంచనాల నుండి మినహాయించడమంటే క్షేత్రస్థాయి వాస్తవాలతో ఏ మాత్రం నిమిత్తం లేకుండా భూమిని గుంజుకోవడమే! రాష్ట్ర ప్రభుత్వం చేసిన మరో క్రూర విన్యాసం ఆహార భద్రతా నిబంధనల వర్తింపు నుండి కూడా ఈ ప్రాజెక్టులను మినహాయించడం! దీనర్థ వ్యవసాయ యోగ్యమైన సారవంతమైన భూములతో పాటు, బహుళ పంటలు పండే భూములను కూడా కార్పొరేట్లకు కైంకర్యం చేయడమే! 2013 నాటి భూసేకరణ చట్టం అమలులో ఉండగానే చంద్రబాబు ప్రభుత్వం భూసమీకరణ పేరుతో అడ్డదారిని వెతికింది. ఇప్పుడు ఏకంగా కలెక్టర్లకు సర్వాధికారాలు కట్టబెట్టడం, నష్టపరిహారం చెల్లింపులో ఒకే ప్రాంతంలో వేరేవేరు ధరలకు అవకాశం కల్పించడం వంటి ప్రతిపాదిత మినహాయింపులన్నీ రైతాంగ ప్రయోజనాలను గండికొట్టేవే!

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక కారిడార్ అభివృద్ధి చట్టం-2017ను నవంబర్ 12న అసెంబ్లీలో ప్రవేశపెట్టింది. కోస్తా ప్రాంత భూములను పారిశ్రామికవేత్తలకు కట్టబెట్టేందుకు వీలుగా, అక్కడ ప్రయివేటు పెత్తనమే నడిచే విధంగా నిబంధనలను పొందుపరిచింది. పారిశ్రామిక కారిడార్ అంటే విశాఖపట్నం నుండి చెన్నై (విసిఐసి) వరకూ, చెన్నై నుండి బెంగళూరు (సిబిఐసి) వరకు, వీటి మధ్యలో ఉన్న భూములపై అనేక ఆంక్షలను విధించింది. ఆ ప్రాంతంలో ఇంటి నిర్మాణానికి గొయ్యి తవ్వాలన్నా అనుమతి తీసుకోవాలి. యూజర్ ఛార్జీలు చెల్లించాలి. భూముల కేటాయింపునకు పెద్దపీట వేశారు. భూమిని ప్లాట్లుగా మార్చకూడదు. అనుమతి లేకుండా ఏ రోడ్డుతోనూ ప్లాట్లను కలప కూడదు. కారిడార్లలో అభివృద్ధికి ప్రయివేటు వ్యక్తుల భాగస్వామ్యాన్ని చట్టంబద్ధం చేశారు. సిఎం చైర్మన్‌గా ఏపి పారిశ్రామిక కారిడార్ డెవలప్‌మెంట్ అథారిటీని ఏర్పాటు చేయనున్నారు. 13 మంది సభ్యులుగా ఉండే ఈ బోర్డులో ఐదుగురు పారిశ్రామికవేత్తలుంటారు. కారిడార్ అభివృద్ధికి నిధులను మార్కెట్ శక్తులు, ప్రయివేటు రంగం నుండి సమకూర్చుకోవచ్చు. యూజర్ చార్జీలు వసూలు చేసే హక్కునూ అథారిటీకి ఇచ్చారు.

భూసేకరణ సవరణ చట్టం 2017, పారిశ్రామిక కారిడార్ చట్టాలు రాకమునుపే నిర్వాసితులైన పోలవరం, వంశధార తదితర ప్రాజెక్టు బాధితుల గోడు చూస్తున్నాం. బందరు ఓడరేవు పారిశ్రామిక వాడకు 33 వేల ఎకరాలు, మల్లపల్లి ఫుడ్ ప్రోసెసింగ్‌కు 1,600 ఎకరాలు, కేంద్ర విపత్తు నివారణల్లో భాగంగా కొండ పావులూరులో 400 ఎకరాలు, ఎపిఐఐసికి వీరపనేని గూడెంలో 200 ఎకరాలు, గన్నవరం విమానాశ్రయం విస్తరణకు 700 ఎకరాలు, రాకెట్ లాంచింగ్ స్టేషన్‌కు గుల్లలమోదలో 380 ఎకరాలు తీసుకున్నారు. ఎక్కడా 2013 చట్టాన్ని అమలు చేయలేదు. భూములు తీసుకున్న రైతులకు ఒప్పుకున్న నష్టపరిహారం కూడా ఇవ్వలేదు. కోస్టల్ కారిడార్ వెంబడి భారీగా పారిశ్రామీకరణ చేపట్టడం, రోడ్ల వెడల్పు, రైల్వేలైన్లు, విమానాశ్రయాలు, ఓడరేవులు, పెట్రోల్-గ్యాస్ సరఫరా, టౌన్‌షిప్పులు, సెజ్జులు, మైనింగ్ మొదలైన వాటికోసం లక్షలాది ఎకరాల భూసేకరణ చేపట్టింది. కోస్టల్ కారిడార్ వెంట ఐటి, టూరిజం, వినోదం, వ్యవసాయాధారిత పరిశ్రమలు, పెట్రోకెమికల్స్, ఫార్మా, విద్యుత్ ఉత్పత్తి ప్లాంట్స్, మందుల పరిశ్రమలు వగైరాలు నెలకొల్పుతున్నారు.

ఇక ఈ చట్ట సవరణ అనంతరం మరింత అడ్డగోలుగా ప్రభుత్వం భూసేకరణకు పూనుకుంటుందనడంలో సందేహమే లేదు. తాజా చట్టం ప్రకారం ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యం కింద చేపట్టే ప్రాజెక్టులు, రహదారులు, గృహ నిర్మాణ ప్రాజెక్టులు, ప్రభుత్వ అవసరాలకు భూములు సేకరిస్తే అందుకు సామాజిక ప్రభావ మదింపు అంచనా అవసరంలేదు. కలెక్టరు ఇష్టానుసారం భూసేకరణ జరిగిపోతుంది. ఒక్క కలం పోటుతో ఎంత కావాలంటే అంత భూమిని గుంజేసుకోవచ్చు. నచ్చిన పారిశ్రామికవేత్తలకు అప్పనంగా కట్టబెట్టేయవచ్చు. ప్రభుత్వం బలవంతంగా భూములు లాక్కుంటే భూ యజమానులు ప్రేక్షకుల్లా మిగిలిపోవాల్సిందే. కలెక్టరు, ఇతర అధికారులు సంప్రదింపుల ద్వారా నిర్ణయించిన ధరే నచ్చినా నచ్చకపోయినా పుచ్చుకోవాల్సిందే మినహా కోర్టు మెట్లెక్కె వెసులుబాటు కూడా ఉండదు. సామాజిక ప్రభావ సర్వే జరపాల్సిన అవసరం లేనందున కీలకమైన పునరావాసం, పునర్నిర్మాణం కార్పొరేటు కంపెనీల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది.

చంద్రబాబు ఉమ్మడి రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉండగా ప్రపంచ బ్యాంకు సిఇఒనని చెప్పుకున్నాడు. హైద్రాబాదును అభివృద్ధి చేశానని గర్వంగా ఇప్పటికీ చెప్పుకుంటున్నారు. అలాంటి కేంద్రీకృతమైన అభివృద్ధి వల్ల ఎలాంటి దుష్ఫలితాలు వచ్చాయో మనకు అనుభవమే అయినా అమరావతి పేరుతో మరలా అదే ప్రయోగానికి పూనుకుంటున్నారు. రాష్ట్రాన్నంతా ఎండబెట్టి నిధులన్నిటినీ ఒక్క చోటే కుమ్మరిస్తే కాంట్రాక్టర్లు బాగుపడవచ్చు తప్ప ప్రజలకు ఒరిగేదేమీ ఉండదు. అయినా రాజధాని నిర్మాణమైనా జరుగుతోందా అంటే అదీ లేదు. నాడు తాను ఉమ్మడి రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉండగా అంతర్జాతీయ ఫైనాన్సు కంపెనీలు పచ్చగా ఉండి కావాల్సినంత అప్పులిచ్చాయి. కాని నేడు ప్రపంచమంతా సంక్షోభం ఆవరించింది. విఫలమైన సరళీకరణ విధానాలనే నేడు మరల విడిపోయిన రాష్ట్రంలో చంద్రబాబు అమలు చేస్తున్నారు. అవి ఫలితాలు ఇవ్వడం లేదు. అయినా వాటి చుట్టూనే తిరుగుతూ ప్రజల ఆగ్రహానికి గురవుతున్నారు.

పారిశ్రామికీకరణ పేరుతో గత 20 సంవత్సరాలుగా రాష్ట్రంలో జరిగిన భూసేకరణల్లో అత్యధిక భాగం పర్యావరణానికి విఘాతం కలిగించేవి, సమాజ జీవితాన్ని ఛిద్రం చేసేవే కావడం గమనార్హం. ముఖ్యంగా తీరప్రాంతంలోని మత్స్యకారులు ప్రత్యక్షంగా జీవనం కోల్పోవడం మాత్రమే కాకుండా పరిశ్రమలు వెదజల్లే భయంకరమైన కాలుష్యం భారినపడుతున్నారు. ఈ పరిస్థితులే భూసేకరణకు, పారిశ్రామిక కారిడారుకు వ్యతిరేకంగా ఎక్కడికక్కడ స్థానికులు ప్రతిఘటించేలా చేస్తున్నాయి. విశాఖమన్యంలో బాక్సైట్ వ్యతిరేక పోరాటం, శ్రీకాకుళం జిల్లా సొంపేటలో రైతుల ఆందోళనతో పాటు రాష్ట్రంలో ప్రస్తుతం చర్చనీయాంశంగా మారిన పశ్చిమ గోదావరి జిల్లా తుందుర్రు, తూర్పుగోదావరి జిల్లా తొండంగి పోరాటాలూ ఆ కోవలోవే! కాలుష్యాన్ని పెంచే, తమ జీవనోపాధిని పోగొట్టే పరిశ్రమలకూ, ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ప్రజలు తిరగబడే ప్రతిచోటా ప్రభుత్వం పోలీసు బలగాలను ప్రయోగించి ప్రజా పోరాటాలు అణచి వేయడానికి ప్రయత్నిస్తోంది. ఇప్పటికే లక్షలాది ఎకరాల భూమిని రైతుల నుండి బలవంతంగా లాక్కుని ప్రయివేటు భూ బకాసురులకు అందజేస్తున్న ప్రభుత్వం 2017 భూసేకరణ బిల్లు ద్వారా కార్పొరేట్ల ప్రయోజనాలకు పెద్ద పీట వేయడానికే బరి తెగించింది. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# నవ్యాంధ్రలో పండని నాపచేను - ఉత్తరాంధ్ర

*ఆంధ్రప్రదేశ్‌లో ఈ నాలుగేళ్లలో కూడా ఉత్తరాంధ్ర ఏ విధంగా రాజకీయ, సాంస్కృతిక వివక్షకూ, ఆర్థిక దోపిడీకీ గురవుతున్నదో వివరిస్తున్నారు* **అట్టాడ అప్పలనాయుడు**

నవ్విన నాపచేనే పండుతాది అని సామెతుంది. నాపచేను పండిందో లేదోగానీ - ఎన్నికల వేళల్లోనో, పార్లమెంట్ అసెంబ్లీలలోనో పాలకులు గొంతుచించుకు చేసిన ప్రసంగాలగోస తప్ప ఉత్తరాంధ్ర వెనకబాటుతనం పోలేదు. ఉత్తరాంధ్ర అభివృద్ధి పథంలో వెనకబడే ఉంది. ముందుకు రాలేదు. విద్య, వైద్యం, ఉపాధి, సాగునీటి సదుపాయం, రహదార్లు వంటి మౌలికాంశాల్లో పదమూడు జిల్లాల నవ్యాంధ్ర గణాంకాల పట్టికలో ఉత్తరాంధ్ర చివరి మూడు స్థానాల్లో వుంది. చివరి పదమూడో స్థానం విజయనగరం, పన్నెండు శ్రీకాకుళం, పదకొండు విశాఖజిల్లా! అదేమి విచిత్రమో మౌలికావసరాల గణాంకాలు యిలా వుండగా... నవ్యాంధ్రలో నవ్వుతూ బతికేవాళ్లు శ్రీకాకుళం జిల్లా వాళ్లని ఓ సర్వే! సంతోష శ్రీకాకుళమట! (బహుశా శ్రీకాకుళంలోకి చొరబడిన క్రిష్ణా, గుంటూరు, గోదావరి తదితర పర ప్రాంత వాసులను సర్వేచేసి ఉండొచ్చు. హోటళ్లూ, సిన్మా హాల్లూ, రియల్ ఎస్టేట్లూ, కర్మాగారాలూ, కాంట్రాక్టులూ కొట్టేసినోళ్లు, ఇక్కడి ఇసుక, రాయి, ((గ్రానైట్) అడవికలప, ఖనిజాలు దోచుకుపోతున్న వాళ్లు సంతోషంగా కనిపించుండొచ్చు!) మహాకవి గురజాడ "తిండి కలిగితే కండకలుగును; కండ గలవాడే మనిషోయ్" అనంటే - తిండీ లేదు, కండా లేదు... తొండల్లాగున్నామని విప్లవకవి సుబ్బారావు పాణిగ్రాహి వాపోయిన వాస్తవం యీ నాటికీ మారలేదు!

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ నుండీ విడివడి నవ్యాంధ్రగా అధికారపార్టీ నామకరణం చేసిన నవ్యాంధ్రలో గూడా యెక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నాది. నాలుగేళ్ల నవ్యాంధ్రలో మరింతగా రాజకీయ,సాంస్కృతిక వివక్షకూ, ఆర్థిక దోపిడీకీ ఉత్తరాంధ్ర గురవుతన్నాది. ఏ కారణాలతో ఉమ్మడి ఆంధ్ర నుండి విభజనను తెలంగాణ ప్రజలు కోరుకొని పోరాడి విడిపోయినారో (విభజన తర్వాత తెలంగాణ ప్రజలకు యేమేరకు మేలు జరిగిందన్నది వేరే చర్చ) అవే కారణాలు ఉత్తరాంధ్రకూ వర్తిస్తున్నాయి ఇప్పుడు విభజన తర్వాత మరింతగా!

నిజానికి తెలంగాణ ప్రాంతంలో చట్టసభల ప్రాతినిధ్యం ఉత్తరాంధ్రలా పరప్రాంతీయుల పరం కాలేదు. ఇక్కడ చట్టసభల ప్రాతినిధ్యం కూడా వలస వచ్చిన వ్యాపారవేత్తలూ, కాంట్రాక్టర్లూ, వాణిజ్య ప్రముఖులూ కైవసం చేసుకుంటున్నారు. చివరికి విశాఖ పట్టణంలోని ప్రాచీన గ్రామ దేవతల గుడులకు, దేవాలయాలకూ పరప్రాంతీయులే పాలకవర్గ సభ్యులవతున్నారు. ఉత్తరాంధ్ర మూలవాసులు వలసలు పోతన్నారు. ఏటా యాభై వేలకుపైగా ఉత్తరాంధ్ర నుంచి ఉపాధి వెదుక్కుంటూ వలస పోతన్నారు. ఉపాధిని యివ్వలేని, వనరులు లేని ఉపయుక్తం కాని ప్రాంతం కాదు ఉత్తరాంధ్ర!

పదేళ్ల కిందట నేను సూర్య దినపత్రికలో "కల్లం నిండా కుప్పలు - ఊరి నిండా అప్పులు" అని 'నేస్తం ఊసులు' కోలంలో - "ఔనే శీస్తం, ఆ రాయలసీమ వోలికి రాళ్లసీమ గనక యేటీ దారిలేక యేడస్తన్నారు! ఈ తెలంగాణ వోలికి పంట భూమీ, పనికొచ్చే కర్మాగారాలూ లేక యేడస్తన్నారు. గానీ ఆళ్ల కంటా మనం పోర్లి పోర్లి యేడాల. గొంతులు తెంపుకొని అరవాల. ఎందుకంటే - ఆ రెండు ప్రాంతాలకీ లేనంత సముద్రముంది. ఆళ్లకి లేని అడివి యిలాటలాటిదా...యెంతుంది? బంగారం లాంటి పంటభూములున్నాయి. ఆరుగాలం పిల్లాది మొదలు వొళ్లు యిరిసి పనిజేసే మనుసులున్నారు! అయినా యెందుకు ఉత్తరాంధ్ర ఎనకబడిపోనాది?" అని రాసేను.

రాష్ట్ర విభజన సందర్భంగా వేసిన శ్రీక్రిష్ణా కమీషన్ కూడా తెలంగాణ, రాయలసీమల్లా ఉత్తరాంధ్ర వెనుకబడి వుంది. ఉత్తరాంధ్ర అభివృద్ధి కోసం ప్రత్యేక ప్రణాళికలూ, నిధులూ సమకూర్చి అభివృద్ధి చేయాలన్నాది. రాష్ట్ర విభజనలో ఉత్తరాంధ్ర అభివృద్ధి కోసం ప్రత్యేక ప్యాకేజీ (ఆంధ్రప్రదేశ్ రీ ఆర్గనైజేషన్ యాక్ట్ 2014, సెక్షన్. 46(2), 46(3) ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం కేటాయించాలి. కానీ రాష్ట్రానికి ప్రత్యేక హోదా, ప్రత్యేక ప్యాకేజీ రాలేదనీ, రావాలనీ ముఖ్యమంత్రీ, ప్రతిపక్ష నేతా ఉద్యమిస్తారే గానీ ఉత్తరాంధ్ర ప్రత్యేక ప్యాకేజీ ఊసెత్తుకోరు! (ప్రత్యేక హోదా, ప్యాకేజీ వలన ప్రజలకు ఒరిగేదెంత అనేది వేరే చర్చ). కనీసం పదిహేను వేల కోట్ల రూపాయల నిధులతో బుందేల్‌ఖండ్ తరహాలో ఉత్తరాంధ్ర అభివృద్ధికి ప్రణాళికాబద్ధ కార్యాచరణ ఉండాలి. నాలుగేళ్ల నవ్యాంధ్రలో ఇందుకు సంబంధించిన ప్రణాళికేదీ ఉత్తరాంధ్రకు ప్రభుత్వం అమలు చేయడం కాదు కదా, ఆలోచించనే ఆలోచించలేదు. ఉత్తరాంధ్ర అభివృద్ధి వేదిక, ఉత్తరాంధ్ర మేధావుల వేదిక, ఉత్తరాంధ్ర రచయితలు, కళాకారుల వేదిక వంటి సంస్థలూ, కొణతాల రామక్రిష్ణ వంటి నేతలొకరిద్దరూ, పార్లమెంటరీ వామపక్ష పార్టీలూ - రీ ఆర్గనైజేషన్ యాక్ట్ ప్రకారం ప్రత్యేక ప్యాకేజీ కోసం మెమొరాండంలో, పత్రికా ప్రకటనలో, ఆందోళనలో చేస్తున్నారు గానీ ప్రభుత్వం మీద పెట్టాల్సినంత ఒత్తిడి పెట్టలేక పోతున్నారు.

ప్రభుత్వాధికారం నెరపుతోన్న తెలుగుదేశం నాలుగేళ్లు కేంద్ర ప్రభుత్వ బిజెపితో కాపురం చేసి ఇపుడు ప్రత్యేక హోదా కోసం కాపురాన్ని తెగతెంపులు చేసుకొని - ప్రత్యేక హోదా ఆంధ్రుల హక్కని నినదిస్తోంది! కేంద్రంలోని బిజెపీ ఆంధ్రులకు అన్యాయం చేస్తోందంటోంది. అదే అన్యాయం రాష్ట్ర తెలుగుదేశం ప్రభుత్వం ఉత్తరాంధ్రకు చేస్తోందని ఉత్తరాంధ్ర ప్రజలు గొంతు విప్పాలి! ఏ ప్రాంత అభివృద్ధికయినా ప్రధానంగా కావలసినవి - ప్రకృతి వనరులూ, మానవవనరులూ! ఈ రెండూ పుష్కలంగా ఉండి కూడా ఉత్తరాంధ్ర వెనకబాటుకి గురైంది. నేడు ఆ ప్రకృతి వనరుల దోపిడీకి గురవుతోంది. అంటే ఇక ముందర ఉత్తరాంధ్ర సంపదంత సహజ వనరులు కోల్పోయి... బీడుబడుతుంది!

పదమూడు జిల్లాల నవ్యాంధ్రలో 75 శాతం ఆదివాసీలు ఈ మూడు జిల్లాల్లో ఉన్నారు. ఆదివాసీ ప్రాంతాన మానవాళికి అవసరమైన 500 రకాల ఔషధ మొక్కలూ, గృహోపకరణాలకు వినియోగపడే టేకు, మద్ది, ఏగిస, గుగ్గిలం వగైరా వృక్ష సంపద, ఆహార పంటలైన పనస, మామిడి, చింత, జీడి, జీలుగు, విప్ప, కాగు మొదలైన చెట్లూ, పోడుభూములూ,

కొండ కోనల సహజ సంపదల ఆదివాసీ ప్రాంతాన్ని కార్పొరేట్ కంపెనీలకు అప్పగిస్తున్నారు. ఆరు లక్షల ఆదివాసీలనూ, రెండువందల ఆదివాసీ గ్రామాలనూ విస్థాపనకు గురిచేసే, శారద, తాండవ నదులను కలుషితం చేసే.. బాక్సైట్ వెలికితీతను ప్రతిపక్షంలో ఉన్నపుడు వ్యతిరేకించిన పాలక తెలుగుదేశం ఇపుడు మాటమార్చి బాక్సైట్ దోచివేతకు కార్పొరేట్ కంపెనీలకు దారులు వేస్తోంది!

దాదాపు 340 కి.మీ. సముద్ర తీరముంది. కోట్లాది రూపాయల విలువ చేసే మత్స్య సంపద, తీరంలోని ఇసుకలో యురేనియం ఖనిజ సంపద పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద కంపెనీలు కొల్లగొట్టుకుపోతు న్నాయి. ఇంకోవేపు తీరప్రాంతాన థర్మల్ విద్యుత్ కంపెనీలు పెడుతూ, డంపింగ్ యార్డులుగా సముద్రతీరాన్ని చేయబోతున్నారు!

కోనసీమను మించిన ఆకుపచ్చ ఉద్యానవనం ఉద్దాన ప్రాంతం ఉంది. వరి, చెరకు, చోడి, కంది వంటి ఆహారపంటలే గాక, మునగ, అరటి, కొబ్బరి, పనస, జీడి వంటి పంటలకు ఉద్దానం నెలవు. ఈ ప్రాంతాన్ని థర్మల్ విద్యుత్ కంపెనీలతో నింపబోతే సోంపేట తిరగబడి నిలవరించింది.

కాని ఇప్పుడు ఆగ్రో సంబంధ పరిశ్రమలేవో పెడతామంటోంది ప్రభుత్వం! పంటలకు సంబంధించిన ఆగ్రో పరిశ్రమలు మాత్రం అవి కానేకావని ఉద్దానం ప్రాంత ప్రజల అభిప్రాయం! తన అభిప్రాయాలకు భిన్నంగా ప్రజలు అభిప్రాయపడితే – చంద్రబాబు అది ప్రతిపక్షపార్టీ, లేదా అభివృద్ధి నిరోధకుల ఆరోపణగా, కుట్రగా దబాయిస్తారు. వంశధార, నాగావళి, జంఝావతి, వేగావతి వంటి పద్దెనిమిది చిన్నాపెద్దా నదులు; ఏ ప్రాంతానికంటే అధిక వర్షపాతం (1050 మి.లీ.) అయినా యిప్పటికీ 23.24 లక్షల ఎకరాల సాగుభూమిలో కేవలం 8 లక్షల ఎకరాలకే సాగు నీరు అందుతోంది. సారవంత పంటభూములకు నీరందించడం, పంటలకు కిట్టుబాటు ధర కల్పించడం, పంటల ఆధార పరి శ్రమలు పెట్టడం వంటి ప్రజోపకర ప్రయతాశీలకు బదులుగా – పల్లపు భూములను సెజ్జులుగా, నదులను పరిశ్రమలకు నీరందించే విధంగా పథకాలు రచిస్తోంది ప్రభుత్వం! పనేశెండు వందల గ్రామాలకు తాగు నీరూ, సాగునీరూ అందించే సుజల స్రవంతి పథకాన్ని యిప్పటికీ పూర్తి చేయరు, తెలుగుదేశం ఎన్నికల ప్రణాళికలో (పేజీ.14) ప్రకటించి కూడా! సుమారు 7500 కోట్ల రూపాయల బడ్జెట్ ప్రాజెక్టుకు కేవలం 3 కోట్లు కేటాయించేడు చంద్రబాబు! వంశధార రెండో ఫేజ్ నత్తనడక నడుస్తుంది, గానీ వంశధార పరీవాహకప్రాంత ప్రజలను మాత్రం బలవంతంగా దుర్మార్గంగా పంట భూములనుండీ, ఇళ్ల నుండీ ఊళ్లనుండీ తరిమేసింది ప్రభుత్వం! బాహుద, వరహాలగెడ్డ, తారకరామ, గుమ్మడిగెడ్డ, తీర్థ సాగర్ వంటి అనేక నీటిపారుదల ప్రాజెక్టుల ఊసే యెత్తడం లేదు నాలుగేళ్లుగా ప్రభుత్వం! ప్రజలంతా వనితిరేకిస్తున్నా ప్రతిష్టాత్మకంగా ( కాంట్రాక్టర్ల ప్రయోజనం కోసమే) తీసుకొని పని చేస్తున్న పోలవరం ప్రాజెక్టు నీళ్లల్లో ఉత్తరాంధ్రకు రావలసిన వాటా వుంది. నిజానికి గోదావరిలో ఉత్తరాంధ్రలోని సీలేరు, శబరీ నదులు కలుస్తాయి, అలాగే మహారాష్ట్ర, తెలంగాణలోని నదుల నీళ్లు కలుస్తాయి తప్పా క్రిష్ణా, గుంటూరు, ఉభయగోదావరి వంకలూ, వాగులేవీ కలవవు! తెలంగాణ, మహారాష్ట్రలు తమ వాటాను దక్కించుకుంటున్నాయేగానీ ఉత్తరాంధ్రకు ఉత్త చేయే మిగిలింది! ఉత్తరాంధ్రకు గల సహజ వనరులయిన అటవీప్రాంతాన్ని ఖనిజాల కోసం కార్పొరేట్ కంపెనీలు ఆక్రమిస్తే, అక్కడి భూమినీ, అటవీసంపదనీ వలస వచ్చిన ఒకానొక సామాజిక వర్గం ఆక్రమించింది. అలాగే సముద్రాన్ని పెద్దపెద్ద షిప్పింగ్ కంపెనీలూ, తీరాన్ని కార్పొరేట్ కంపెనీలూ ఆక్రమించినాయి. మైదానప్రాంతాన్ని కొంత వలసదారులూ, కొంత సెజ్‌ల పేరిట వివిధ కంపెనీలూ ఆక్రమించినాయి! ఆక్రమణకు గురైన అనాథ... ఇవ్వాళ్టి ఉత్తరాంధ్ర! విభజన హామీలు నెరవేర్చలేదని కేంద్రం మీద విమర్శ చేసే రాష్ట్ర తెలుగుదేశ ప్రభుత్వం ఉత్తరాంధ్రకు ఇచ్చిన హామీలనూ తుంగలో తొక్కింది. విశాఖ పటాశీనికి మెట్రోలైన్, రైల్వే జోన్, గిరిజన విశ్వవిద్యానిలయం, స్టీల్‌ప్లాంటుకు కాన్‌ప్టివ్ మైన్స్ కేటాయింపు, మెడికల్ కాలేజీ, సాగునీటి ప్రాజెక్టులు, ఆదివాసీ ప్రాంతానికి ప్రత్యేక పాలనా మండలి, తీరప్రాంతీయుల అభివృద్ధికి ఫిషింగ్ హార్బర్లూ, కోల్డ్ స్టోరేజీలూ, మార్కెటింగ్ సదుపాయాలూ, వనివసాయ సంబంధ పరిశ్రమలూ, పంటలకు కిట్టుబాటు ధరలు యేవీ నాలుగేళ్లలో అమలు చేసే ఆలోచనలో లేదు ప్రభుత్వం. హామీలకు భిన్నంగా ఉత్తరాంధ్రలోని సహజ వనరుల దొలిచివేతకు పెట్టుబడిదార్ల సదస్సులు, భూ కేటాయింపులూ, భూసేకరణలూ చేసింది! విశాఖనగర సౌందరీనికరణకు పేదల వాడలను మురికివాడలనే పేరుతో తొలగిస్తూ, నగరానికి దూరంగా ఉపాధి అందని ప్రాంతానికి తరుముతోంది. విశాఖను ఆక్రమించిన వలసదారుల ప్రయోజనాలకోసం, కార్పొరేట్ కంపెనీల కోసం ఉత్తరాంధ్రలోని మూడు భిన్న ప్రాంతాలలో అభివృద్ధి ప్రణాళికలు రచిస్తున్నాది ప్రభుత్వం.

ఉత్తరాంధ్రలో జింక్, అల్యూమినియం, ఇనుము,రాగి, ఇత్తడి, కంచు, ఖాదీ వంటి చిన్న చిన్న పరిశ్రమలెన్నో వుండేవి. వేలాదిమందికి ఉపాధినిచ్చేవి. జూట్, సుగర్ కర్మాగారాలు సజావుగా నడిచేవి. దాదాపు గ్రామీణ ప్రాంత నిరుద్యోగాంధ్ర పరిష్కరించే కర్మాగారాలివి. ఇవన్నీ ఇపుడు మూతపడినవి. మూతపడిన చిన్న కర్మాగారాలన్నిట్నీ తెరిపించితే చిన్న పరిశ్రమాధిపతులూ లబ్దిపొందుతారు. పరానివరణ విధ్వంసమూ జరుగదు. స్థానికవనరుల వినియోగమవుతాయి, స్థానికులకు ఉపాధి లభిస్తాయి. స్థానిక సహజ వనరుల సంపదలను కాపాడుకోడానికీ, పరప్రాంతీయుల రాజకీయ, సామాజిక, ఆర్థిక పెత్తనాన్ని తొలగించడానికీ, కార్పొరేట్ కంపెనీల దోపిడీ లక్షని ప్రాజెక్టులను నిరోధించడానికీ ఉత్తరాంధ్ర స్థానిక బహుజనులతో ( భూమి కోల్పోయిన, అడవి కోల్పోయిన, తీరాన్ని కోల్పోయిన జనాలు) ఒక విశాల ఐక్యసంఘటన నిర్మించి పోరాటాలు నడపాల్సిన ఆవశ్యకత ఉండగా ఆ దిశగా ఇక్కడ ప్రయతాశీలు జరగడం లేదు. వామపక్షాలు యెవరికి వారుగా ఆందోళనలూ, ఉద్యమాలూ (అవీ మీడియాలో వచ్చేంతవరకే..! నక్సలైట్లతో సహా)చేస్తున్నారు తప్పా ఐక్యఉద్యమ నిర్మాణ ప్రయతాశీల్లేవు! పాలకవర్గ పార్టీల వారు కృష్ణుడు వేషం వేస్తే కృష్ణుడి పద్యం, దుర్యోధనుడి వేషమేస్తే దుర్యోధనుడి పద్యం పాడుతున్నారు. (అధికారంలో ఉన్నపుడో తీరూ, ప్రతిపక్షంలో ఉన్నపుడింకో తీరు). సరికదా, నాలుగేళ్లుగా అధికారపార్టీ నేతలైతే (విశాఖలో) భూకుంభకోణం, ప్రభుత్వ భూముల ఆక్రమణ, అడవుల నరికివేత, ఇసుకర్యాంపుల తోడివేత, టోల్ గేట్ల దోపిడీ, సారా సిండికేట్, రియల్ ఎస్టేట్ భూ చక్రాలు తిప్పడం వంటి (స్వపక్ష) అభివృద్ధి కార్యక్రమాల్లో తలమునకలై ఉన్నారు.

నవనిర్మాణదీక్ష పేరుతో నవ్యాంధ్రలో అన్ని ప్రభుత్వ సంస్థలనూ, విద్యాలయాలనూ బీజేపీ వ్యతిరేక, రాష్ట్ర ప్రతిపక్ష వ్యతిరేక రాజకీయ కార్యక్రమం చేస్తున్నారు. వేలకోట్ల రూపాయల ఖర్చు చేస్తున్నారు. దినపత్రికల్లో లక్షల రూపాయల ప్రకటనలిస్తున్నారు. ఆ ప్రకటనలో ముఖ్యమంత్రి ప్రకటించిన కార్యక్రమాల్లో అమరావతి నిర్మాణం ఉంది. అనంత, కడప జిల్లాలకు మెగా సోలార్ పార్కులున్నాయి. పదమూడు జిల్లాల్లో ఓవర్‌హెడ్ ట్యాంకులున్నాయి, కూచిపూడి నాట్యారామం ఇలా ఎన్నెన్నో ఆశయాలూ, పథకాలూ ప్రకటించేరు గానీ ఉత్తరాంధ్రకు సంబంధించిన – గిరిజన విశ్వవిద్యాలయం, రైల్వేజోన్, బుందేల్‌ఖండ్ తరహా ప్రత్యేక ప్యాకేజీ, సాగునీటినప్రాజెక్టుల ఊసే నవనిర్మాణదీక్షలో లేదు (సుందర నగరంగా విశాఖను తీర్చిదిద్దడం ఒక్క అంశం తప్పా)

# నాలుగు సంవత్సరాల చంద్రబాబు పాలన

*కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎన్నికలకు ముందు ఇచ్చిన హామీలను నెరవేర్చకుండా ఇప్పుడు ఒకరిపై ఒకరు నెపం మోపుతూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నారని అంటున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

**2018** మే 27,29న విజయవాడలో నిర్వహించిన 'మహానాడు' సందర్భంగా చివరి రోజున ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా, తెలుగుదేశం పార్టీ జాతీయ అధ్యక్షునిగా చంద్రబాబు నాయుడు ఒక ప్రకటన చేశారు. 2019 ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని వచ్చిన కార్యకర్తలను ఈ 2018 సంవత్సరమంతా ఒక ఉక్కు సంకల్పంతో, దీక్షతో, కసితో, కోపంతో, కేంద్ర ప్రభుత్వం అయిన భారతీయ జనతా పార్టీ ప్రభుత్వంపై కక్ష తీర్చుకోవాలని కోరారు. రాష్ట్రంలో మెజారిటీ ప్రజలు తనవైపే ఉన్నారనే బలమైన విశ్వాసం చంద్రబాబు నాయుడులో ఉంది. తాను ఎలాగూ స్వంత సర్వేలు చేయించుకుంటాడు కాబట్టి వచ్చే ఎన్నికలకు కార్యకర్తలను సమాయత్తం చేయడానికి ఆ విధంగా మాట్లాడాడు.

వాస్తవానికి చంద్రబాబు నాయుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఒక విధంగా చెప్పాలంటే కేవలం కొన్ని ప్రాధమ్యాలకు మాత్రమే కట్టుబడి పనిచేస్తున్నాడు. అందులో 1. అమరావతి రాజధాని నిర్మాణం. 2. పోలవరం ప్రాజెక్టు నిర్మాణం. 3. సంక్షేమ పథకాలు - వితంతు, వృద్ధాప్యం, వికలాంగ పించన్లు. 4. హంద్రీనీవా నీటిని పెనుకొండ - హిందూపురం నియోజకవర్గాలకు తరలించడం, గండికోట నుండి అదే హంద్రీనీవా నీటిని పులివెందులకు తరలించడం. 5. క్రిస్మస్, సంక్రాంతి, రంజాన్ కానుకలను ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా పంచడం, ఇలాంటివి మరికొన్ని పథకాలు. ఇదో గొప్ప కార్యక్రమంగా ప్రచారం చేసుకోవడం ఆనవాయితీగా మారింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా చేసిన చంద్రబాబు నాయుడు ఇప్పుడు బాగా బలహీనపడినట్లుగా కనబడుతున్నది. అందుకు అనేక కారణాలు ఉన్నాయి. 2014 ఎన్నికలలో భారతీయ జనతా పార్టీ, జనసేన పార్టీలతో కలిసి పోటీ చేసి, విజయం సాధించిన అనంతరం, ఇటీవల ఆ రెండు పార్టీలు చంద్రబాబు నాయుడుకు దూరమవ్వడం వలన ఏ ముప్పు ముంచుకొస్తుందో ననే భయం ఆయనను వెంటాడుతూ ఉన్నది. వాస్తవానికి నరేంద్రమోడీతో 4 సంవత్సరాలు అంటకాగడమే చంద్రబాబు నాయుడు చేసిన చారిత్రక తప్పు. అన్నింటికన్నా బిజెపి పార్టీతో కలిసి పోటీ చేయడం, కేంద్రంలో టిడిపి, రాష్ట్రంలో బిజెపి వారు మంత్రులుగా కొనసాగినంత కాలం ఒకరికొకరు పొగుడుతూ కాలం గడపడం జరిగిపోయింది. వాస్తవానికి కేంద్రం నుంచి రావలసినన్ని నిధులు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి రాలేదన్నది నూటికి నూరుపాళ్లు వాస్తవం. ఇందుకు బాధ్యత ఇరు పార్టీలది. కేంద్రంలోని భారతీయ జనతా పార్టీ పెద్దలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంపై చిన్న చూపుతోనే, సరైన నిధులు, ఎన్నికలలో ఇచ్చిన హామీల మేరకు కనీసం సగమైనా కూడా ఇవ్వలేదు. దీని ద్వారా కేంద్ర ప్రభుత్వం తన గుత్తాధిపత్యాన్ని రాష్ట్రాలపై చూపడానికి ప్రయత్నించింది. కేంద్రం కూడా ఆంధ్రప్రదేశ్ (అనగా దక్షిణాది రాష్ట్రాలలో) బిజెపి ఏమాత్రం ఎదగక పోవడానికి టిడిపి ఒక కారణమనుకొని ఏదో విధంగా టిడిపిని ఇరకాటంలో పెట్టాలనే ఉద్దేశంతోనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నిధులను సరిగ్గా ఇవ్వడం లేదు. ఇది సుస్పష్టం. ఇది కేంద్ర - రాష్ట్ర సంబంధాలను మరింత చెడగొడుతుందని ప్రచారం జరుగుతున్నప్పటికీ, వాస్తవానికి రాష్ట్రాలు చెల్లిస్తున్న పన్నుల వాటాలలో నుంచే కేంద్రం తన నిధులను రాష్ట్రాలకు ఖచ్చితంగా ఇవ్వవలసిందే. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి మరికొంత ధనాన్ని అందించాలి. నీతి ఆయోగ్ అనుమతితో రాష్ట్రాలకు నిధులు అందజేసే కార్యక్రమం ఉన్నప్పటికీ, నీతి ఆయోగ్ మొత్తం కమిటీ అంతా కేంద్ర ప్రభుత్వం, ప్రధాన మంత్రి కనుసన్నలలో పనిచేస్తుంది కాబట్టి కేంద్ర ప్రభుత్వంలో ఉన్న బిజెపిని వ్యతిరేకిస్తున్న తెలుగుదేశం పార్టీ అధికారంలో ఉన్న ఆంధ్రప్రదేశ్‌కు నిధులు సరిగ్గా రావడం లేదన్నది వాస్తవం. కాబట్టి వచ్చే ఎన్నికలలో బిజెపిని ఓడించాలనే నినాదంతో చంద్రబాబు నాయుడు 'నవ నిర్మాణ దీక్ష'ల పేరు మీద జూన్ నెల 2 - 8 వరకు ప్రతి మండల కేంద్రంలో ఈ వారం రోజులు ఒక్కొక్క అంశంపై చర్చలు, ఉపన్యాసాలు (మొక్కుబడిగా) సాగించాలని పిలుపునిచ్చారు. అందుకు పార్టీ కార్యకర్తల నుంచి మంత్రుల వరకు పాల్గొనేలా, ప్రతిరోజూ ఏదో ఒక జిల్లాలో తానూ పాల్గొంటూ ఒక కార్యక్రమాన్ని రూపొందించుకున్నాడు. దీని ద్వారా కేంద్ర ప్రభుత్వాన్ని ఎండగట్టాలని తన లక్ష్యం. అది ఎంతవరకు సాధ్యపడుతుందో కాలమే నిర్ణయించాలి.

వాస్తవానికి 'పోలవరం ప్రాజెక్టు' పూర్తిగా కేంద్ర ప్రభుత్వమే నిర్మించి ఇస్తామని చెప్పినప్పటికీ, అప్పుడు కేంద్ర మంత్రిగా ఉన్న ప్రస్తుత ఉపరాష్ట్రపతి వెంకయ్యనాయుడు ద్వారా కేంద్ర ప్రభుత్వాన్ని ఒప్పించి, తన మేలు కోరేవారికి, భవిష్యత్తులో తన ఆర్థికావసరాలు తీర్చేవారికి కాంట్రాక్ట్ వచ్చేలా దక్కించుకొని, ఇప్పుడు 55 శాతం పూర్తి చేశాం. మిగతా 45 శాతం నిర్మాణం పూర్తి చేయడానికి నిధులు కేంద్రం ఇవ్వడం లేదంటూ ప్రజలను నమ్మించ చూస్తున్నాడు. అంతేగాక, పోలవరం ఆంధ్రప్రదేశ్ జీవనాడి, 7.20 లక్షల ఎకరాలకు సాగునీరు, 28.5 లక్షల

---

అయినా ఉత్తరాంధ్ర పాలకపార్టీ నాయకులు ఇక్కడ దీక్షను ఘనంగా జరిపించారు.

దాదాపుగా ఎన్నికల వేళ అవుతోంది గనక మళ్లీ అన్ని రాజకీయ పార్టీలూ (పవన్ జనసేనతో సహా) ఉత్తరాంధ్ర వెనుకబాటుపై గళాలెత్తుతున్నాయి. ఓట్ల వేటకు అభివృద్ధి హామీల గీతాలాపన చేస్తున్నాయి. గణతంత్ర కళింగాంధ్ర ఆక్రమించిన అశోకుడి నుంచీ ఆధునిక ఆల్‌ఖైమా వంటి అనేక కార్పొరేట్ కంపెనీలు దాకా సందట్లో సడేమియాగా కళింగాంధ్ర ఆక్రమిస్తున్నాయి. సహజవనరుల సంరక్షణా, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక అస్తిత్వ పోరాటమూ ఉత్తరాంధ్ర వర్తమాన అవసరం! ఆ అవసరం తీర్చే ఆలోచనలకూ, ఆచరణలకూ ఉత్తరాంధ్రులు ఎదురు చూస్తున్నారు.

*(రచయిత కథా, నవల రచయిత)* వీ

మంది ప్రజలకు తాగునీరు, విశాఖ నగరానికి నీటి అవసరాల కోసం 23.44 టిఎంసిల నీరు, 960 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి లక్ష్యంగా పోలవరం ప్రాజెక్టు నిర్మాణం జరుగుతున్నదని ప్రచారం చేస్తున్నాడు. అంతే కాకుండా 2022 సంవత్సరానికంతా దేశంలో 3 అగ్రగామి రాష్ట్రాలలో ఒకటి (తలసరి ఆదాయం 2.95 లక్షల రూపాయలు), 2029 సంవత్సరానికంతా దేశంలోనే అత్యుత్తమ రాష్ట్రం (తలసరి ఆదాయం 9.65 రూపాయలు), 2050 సంవత్సరానికంతా ప్రపంచంలోనే అత్యున్నత ప్రమాణాల రాష్ట్రం (తలసరి ఆదాయం రు. 1.67 కోట్లు) గా ఉండాలనే ఆకాంక్ష, లక్ష్యంతో తాను పనిచేస్తున్నట్లు ప్రచారం చేసుకుంటున్నాడు. వివిధ మాధ్యమాల ద్వారా ప్రజా ధనంతో పత్రికలకు భారీగా ప్రకటనలు విడుదల చేస్తున్నాడు. మొదటి నుంచీ ప్రచార ఆర్భాటాలకు ప్రాధాన్యతనిచ్చే వ్యక్తి కాబట్టి తన అనుకూల మీడియా ద్వారా ఎక్కువగా ప్రచారం నిర్వహిస్తున్నాడు. వాస్తవానికి ప్రచారం జరుగుతున్న దానిలో 30 శాతం అభివృద్ధి కూడా కనిపించడం లేదు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పునర్విభజన చట్టం 2013 ప్రకారం రాష్ట్ర విభజన న్యాయబద్ధంగా జరుగలేదన్నది నిర్వివాదాంశం. అందుకు అప్పటి కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వం కారణం అయినప్పటికీ ఆ తర్వాత వచ్చిన భారతీయ జనతా పార్టీ ప్రభుత్వ బాధ్యతారాహిత్యాన్ని 4 సంవత్సరాలు గడిచిన తర్వాత తప్పంతా బిజెపి మీద వేసి, తన తప్పు ఏమీ లేదన్నట్లు ప్రచారం చేసుకోవడం విచారకరం. ప్రత్యేక హోదా ఇవ్వడం లేదు – ఏ రాష్ట్రానికీ ఇవ్వము అని స్వతహాగా కేంద్ర మంత్రి లోక్‌సభలో ప్రశ్నోత్తరాలలో స్పష్టం చేసినప్పటికీ, చంద్రబాబు నాయుడు ప్రభుత్వం బిజెపితో కొనసాగింది. అంతే కాకుండా ప్రత్యేక హోదాకు బదులుగా ప్రత్యేక ప్యాకేజీ మంచిదని ప్రజలను నమ్మించే ప్రయత్నం చేసింది. ఇది పెద్ద దివాళాకోరు రాజకీయం. చంద్రబాబు నాయుడు తన తప్పులకు వేరేవారు కారణం అంటూ చెప్పకనే చెపుతున్నాడు. అంతేకాక 4 సంవత్సరాలు వేచి చూశాం, ఇప్పుడు తెలుసుకొని బిజెపి నమ్మకద్రోహం చేసింది కాబట్టి నన్నుచూసి జాలిపడి మరో 5 సంవత్సరాలకు అవకాశం ఇవ్వండి అంటూ ప్రజలను నవ నిర్మాణ దీక్షల పేరుతో జూన్ నెల 2 నుంచి 8 వరకు వివిధ అంశాలలో తాను సాధించిన ప్రగతి, భవిష్యత్తు ప్రణాళికలపై చర్చించాలంటూ ప్రజలకు పిలుపునిచ్చాడు. ప్రజలను మరింత భ్రమల్లో ముంచెత్తడం తప్ప మరొకటి కాదు.

అంతేకాక ఎల్లప్పుడూ 'రియల్ టైం గవర్నెన్స్' (వాస్తవ కాల పరిపాలన), డ్యాష్ బోర్డ్, ఎన్‌సిబిఎన్ యాప్ (నారా చంద్రబాబు నాయుడు యాప్) లతో ఎలక్ట్రానిక్ పరికరాలైన కంప్యూటర్‌లు, ట్యాబ్‌లతో కాలం గడిపే ముఖ్యమంత్రి చాలా వాస్తవ విషయాలు మరిచిపోతున్నారు. రాష్ట్ర విభజన అయినప్పటి నుంచి ఇంత వరకు రాష్ట్ర సమాచార హక్కు కమిషన్ ఏర్పాటు చేయలేదు. దానికి సభ్యులను ఏర్పాటు చేయడానికి చాలా కాలం క్రితమే నోటిఫికేషన్ ఇచ్చినప్పటికీ ఇంతవరకు ఏర్పాటు చేయలేకపోయారు. దీని ద్వారా సామాన్య ప్రజలలోను, సమాచార హక్కు చట్టం 2005 ప్రచారం చేసే కార్యకర్తలలోను ఈ ప్రభుత్వంపై నిరసన వ్యక్తం అవుతున్నది.

అంతే కాకుండా రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ ఏర్పడలేదు. ఇది రెండు తెలుగు రాష్ట్రాలకు కలిపి ఒక్కటే హైదరాబాద్ (గృహకల్ప కాంప్లెక్స్ నాంపల్లి)లో ఉన్నప్పటికీ, సభ్య కార్యదర్శి ఐఎఎస్ అధికారి మాత్రమే కొనసాగుతున్నారు. ఇది రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ప్రజలను మభ్యపెడుతున్నారు. అంతే కాకుండా రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఎల్లప్పుడూ '1100' నంబర్‌కు ఫోన్ చేసి ప్రజలు తమ సమస్యలను ప్రభుత్వానికి తెలియజేయండి అంటూ ప్రతి మీటింగ్‌లోనూ చెబుతూ ఉంటాడు. వాస్తవానికి సమస్యను వింటారు కాని దాని పరిష్కారం మాత్రం జరగడం లేదు. అంతే కాకుండా ఎంతో మంది ప్రజలు జిల్లా కలెక్టర్ కార్యాలయాలలో ప్రతి సోమవారం ప్రజా విజ్ఞప్తుల దినంలో ఫిర్యాదు చేస్తూ ముఖ్యమంత్రి కార్యాలయానికి పోస్ట్ ద్వారా పంపిస్తూ ఉంటారు. ఆ తర్వాత సమాచార హక్కు చట్టం 2005 ప్రకారం ఆ సమస్యను ఎంతవరకు పరిష్కరించారో తెలుపమని అడిగితే 'మీ సమస్యను జిల్లా కలెక్టర్ కార్యాలయానికి పంపడం జరిగింది. మీరు వెళ్లి కలెక్టర్ కార్యాలయంలో సంప్రదించండి' అంటూ ఒక రాత మూలక సమాధానం పోస్ట్ ద్వారా పంపుతున్నారు తప్ప ప్రజల సమస్యను ఏమాత్రం పరిష్కరించడం లేదు. అంతే కాకుండా ముఖ్యమంత్రికి ఐఎఎస్/ఐపిఎస్ అధికారులపై వల్లమాలిన ప్రేమ కనబరుస్తుంటాడు. వాస్తవానికి అనేక ప్రజల సమస్యలు వారి ద్వారానే పరిష్కరించబడవలసి ఉన్నా, వారు ప్రజల పట్ల గతంలో కన్నా చాలా నిర్లక్ష్యంగా, ప్రజలంటే చులకన భావం, ఏహ్యాభావం కనబరుస్తున్నారు. ఇది పూర్తిగా వాస్తవం. చట్టాలను గౌరవించాల్సిన అధికారులు, చట్టాలను అమలు చేయాల్సిన అధికారులు అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. అధికారంలో ఉన్న వారిని కీర్తిస్తూ బతుకుతున్నారు, సమయం వెచ్చిస్తున్నారు.

రాష్ట్రం ఒక రకంగా చెప్పాలంటే 'నేరాంధ్రప్రదేశ్'గా మారిపోయింది. మహిళలపై అత్యాచారాలు, పసి పిల్లలపై అత్యాచార దాడులు, ఎస్‌సి/ ఎస్‌టిలపై దాడులు జరగని ప్రదేశం అంటూ లేకుండా పోయింది. పిల్లలతో పాటు కుటుంబ సభ్యులందరూ ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ప్రభుత్వం నుంచి ఒక భరోసా అంటూ లేకుండా పోయింది. మమ్మల్ని ఎవరూ రక్షించలేరు, కాపాడలేరు, ఆత్మహత్యలే శరణ్యం అనే మానసిక రుగ్మతలోకి ప్రజలు నెట్టబడుతున్నారు. సాంఘిక సంక్షేమ శాఖ, మహిళా, శిశు సంక్షేమ శాఖలన్నీ అవినీతి ఊబిలో కూరుకుని ప్రజలను పట్టించుకునే పరిస్థితి లేదు. కేవలం మాధ్యమాలలో వచ్చిన వార్తల ఆధారంగా స్పందిస్తున్నారు తప్ప మానవతా దృక్పథం ఏమాత్రం ఉండడం లేదు. కర్నూలు జిల్లాలో ఒక మహిళా అధికారే కర్నూలు కలెక్టర్ కార్యాలయం నుంచి కిందకు దూకి ఆత్మహత్య చేసుకున్నదంటే పరిస్థితి ఎంత దయనీయంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. చివరకు ఆమె మానసిక స్థితి బాగలేక ఆత్మహత్యకు పాల్పడిందంటూ పై అధికారులే తేల్చేశారు. ఇది విచారణా పద్ధతి. అందులో ఆమెను వేధింపులకు గురిచేసిన అధికారులపై ఏమాత్రం చర్యలు తీసుకోలేదు. పైగా ఆమెదే తప్పుగా నిర్ధారించారు. విధి నిర్వహణలో ఆలస్యం వహించడంతో పై అధికారులు చీవాట్లు పెట్టడంతో బాధతో ఆత్మన్యూనతకులోనై ఆత్మహత్యకు పాల్పడిందంటూ ఉన్నతాధికారులకు నివేదిక సమర్పించారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గ్రామ కార్యదర్శి ఉండే గ్రామ సచివాలయం మొదలు రాష్ట్ర సచివాలయం ఉండే వెలగపూడి వరకు అధికారులంతా అవినీతిలో మునిగి తేలుతున్నారు. అందుకు రుజువు ఇటీవల అవినీతి నిరోధక శాఖకు దొరుకుతున్నవారే. గుంటూరు జిల్లాలో చిన్న బిల్లు కలెక్టర్ ఉద్యోగే వంద కోట్ల ఆస్తి కూడబెట్టాడంటే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు. వాస్తవానికి ఆ ఉద్యోగి కూడా గత 7 సంవత్సరాల క్రితం తన తండ్రి చనిపోతే కారుణ్య నియామకం కింద ఉద్యోగం పొందినవాడు కావడం యాదృచ్ఛికమే అయినప్పటికీ జిల్లా స్థాయి అధికారులు, ఐఎఎస్/ ఐపిఎస్ అధికారుల అవినీతి ఏ స్థాయిలో ఉంటుందో ఊహించుకోవచ్చు. రాష్ట్రంలో జరుగుతున్న అవినీతి గురించి ఎంత చెప్పినా తక్కువే. ముఖ్యమంత్రి కార్యాలయం ద్వారానే సస్పెండైన అవినీతి అధికారులు రక్షించ బడుతూ, తిరిగి ఉద్యోగాలకు అతి తక్కువ కాలంలోనే రాగలుగు తున్నారు. ఈ ఉద్యోగ సంఘాలే ముఖ్యమంత్రికి సలహా ఇచ్చి సమాచార హక్కు కమిషన్ నియామకం జరుగకుండా ఆపాలనే ప్రచారం కూడా జరుగుతున్నది.

2018 జూన్ 2న నవ నిర్మాణ దీక్ష ప్రారంభం రోజున విజయవాడ - బెంజ్ సర్కిల్‌లో ముఖ్యమంత్రి తన ప్రసంగంలోనే బహిరంగంగా ఆంధ్రప్రదేశ్ ఎన్‌జిఒ సంఘం నేత పరుచూరి అశోక్‌బాబును రాజకీయాలలోకి ప్రత్యక్షంగా రమ్మని ఆహ్వానించాడంటే ఆ సంఘానికి ముఖ్యమంత్రితో ఎంత సాన్నిహిత్యం ఉందో అర్థం చేసుకోవచ్చు. తన పార్టీలో చేరమని ముఖ్యమంత్రి చెప్పకనే చెప్పాడంటే భవిష్యత్ ఎన్నికలలో ఉద్యోగులు తనకు అనుకూలంగా పనిచేయాలని ముఖ్యమంత్రి కోరిక కాబోలు. అంతే కాకుండా వారి కోరికలను కూడా ముఖ్యమంత్రి సానుకూలంగా పరిష్కరిస్తున్నాడని ఆ సంఘ నాయకులు కూడా బహిరంగం గానే ముఖ్యమంత్రిని పొగిడారు. ఇది కొన్ని లక్షల మంది ప్రజలు చూస్తూ ఉండగా సాగిన తతంగం. ఈ విధంగా అధికార పార్టీ నేతలు-ఉద్యోగులు మిలాఖత్ అయి, సామాన్య ప్రజలను తమ అవినీతిని పెంపొందించుకోవడానికి పనిముట్లుగా ఉపయోగించు కుంటున్నారు.

సాంఘిక సంక్షేమ హాస్టళ్ల పరిస్థితి ఏమాత్రం మెరుగ్గా లేదు. ఎస్‌సి/ఎస్‌టి ఉప ప్రణాళిక నిధులను సరియైన పద్ధతులలో వినియోగించడం లేదు. గ్రామాలలో నీరు - చెట్టు కార్యక్రమాలకు కూడా ఎస్‌సి/ఎస్‌టి ఉప ప్రణాళిక నిధులు ఖర్చు చేస్తున్నారు. అదేమనగా దళితుల పోలాలకు రహదారి నిర్మాణానికి ఖర్చు చేస్తున్నామని చెబుతున్నారు. సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలల్లో సౌకర్యాలు మెరుగుపడడం లేదు. పాఠశాలల్లో చదువుతున్న విద్యార్థులు తమ శక్తి, సామర్థ్యాలను, తమ స్వంత జ్ఞానాన్ని, తమ కృషిని తాము నమ్ముకుంటున్నారు కాని ప్రభుత్వం వీరిని అన్ని విధాలుగా ప్రోత్సహించడం లేదు. వివిధ రంగాలలో నిపుణులుగా తయారు చేసే ప్రయత్నం కాని లేదా సామాజిక శాస్త్రాలలో వీరిని పరిశోధకులుగా తీర్చిదిద్దే ప్రయత్నం కాని చేయడం లేదు.

ఇక పోలీసు వ్యవస్థ పనితీరు గురించి వేరే చెప్పనక్కరలేదు. మొత్తం ఒకే పార్టీ వైపు ఉండడమే కాకుండా తమ బాధ్యతలు తాము నిర్వర్తించడం లేదు. కేవలం అధికార పార్టీ నాయకుల మెప్పు పొందితే చాలు అన్న రీతిలో వ్యవహరిస్తున్నారు. చంద్రబాబు నాయుడు చెబుతున్నట్లు సమన్యాయ (రూల్ ఆఫ్ లా) అన్నది ఏమాత్రం లేదు. గ్రామీణ ప్రాంతంలోని పోలీస్ స్టేషన్లలో పోలీసులే నిందితుల తరపున వకాల్తా పుచ్చుకొని బాధితులను వేధిస్తూ నయాన్నో, భయాన్నో రాజీలు చేసి పంపిస్తున్నారు. క్రిమినల్ ప్రొసిజర్ కోడ్‌కు కొత్త అర్థాన్ని, కొత్త భాష్యాన్ని ఇస్తున్నారు. సాక్ష్యాలను సేకరించి, తిరిగి వారితో కోర్టులలో సాక్ష్యం చెప్పించడం ఒక అనవసర పనిగా భావిస్తున్నారు. అధిక శ్రమగా భావిస్తున్నారు. పోలీసులు రాజ్యాంగ హక్కులను, రాజ్యాంగ విలువలను అడుగడుగునా కాలరాస్తున్నారు. ప్రజలు పోలీస్ స్టేషన్‌లకు పోవాలంటేనే భయపడే పరిస్థితి నెలకొంది. నిందితుల కన్నా బాధితులే ఎక్కువగా భయాందోళనలకు గురవుతున్నారు. చట్టం - న్యాయం రాను రానూ అందని ద్రాక్షగా మారిపోయింది. ఎటూ దిక్కుతోచక ప్రజలు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. 'ఆత్మహత్యలన్నీ హత్యలతో సమానమే' అంటూ భారత సుప్రీంకోర్టు ఏనాడో వ్యాఖ్యానించింది. ఇటు పోలీసుల పైన గాని, ఆత్మహత్యలకు కారణభూతులైన కుటుంబ సభ్యులపై సరైన చర్యలు గైకొనడం లేదు. ఈ వ్యవస్థలో జరుగుతున్న ప్రధాన లోపం ఇది. 'పోయినవాడు ఎలాగూ పోయాడు, బతికి ఉన్నవాళ్లం మాత్రం సుఖంగా ఉందాం' అనే ధోరణితో నిందితులపై ఉదాసీనత ప్రదర్శిస్తున్నారు. కోర్టులను కూడా ధిక్కరించి, తాము చెప్పినదే వేదం అన్న తీరులో పోలీసు అధికారులు వ్యవహరిస్తున్నారు. దీనిని ప్రజాస్వామిక వాదులంతా తీవ్రంగా గర్హించాలి, ప్రతిఘటించాలి.

అన్నింటికన్నా ముఖ్యంగా చంద్రబాబు నాయుడు ప్రచారం చేసుకుంటున్న విషయం ఏమంటే, రైతులు తనను నమ్మి 35 వేల ఎకరాల భూమిని రాజధాని నిర్మాణం కోసం 'భూ సమీకరణ' కింద ఇచ్చారని పదే పదే బాకా ఊదుతూ చెబుతున్నాడు. వాస్తవానికి ఈ భూములు ఇచ్చినవారు బాగుపడ్డారేమో గాని, భూమిలో పనిచేసే రైతు కూలీలు - హమాలీలు - రోజూ కూలీపని చేసుకునే వారూ జీవన్మరణ సమస్య ఎదుర్కొంటున్నారన్నది పచ్చి నిజం. వీరి గురించి పట్టించుకునే నాదుడే లేడు. అసలు వీరికి ఉపాధి హామీ పథకం వర్తిస్తున్నదా? ప్రభుత్వ అధికారులు అనగా సిఆర్‌డిఎ కమిషనర్ చెరుకూరి శ్రీధర్ వీరి గురించి ఏనాడైనా ఆలోచించారా? ఈ 4 సంవత్సరాలలో వీరికి ప్రత్యామ్నాయ ఏర్పాట్లపై ముఖ్యమంత్రి స్పందనే లేదు. ఇది విచారకరం. రాష్ట్ర ప్రభుత్వ నిర్లక్ష్యానికిది నిదర్శనం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సహజ సంపదైన ఇసుక, మట్టి, ముడి ఇనుము, సున్నపు రాయి, మంగంపేట బైరైటీస్ గనుల నుంచి వచ్చే ఆదాయం అంతా ప్రభుత్వ ఖజానా కన్నా తెలుగుదేశం పార్టీ నాయకుల లేదా వారితో సన్నిహితంగా ఉండేవారి స్వంత అకౌంట్లలో జమవుతున్నదనే మాట వాస్తవం. చాలా చోట్లా ప్రభుత్వ ఉన్నతాధికారులు కూడా వీటిని చూసీ చూడనట్లు వ్యవహరిస్తూ తమకు కొంత వాటా తీసుకుంటున్నారు. ఇటీవల నెల్లూరు జిల్లాలో ఇసుక లారీలు రాత్రిపూట నడుపుతూ, గ్రామాల్లో బయట నిద్రించే వారిపై డ్రైవర్ నిర్లక్ష్యం వలన 14 మంది ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. రెండు కుటుంబాల వారు సామూహికంగా చంపబడ్డారు. ఇలాంటి దారుణాలు ఎన్నో. రాత్రిపూట అక్రమాలకు అడ్డూ అదుపూ లేకుండా పోయింది. రాజమండ్రి ఇసుక రీచ్‌ల అక్రమాలపై, పంట పొలాల నష్టంపై బాధితులు వేసిన రిట్ పిటిషన్ చీఫ్ జస్టిస్ కోర్టులో జరుగుతూ ఉన్నది. ఇటీవల బాధితులు తాత్కాలిక ఉపశమనం పొందారు. రాజమండ్రి ఆర్‌డిఒ, గోదావరి నదికి సంబంధించిన ఇంజనీర్లు రాష్ట్ర హైకోర్టుకు హాజరై వివరణ ఇచ్చినప్పటికీ చీఫ్ జస్టిస్ రమేష్ రంగనాథన్ గారు సంతృప్తి చెందక బహిరంగ కోర్టులోనే ఘాటుగా ప్రభుత్వ పెద్దలను తూర్పార బట్టారు.

రాష్ట్రంలో రోజు రోజుకు మద్యం వ్యాపారం మూడు పువ్వులు - ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నది. చంద్రబాబు నాయుడు ఎన్నికల హామీలో బెల్లు షాపులు నిషేధిస్తానని ప్రకటించినప్పటికీ, గ్రామాలలో విచ్చలవిడిగా మద్యం అమ్మకాలు జరుగుతున్నాయి. రాష్ట్రంలో మహిళలపై అత్యాచారాలు, హత్యలకు ఇది ప్రధాన కారణం అయింది. రాష్ట్రంలో మద్యం దుకాణాలు అధికార, ప్రతిపక్ష పార్టీలు ఇరువురూ భాగస్వాములై నిర్వహిస్తున్నారు. ఆర్థిక వనరులు పొందడంలోనూ, సమీకరణలోనూ రెండు పార్టీలు దొందు దొందులే. దశల వారీగా మద్య నిషేధం పైన కూడా ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేదు. మద్యాన్ని ఆదాయ వనరుగా ప్రభుత్వాలు చూసినంత కాలం ఇదే విధమైన పరిస్థితి కొనసాగుతుంది.

మొత్తం మీద చంద్రబాబు నాయుడు 4 సంవత్సరాల పాలనంతా; గత 10 సంవత్సరాల ప్రతిపక్ష స్థానం నుంచి అధికారం వైపు మళ్లడంతో కేవలం తన పార్టీ కార్యకర్తలకు, నాయకులకు ఆదాయ వనరులు కల్పించడంలోను, తన సామాజిక వర్గాన్ని మరింత ఆర్థికంగా బలం చేకూర్చే పనులు తప్ప సామాన్య ప్రజలకు ఒరిగిందేమీ లేదు. ఒక్క ఫించన్‌లలో మాత్రమే తాను విజయం సాధించినట్లుంది తప్ప, మిగతా అన్ని సంక్షేమ పథకాలలో విఫలం చెందాడు. ఆయన పాలనకు 35 శాతం మార్కులు కూడా ఇవ్వడం కష్టమే.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

# ప్రభుత్వ కార్యాలయాలా? పార్టీ కార్యాలయాలా?

***చంద్రబాబు ప్రపంచబ్యాంకు అభివృద్ధి నమూనాతో వనరులను కార్పొరేట్ సంస్థలకు, అగ్రకులాలకు కట్టబెడుతూ, దళితుల భూములను గుంజుకొని వారికి నిలువ నీడ లేకుండా చేస్తున్నాడని అంటున్నారు* దుడ్డు ప్రభాకర్**

**1991**లో మనదేశంలోకి నూతన ఆర్థిక విధానాలు ప్రవేశించి నప్పటి నుండి ప్రభుత్వ రంగ సంస్థలు ప్రైవేట్ వ్యక్తులకు అప్పగించ బడ్డాయి. తద్వారా కుటీర పరిశ్రమలు, చేతివృత్తులు ధ్వంసమై కార్మికులు, కర్షకులు అడ్డా కూలీలుగా మారారు. కల్తీ మందులు, నకిలీ విత్తనాలతో పాటు పండించిన పంటకు గిట్టుబాటు ధర లేకపోవడంతో రైతులు అప్పుల పాలై ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. నేషనల్ క్రైం రికార్డ్ బ్యూరో నివేదిక ప్రకారం 1991 నుండి 2013 వరకు దేశవ్యాపితంగా రెండు లక్షల ఎనభై నాలుగు వేల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. రైతుకూలీల ఆకలిచావులు, అనారోగ్య మరణాలు ప్రభుత్వ రికార్డుల్లో లేనే లేవు. ఈ నేపథ్యంలో 2014లో జరిగిన సాధారణ ఎన్నికల్లో ప్రజలకు అనేక అమలుకు వీలులేని వాగ్దానాలు చేసి బొటాబొటి మెజారిటీలో పదేళ్ల తర్వాత కమ్మ కులాధిపత్య పార్టీ అయిన టిడిపి మళ్లీ అధికారంలోకొచ్చింది. నారా చంద్రబాబునాయుడు ముఖ్యమంత్రి అయ్యారు. అప్పటిదాకా నామమాత్రంగానైనా ఉనికిలో ఉన్న రెవెన్యూ, రక్షణ, అభివృద్ధి, సంక్షేమ, పరిపాలనారంగ సంస్థలను నిర్జీవం చేస్తూ తమ సామాజిక వర్గానికి చెందిన కార్యకర్తలకు అధికారాలిస్తూ గ్రామస్థాయిలో జన్మభూమి కమిటీలను ఏర్పాటు చేశారు. జన్మభూమి కమిటీల ద్వారా క్షేత్ర స్థాయిలో పార్టీ నిర్మాణాన్ని బలోపేతం చేసుకొని అధికారాన్ని శాశ్వతంగా పదిలం చేసుకొనే ప్రయత్నాలు ఈ నాలుగేళ్లలో వేగంగా అమలు జరిపారు.

హైటెక్ సిటీని నిర్మించి హైదరాబాద్‌కు అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చానని భుజాలు చరుచుకుంటున్న చంద్రబాబు 'పారిశ్రామిక అభివృద్ధి తోనే రాష్ట్ర ప్రజల అభివృద్ధి' అనే పలవరింతలు మానుకోలేదు. పిడికెడు మంది కుబేరుల సంపదను వేల కోట్లకు పెంచి కోట్లాది మంది ప్రజలను బిచ్చగాళ్లుగా మార్చే ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాతో ఈ దేశ ప్రజల బతుకులు ఏ విధంగా ధ్వంసం చేయబడుతున్నాయో 1991 నుండి ప్రత్యక్షంగా అనుభవిస్తున్న ప్రజలు పాలకులు చెబుతున్న అభివృద్ధి నమూనాను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఆ విషయం అందరి కంటె ప్రపంచ బ్యాంకు సి.ఇ.ఓ. అని ప్రకటించుకున్న చంద్రబాబు నాయుడికి ఇంకా బాగా తెలుసు. అందుకే ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చెయ్యబోయే కొన్ని గంటల ముందు నల్లమల అటవీ ప్రాంతంలో సాధారణ జీవితం గడుపుతున్న ముగ్గురు గిరిజనులను మావోయిస్టుల పేరుతో కాల్చిచంపి నక్సలైట్లను తుడిచిపెట్టాను అని ప్రకటించుకున్నారు. మరికొద్ది రోజులకే చిత్తూరు జిల్లా శేషాచలం అడవుల్లో 20 మంది కూలీలను కాల్చి చంపి ఎర్రచందనం దొంగలుగా ప్రచారం చేశారు. ఈ రెండు సంఘటనల ద్వారా సామ్రాజ్యవాదుల పెట్టుబడులు, ఆస్తుల రక్షణ కోసం ఎంత రక్తపాతాన్నైనా సృష్టిస్తాననే సంకేతాన్ని సామ్రాజ్యవాదు లకు సవినయంగా విజ్ఞప్తి చేసుకున్నారు. సుమారు వెయ్యి కిలోమీటర్ల పొడవైన సముద్రతీర ప్రాంతాన్ని, విస్తారమైన అడవుల్లో నిక్షిప్తమైవున్న ఖనిజ సంపద సహజ వనరులను గత ప్రభుత్వాలు దోచిపెట్టగా మిగిలిన దాన్ని విదేశీ పెట్టుబడిదారులకు ధారాదత్తం చెయ్యడానికి ఈ నాలుగేళ్లలో చంద్రబాబు నాయుడు, ఆయన మంత్రివర్గ సహచరులు 22 సార్లు విదేశీ పర్యటనలు చేశారు. రాష్ట్రంలో 15 లక్షల ఎకరాలతో భూబ్యాంక్ పరిశ్రమల కోసమే ఏర్పాటు చేస్తున్నామని ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు స్థాపించాలనుకొనే వారికి కేవలం 21 రోజుల్లోనే సింగిల్ డెస్క్ విధానం ద్వారా అన్ని అనుమతులు మంజూరు చేస్తామని అనేక రాయితీలు ప్రకటించి రాష్ట్రాన్ని బహుళజాతి కంపెనీలకు అడ్డాగా, రాష్ట్ర ప్రజల్ని అడ్డా కూలీలుగా మార్చే ప్రయత్నం సీరియస్‌గానే చేశారు.

**రాష్ట్ర రాజధానిని కమ్మనాడుగా తీర్చిదిద్దే ప్రయత్నం**

రాజధాని నిర్మాణ ప్రాంత నిర్ధారణ కోసం అప్పటి యుపిఏ ప్రభుత్వం ఏర్పాటు చేసిన 5 మంది సభ్యులతో కూడిన శివరామకృష్ణన్ కమిటీ జిల్లాల పర్యటనలో ఉన్నపుడు తెలుగుదేశం పార్టీ నాయకులు 'రాయలసీమ, దక్షిణ కోస్తా, ఉత్తరాంధ్ర ప్రాంతాలు సమానంగా అభివృద్ధి చెందే విధంగా నవ్యాంధ్ర రాజధాని నిర్మాణం జరగబోతుంద'ని ప్రజల నుండి విరాళాలు సేకరించారు. శివరామకృష్ణన్ కమిటీ 13 జిల్లాలు పర్యటించి ప్రజలు, అధికారులు, నిపుణుల అభిప్రాయాలను సేకరించి 187 పేజీలతో నివేదికను 2014, ఆగస్టు 31న కేంద్ర హోం మంత్రి రాజ్‌నాథ్‌సింగ్‌కి సమర్పించింది. ఆ నివేదికలో చాలా స్పష్టంగా గుంటూరు-విజయవాడ మధ్యన రాజధాని ఏర్పాటు చెయ్యడం మంచిది కాదని తేల్చిచెప్పింది. ఆ ప్రాంతంలో సంవత్సరం పొడవునా పంటలు పండే భూములున్నాయని, అదీగాక అక్కడి భూమి స్వభావం భారీ కట్టడాలకు అనుకూలం కాదని తేల్చి చెప్పింది. ప్రభుత్వ భూముల్లోనే రాజధాని ఏర్పాటు చెయ్యడం మంచిదని, వ్యవసాయ భూమిలో రాజధాని కట్టడం ద్వారా భవిష్యత్‌లో ఆ ప్రాంతంలోనే గాక రాష్ట్రంలో ఆహార కొరత ఏర్పడే ప్రమాదముందని సలహా ఇచ్చింది. హైదరాబాద్ తరహాలో అన్ని కార్యాలయాలు ఒకేచోట కాకుండా వికేంద్రీకరణ అవసరమని సూచించింది. రాజధాని నిర్మాణం కోసం పది వేల ఎకరాల భూమి అవసరమని కమిటీ నిర్ధారించింది.

శివరామకృష్ణన్ కమిటీ రిపోర్ట్‌ను తుంగలో తొక్కి రాజధాని నిర్మాణం,

అభివృద్ధిని గుంటూరు-కృష్ణా జిల్లాలకే పరిమితం చేశారు. తర్వాత రాజధాని నగర పరిధిని 122 చదరపు కిలోమీటర్లుగా రాజధాని ప్రాంత పరిధిని 7068 చ.కి మీటర్లుగా విస్తరింపజేశారు. అందుకుగాను ప్రజల నుండి 70 వేల ఎకరాలకు పైగా భూముల్లో భూసమీకరణ ద్వారా లాక్కొని ప్రస్తుతం విదేశీయులతో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నారు. రాజధానిని ఆ రెండు జిల్లాలకే పరిమితం చెయ్యడానికి చంద్రబాబుకి అనేక సామాజిక, ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలున్నాయి. ఆ రెండు జిల్లాల్లో కమ్మ సామాజిక వర్గానికి చెందిన ధనిక రైతులు, భూస్వాములు, వ్యాపార, పారిశ్రామిక వర్గాలు, రాజకీయ నాయకులు, విద్యా వ్యాపారులు మెజారిటీగా ఉన్నారు. వీరంతా తెలుగుదేశం పార్టీ నాయకులై ఉన్నారు. కుల సమీకరణకే కేంద్రంగా రాజకీయాలు వర్ధిల్లుతున్న నేటి స్థితిలో ఆంధ్రప్రదేశ్‌లో తిరుగులేని సామాజిక ఆధిపత్యాన్ని నిలబెట్టుకుంటూ శాశ్వత రాజకీయాధికారాన్ని పదిలపరచుకొనడం కోసమే చంద్రబాబు నాయుడు ఆ రెండు జిల్లాలపై దృష్టి కేంద్రీకరించారు. అందులో బాగంగానే ప్రభుత్వ కార్యాలయాలు, రోడ్ల నిర్మాణాలు కమ్మేతర, తెలుగుదేశమేతర, ఎస్‌సి, ఎస్‌టి, బిసి కులాల ప్రజల స్థలాలలోనే నిర్మాణమవుతూ తెలుగు తమ్ముళ్ల భూముల విలువ వందల రెట్లు పెరిగే విధంగా పథకాలు అమలౌతున్నాయి.

ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాల దోపిడీ తీవ్రతరమౌతున్న ప్రస్తుత దశలో ప్రజావ్యతిరేక ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలపై లాఠీలు, తూటాలు ప్రయోగించడం, ప్రభుత్వాలకు వ్యతిరేకంగా మాట్లాడిన ప్రజా సంఘాల నాయకులపై తప్పుడు కేసులు పెట్టి జైళ్లలో కుక్కడం ప్రభుత్వాలు ఒక మార్గంగా ఎన్నుకున్నాయి. మరోవైపు పీడిత ప్రజల మధ్య కుల, మత విద్వేషాలు రెచ్చగొట్టడంతో పాటు అనేక చిన్న చిన్న సంక్షేమ పథకాలు అమలు చేస్తున్నట్లు వేలకోట్ల రూపాయలు ఖర్చు పెట్టి ప్రచారం చేసుకుంటూ ప్రజల్ని మభ్యపెట్టడంలాంటి కార్యక్రమాలు అమలు చేస్తున్నాయి. పై అన్ని కార్యక్రమాలు ఈ నాలుగేళ్లలో చంద్రబాబు ప్రభుత్వం సమర్థవంతంగానే అమలు చేసిందని చెప్పుకోవాలి. గత ప్రభుత్వాలు అమలు చేసిన పథకాలనే పేరు మార్చి చంద్రబాబు ప్రభుత్వం కొత్తగా అమలు చేస్తున్నట్లు ప్రచారం చేసుకుంటుంది.

ఎన్‌టిఆర్ భరోసా పెన్షన్ పథకం నుండి పక్కా గృహ నిర్మాణం, అన్నా క్యాంటీన్‌లు, చంద్రన్న తోఫా, చంద్రన్న క్రిస్మస్, చంద్రన్న సంక్రాంతి, బడి పిలుస్తోంది, నీరు చెట్టు, ఎల్.ఇ.డి. బల్బులు, చంద్రన్న పెళ్లి కానుక దాకా మొత్తం 111 రకాల సంక్షేమ పథకాలు అమలు చేస్తున్నట్లు ప్రభుత్వం ప్రచారం చేసుకుంటుంది. 2014 ఎన్నికల సమయంలో అంతకుముందు అధికారం కోసం పాదయాత్ర పేరుతో ప్రజల దగ్గరకెళ్లి ఇచ్చిన రైతు ఋణవిముక్తి, డ్వాక్రా మహిళల ఋణ మాఫీ, ఇంటికో ఉద్యోగం అప్పటిదాకా 2000 నిరుద్యోగ భృతి, రైతుకు గిట్టుబాటు ధర, కాపులను బిసిలుగా గుర్తించడం ఎస్‌సి వర్గీకరణకు కట్టుబడి ఉండడం లాంటి సుమారు 500 హామీలను గాలికొదిలి అన్న క్యాంటిన్ దగ్గర నుండి చంద్రన్న సంచార చికిత్స దాకా ప్రతి చిన్న పనికి తన పేరు మీన్నో, తన మామ పేరుమీదనో పేరు పెట్టి ప్రచారం చేసుకుంటున్నారు.

**అవినీతి, దోపిడీ వికేంద్రీకరణ**

పరిశ్రమల స్థాపన పేరుతో ప్రజల నుండి సేకరించిన భూమిని ముఖ్యమంత్రి, మంత్రివర్గ సహచరులు బహుళజాతి కంపెనీలకు అమ్ముకుంటుంటే ఎంఎల్ఏలు వాగుల్లో ఇసుకను, చెరువుల్లో మట్టిని అమ్ముకొని కోట్లు గడిస్తున్నారు. ప్రభుత్వం అమలు చేస్తుందని చెప్పుకుంటున్న 111 సంక్షేమ పథకాలు అమలు బాధ్యత మండల, గ్రామ స్థాయి కార్యకర్తల పర్యవేక్షణలో అమలౌతున్నాయి. మండల స్థాయి రెవెన్యూ, అభివృద్ధి, రక్షణ, కార్యాలయాలు, బ్యాంకులు, వివిధ కులాల సంక్షేమ కార్యాలయాలు, సహకార సంస్థలు, హౌసింగ్ బోర్డులు, ఎస్‌పి, కలెక్టర్ కార్యాలయాలు తెలుగుదేశం పార్టీ గ్రామ, జిల్లా స్థాయి కార్యాలయాలుగా మారాయి. చట్టబద్ధంగా, రాజ్యాంగానికి కట్టుబడి, ప్రజాస్వామికంగా విధులు నిర్వహించవలసిన ప్రభుత్వ కార్యాలయాలు జన్మభూమి కమిటీలలోని సభ్యుల ఆదేశాలను పాటిస్తూ ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తున్నాయి. రేషన్ కార్డుల మంజూరు మొదలుకొని ఎన్‌టిఆర్ గృహనిర్మాణం వరకు ముడుపులు ముట్టచెప్పనిదే జన్మభూమి కమిటీలు ఆమోదం తెలుపవు. జన్మభూమి కమిటీల ఆమోదం లేకుండా అధికారులు అడుగు ముందుకేసే పరిస్థితి లేదు. దొంగలు దొంగలు కలసి ఊర్లు పంచుకున్నట్లు జన్మభూమి కమిటీ సభ్యులు, ప్రభుత్వోద్యోగులు ప్రజలన్ని జలగల్లా పీల్చి పిప్పి చేస్తున్నారు. అవినీతి నిరోధకశాఖ దాడుల్లో గ్రామస్థాయి అధికారి (విఆర్ఓ) దగ్గర 35, 40 కోట్ల రూపాయల అక్రమ ఆస్తులు బయట పడుతున్నాయంటే అవినీతి ఎంతగా వికేంద్రీకరించబడిందో అర్థం చేసుకోవచ్చు. జన్మభూమి కమిటీల సూచనలు పాటించని అధికారులపై వేధింపులు, బదిలీలు, దాడులు కూడా చేస్తున్నారు. కృష్ణా జిల్లాలో వనజాక్షి అనే మహిళా తహసీల్దారుపై టిడిపి ఎంఎల్ఏ చింతమనేని ప్రభాకర్ దాడి పచ్చ తమ్ముళ్ల విచ్చలవిడి దౌర్జన్యాలకు పరాకాష్ట. ఆ దాడిని ఖండించి ఎంఎల్ఏను సస్పెండ్ చెయ్యాల్సిన ముఖ్యమంత్రి తహసీల్దార్‌ను బెదిరించి కేసు రాజీ చెయ్యడం కొసమెరుపు.

**పాలకుల అభివృద్ధి - పీడితుల నిర్వాసితత్వం**

నాలుగేళ్ల తెలుగుదేశం పాలనలో ఎస్‌సి, ఎస్‌టిలపై దాడులు, అత్యాచారాలు, భూకబ్జాలు విపరీతంగా పెరిగాయి. నవ్యాంధ్ర రాజధాని నిర్మాణం, పారిశ్రామిక అభివృద్ధి, పట్టణ సుందరీకరణ పేరుతో దోపిడీ, పీడన అణచివేతలకు మొదటిగా బలవుతుంది ఎస్‌సి, ఎస్‌టి ప్రజలే. పట్టణ సుందరీకరణ పేరుతో రాష్ట్రంలోని పట్టణాల శివారు ప్రాంతంలో ఉన్న డంపింగ్ యార్డులు, చెరువు గట్ల మీద రెండుమూడు తరాల నుండి గుడిసెలు వేసుకొని జీవిస్తున్న యానాదుల ఇళ్లను కూల్చి వారిని నిరాశ్రయులను చేస్తున్నారు. సింగపూర్ తరహా రాజధాని నిర్మాణం పేరుతో రైతుల నుండి వేలాది ఎకరాల భూముల్ని లాక్కొని వ్యవసాయ కూలీలైన దళితుల్ని కూలికి, కూటికి దూరం చేశారు. నీరు - చెట్టు, చెరువుల అభివృద్ధి, పారిశ్రామిక కారిడార్ పేరుతో బంజరు భూముల్ని, అసైన్డ్ భూములు, బీడు భూములు సాగు చేసుకుంటూ పొట్ట పోసుకునే ఎస్‌సి, ఎస్‌టి, బిసి లను, సముద్రతీర ప్రాంత ప్రజలను భూమికి దూరం చేశారు. విచిత్రమేమంటే ఏ అభివృద్ధి కార్యక్రమానికైనా తెలుగుదేశం ప్రభుత్వానికి దళితులు, పీడిత కులాల భూములే కనపడుతుంటాయి.

వారి భూముల్లో నిర్మాణాలు చేసి పక్కనున్న అగ్రకుల భూముల రేట్లు పెంచడమే ప్రభుత్వ నీతి.

**తెలుగు తమ్ముళ్ల వెలుగులు – సమిధలౌతున్న దళితులు**

ప్రకాశం జిల్లా పర్చూరు మండలం దేవరపల్లి గ్రామంలో 1977 మంది దళితులు సాగు చేసుకుంటున్న 42 ఎకరాల భూమిలో 20 ఎకరాలను గతంలో కమ్మకులాధిపత్య శక్తులు దౌర్జన్యంగా ఆక్రమించుకున్నాయి. మిగిలిన 20 ఎకరాలలో చెరువు తవ్వాలని జన్మభూమి కమిటీ తీర్మానం చేసింది. ప్రొక్లైన్లు చెరువు కట్టలు నిర్మిస్తుంటే దళితులు ప్రతిఘటించి అడ్డుకున్నారు. గుంటూరు జిల్లా రొంపిచెర్ల మండలం గుడిపాడు గ్రామంలో గత 50 ఏళ్లుగా 200 కుటుంబాలకు చెందిన ఎస్‌సిలు, బిసిలు 100 ఎకరాల భూమిని సాగుచేసుకుంటూ బతుకుతున్నారు. ఆ భూమిని జన్మభూమి కమిటీ తీర్మానం మేరకు చెరువుగా మార్చారు. విశాఖ జిల్లా పెందుర్తి మండలం జెర్రిపోతుల పాలెంలోని దళితుల భూమిలో స్థానిక ఎంఎల్ఏ బండారు అప్పలనాయుడు ఆధ్వర్యంలో జన్మభూమి కమిటీ ఎన్‌టిఆర్ గృహ కల్ప పేరుతో తెలుగు తమ్ముళ్లకు ఇళ్లు కట్టించే ప్రయత్నం చేసింది. ఆ కార్యక్రమాన్ని అడ్డుకున్న దళితులపై దాడి చేశారు. దళిత మహిళను వివస్త్రను చేసి విచక్షణా రహితంగా కొట్టారు. గుంటూరు జిల్లా చిలకలూరిపేట మండలం యడవల్లి గ్రామం గత రెండు తరాల నుండి సాగు చేసుకొని జీవిస్తున్న 416 ఎకరాల ఎస్‌సిల సొసైటీ భూముల్ని స్థానిక మంత్రి పత్తిపాటి పుల్లారావు అనుచరులు దౌర్జన్యంగా ఆక్రమించే ప్రయత్నం చేయగా దిక్కుతోచని స్థితిలో దళితులు కోర్టును ఆశ్రయించారు. ప్రకాశం జిల్లా చీరాల మండలం గవినివారిపాలెంలోని ఎరుకల మహిళ దేవసుబ్బులు 70 ఏళ్ల నుండి రెండున్నర ఎకరాల భూమిని సాగుచేసుకుంటూ బతుకుతుంది. ఆ భూమికి స్థానిక ఎంఎల్ఏ ఆమంచి కృష్ణమోహన్ అనుచరుడు దొంగ పట్టాలను పుట్టించుకొని ఆక్రమించుకొనడానికి ప్రయత్నించాడు. ఆ విషయాన్ని ఆమె జిల్లా పోలీసు, రెవెన్యూ అధికారులకు చెప్పుకున్నా పట్టించుకోలేదు. నిరాహారదీక్ష చేసింది. అయినా ఫలితం లేదు. గత్యంతరం లేని స్థితిలో ఒంగోలు కలెక్టర్ కార్యాలయం ఎదుట ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. చివరకు కబ్జాదారుల చేతిలో ఆమె ఇంట్లోనే హత్యకు గురై చీరాల ఆసుపత్రిలో మృత్యువుతో పోరాడి తుది శ్వాస విడిచింది. ఆమె శవాన్ని కూడా ఆ భూమిలో పూడ్చకుండా వందలాది మంది పోలీసులు అడ్డుకున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా, తాడేపల్లిగూడెం మండలం కుంచనపల్లి గ్రామంలో దళితులు 50 ఏళ్ల నుండి సాగు చేసుకుంటున్న 40 ఎకరాల భూమిని జన్మభూమి కమిటీ తీర్మానం మేరకు చెరువులో కలిపేశారు. తూర్పు గోదావరి జిల్లా రాజానగరం మండలం పాత తుంగపాడు గ్రామంలోని అరెకరం భూమిని యడ్ల చిన్న అనే దళితుడు వాళ్ల తాతల కాలం నుండి సాగు చేసుకుంటున్నారు. జన్మభూమి కమిటీ తీర్మానం మేరకు ఆ భూమిని డంపింగ్ యార్డ్‌కు కేటాయించారు. ప్రొక్లెయిన్‌ల సహాయంతో ఆ అరెకరంలో పెద్ద గొయ్యి తవ్వించారు. న్యాయం చెయ్యాలని 'చిన్న' అధికారుల చుట్టూ తిరిగినా ఫలితం దక్కలేదు. చివరకు గ్రామస్తులందరూ చూస్తుండగా చిన్న పురుగుల మందు తాగి ఆ గుంతలోనే గిలగిలా కొట్టుకొని చనిపోయాడు. నెల్లూరు జిల్లా మండల కేంద్రమైన దగదర్తిలో చెరువుల మరమ్మత్తు పేరుతో దళితులు సాగుచేసుకుంటున్న భూమిలోని వరిపంటను జన్మభూమి కమిటీ ధ్వంసం చేసింది. దగదర్తి మండలం చెన్నూరు గ్రామ చెరువులోని ముంపుకు గురికాని ఎగువ ప్రాంత భూముల్ని గత 40 ఏళ్లుగా దళితులు, బిసిలు సాగుచేసుకుంటున్నారు. జన్మభూమి కమిటీ వారిపై దౌర్జన్యం చేసి మారణాయుధాలతో దాడి చేసి ఆ భూముల్నుండి తరిమేశారు. పై సంఘటనలు జన్మభూమి కమిటీల పేరుతో పచ్చ చొక్కాగాళ్లు చేస్తున్న చట్టబద్ధమైన దౌర్జన్యాలకు చిన్న ఉదాహరణలు మాత్రమే. ఇవిగాక ఎస్‌సి, ఎస్‌టి లను వ్యక్తులుగా, కుటుంబాలుగా టార్గెట్ చేసి అధికార మదంతో అగ్ర కులాధిపత్య శక్తులు చేస్తున్న అత్యాచారాలకు, భూకబ్జాలకు అంతే లేదు. ఎస్‌సి, ఎస్‌టి రాష్ట్ర, జాతీయ కమిషన్లు పాలక వర్గాలకు కొమ్ముగాస్తూ పదవులు కాపాడుకొంటున్నాయి కానీ దళితుల మొర ఆలకించడం లేదు.

**రచ్చబండ తీర్పులు**

గతంలో ఎస్‌సి, ఎస్‌టిలపై దాడులు, దౌర్జన్యాలు జరిగినప్పుడు స్టేషన్‌లో రిపోర్టు చేస్తే అగ్రకుల అధికార పక్షానికి కొమ్ముకాసే పోలీసులు నిందితులపై కేసులు రిజిస్టర్ చేసేవారు కాదు. తప్పనిసరి పరిస్థితుల్లో రిజిస్టర్ చేయవలసి వస్తే దళితులపై కూడా కౌంటర్ కేసులు పెట్టి స్టేషన్‌లోనే రాజీ చేసేవారు. కొన్ని సందర్భాలలో ఉద్యమాల ద్వారా పెట్టించిన కేసులు కూడా కోర్టుల్లో వీగిపోయేవి. అతికొద్ది కేసుల్లో మాత్రమే నిందితులకు శిక్షలు పడ్డాయి. పై అన్ని దశల్లో పాలకులు నిర్లక్ష్యంగా తమ అగ్రకుల పక్షపాతాన్ని చాటుకునేవారు. కానీ, చంద్రబాబు పాలనలో దళితులపై దాడి జరిగిన ప్రతి సందర్భంలో పాలకులు నిందితుల తరపున ప్రత్యక్షంగా పాల్గొంటున్నారు. తెలుగుదేశంలోని దళిత నాయకులు బాధితులైన దళితుల దగ్గరకు చేరి వారిని బుజ్జగించి, బెదిరించి, ప్రలోభపెట్టి రాజీలు చేస్తున్నారు. పోలీసులు, కోర్టులు అన్నీ తామై ప్రాచీన కాలపు రచ్చబండ తీర్పులు ప్రకటిస్తూ దళిత ఉద్యమాలకు తీలోదకాలిస్తున్నారు...... దళిత ఆత్మగౌరవ ప్రతిఘటనా పోరాట చైతన్యాన్ని నిరుగారుస్తున్నారు. అందుకు పశ్చిమగోదావరి జిల్లా గరగపర్రు, గుంటూరు జిల్లా పెదగొట్టిపాడు సంఘటనలు ప్రత్యక్ష ఉదాహరణలుగా మనముందున్నాయి.

**పోరాడే ప్రజల్ని చీల్చే కుట్ర**

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నేపథ్యంలో పారిశ్రామికాభివృద్ధి జపంతో జరుగుతున్న విధ్వంసంలో కేవలం దళితులు మాత్రమే సమిధలవ్వడం లేదు. విద్యార్థులు, ఉద్యోగులు, నిరుద్యోగులు, రైతులు, రైతుకూలీ, చేనేత కార్మికులు, మత్స్యకారులు, వివిధ వృతి కులాల ప్రజలు భూములు, ఉద్యోగాలు, నివాసాలు, జీవనోపాధి కోల్పోయి పూట గడవడం కష్టంగా బతుకుతున్నారు. పండగ పూట బిడ్డలకు పిడికెడు మెతుకులు పెట్టుకోలేని దయనీయ పరిస్థితుల్లో ప్రజలు జీవిస్తున్నారు. ఈ దుస్థితికి కారణమైన ప్రభుత్వమే చంద్రన్న కానుక పేరుతో పప్పులు, బెల్లాలు, పంపిణీ చేస్తూ ప్రజల్ని ఉద్ధరిస్తున్నట్లు ప్రచారం చేసుకుంటుంది. 2019లో మళ్లీ అధికారం దక్కించుకోవడానికి చంద్రబాబు నాయుడు అనేక వ్యూహాలతో ప్రజల ముందుకొస్తున్నారు. ఆర్థికంగా అభివృద్ధి చెందిన కొద్ది మందికి రాజకీయంగా అవకాశం కల్పించి వారి అభివృద్ధే ఆయా కులాల అభివృద్ధిగా ప్రచారం చేస్తున్నారు. ఆయా కుల నాయకుల

# కేశవరావు జాదవ్



అధ్యాపకుడు, సోషలిస్టు, పౌరహక్కుల ఉద్యమకారుడు, తెలంగాణ ఉద్యమకారుడు, పత్రికా సంపాదకుడు, జాదవ్ సాబ్ గా చిరపరిచితులైన ప్రొ. కేశవరావు జాదవ్ (1933-2018) మరణంతో తెలంగాణలో, హైదరాబాద్‌లో ప్రజా ఉద్యమచరిత్రలో ఒక శకం ముగిసింది. కొద్దికాలంగా అనారోగ్యంతో ఉన్న జాదవ్ సాబ్ శ్వాసకోశ సంబంధమైన సమస్యలతో ఆస్పత్రిలో చేరి జూన్ 16 ఉదయం మరణించారు. హైదరాబాద్‌లోని హుస్సేనీ ఆలంలో 1933లో పుట్టిన జాదవ్ సాబ్ ఆర్యసమాజ్‌తో సామాజిక జీవితం ప్రారంభించి ఆ తర్వాత రామమనోహర్ లోహియా ప్రభావంలో సోషలిస్టుగా మారి, ఆరు దశాబ్దాలకు పైగా సోషలిస్టుగా ఉన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఇంగ్లిష్ అధ్యాపకుడిగా పనిచేస్తూనే రాష్ట్రంలోని అనేక ప్రజా ఉద్యమాలలో భాగం పంచుకున్నారు. ఇంగ్లిష్ అధ్యాపకుడుగా ఉన్నారనే విషయమే ఎవరికీ తెలియనంతగా ఉర్దూ, హిందీ, తెలుగుల్లో ఉపన్యాసాలు ఇచ్చేవారు. విద్యార్థిగా ఉండగా 1952 ముల్కీ ఉద్యమం రోజుల నుంచీ తెలంగాణ ఆకాంక్షలతో కొనసాగిన ఆయన, 1969 జై తెలంగాణ ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొని, దాదాపు ఇరవై సార్లు జైలు నిర్బంధాన్ని అనుభవించారు. తన మేధో కృషితో తెలంగాణ ఉద్యమాన్ని కొడిగట్టిపోకుండా కాపాడుతూ వచ్చారు. మళ్లీ 1990ల మధ్య కాలంలో ఉద్యమ విస్తరణ ప్రారంభమైనప్పటినుంచి మరణించేదాకా ప్రజాస్వామిక, ప్రజా తెలంగాణ కోసం ఎన్నో రూపాలలో పని చేశారు. ఆ ప్రభుత్వ వ్యతిరేక, వ్యవస్థా వ్యతిరేక ఆచరణ వల్ల ఎమర్జెన్సీలో కూడ జైలుపాలయ్యారు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో రాజ్యహింస పెచ్చరిల్లుతున్న నేపథ్యంలో పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్) కార్యకర్తగా, నాయకుడిగా విశేష కృషి చేశారు. ప్రభుత్వానికి విప్లవపార్టీలకు మధ్య జరిగిన చర్చలలో జాదవ్ సాబ్ సిపిఐ ఎంఎల్ జనశక్తి తరఫున ప్రతినిధిగా పాల్గొన్నారు. హైదరాబాద్లో మతకల్లోలాలు జరిగినప్పుడల్లా బాధితులకు సహాయం అందించే మొట్టమొదటి వ్యక్తిగా, మత సామరస్యాన్ని కాపాడడానికి వినిపించే మొట్టమొదటి స్వరంగా జాదవ్ సాబ్ ఉండేవారు. రామమనోహర్ లోహియా, జార్జి ఫెర్నాండెజ్ లతో సన్నిహితంగా పనిచేసిన జాదవ్ సాబ్ సోషలిస్టు భావాల ప్రచారం కోసం న్యూ మాన్ కైండ్, ఒలింపస్ వంటి పత్రికలు నిర్వహించారు. ఎన్నో రచనలు చేశారు. లోహియా రచనలకు సంపాదకత్వం వహించి ప్రచురించారు. కుల నిర్మూలనా పోరాటానికి ద్వేషం పునాది కారాదు అని ఆయన రాసిన వ్యాసం పుస్తక రూపంలో వెలువడింది. ఆయన రాష్ట్రవ్యాప్తంగానూ, దేశంలోనూ ఎన్నో చోట్ల సదస్సులలో పాల్గొన్నారు. ఉపన్యసించారు. ఇందిరాగాంధీ 1980లో మెదక్ పార్లమెంటు స్థానానికి పోటీ చేసినప్పుడు స్వతంత్ర అభ్యర్థిగా ఆమె మీద పోటీ చేశారు. సోషలిస్ట్ యువజన సభ, సోషలిస్ట్ పార్టీ, లోహియా విచార్‌మంచ్, జనతాపార్టీ, లోక్‌దళ్, సమాజ్‌వాది జన పరిషత్, హైదరాబాద్ ఏక్తా, తెలంగాణ ప్రజాసమితి, సంపూర్ణ తెలంగాణ ప్రజాసమితి, తెలంగాణ జనసమితి, పియుసిఎల్ వంటి ఎన్నో సంస్థలలో ఆయన కార్యకర్తగానో, నాయకుడి గానో, సలహాదారుగానో ప్రజా జీవితంలో క్రియాశీలంగా పాల్గొన్నారు. జాదవ్ సాబ్‌కు వీక్షణం వినమ్రంగా నివాళి అర్పిస్తున్నది. వీ

ద్వారా కుల సభలు పెట్టించి 'మా కులానికి అసెంబ్లీ, పార్లమెంట్‌లలో జనాభా దామాషా ప్రకారం సీట్లు కేటాయించాలనే డిమాండ్'ను ముందుకు తెచ్చి ప్రజాగ్రహాన్ని దారి మళ్లిస్తున్నారు. విదేశీ చదువులు చదివిస్తాం, పారిశ్రామిక వేత్తల్ని చేస్తాం, మహిళల్ని కోటీశ్వరుల్ని చేస్తాం అని ఆశలు కల్పిస్తున్నారు. పీడిత ప్రజల్ని విభజించడమే లక్ష్యంగా చంద్రబాబు ప్రభుత్వం పావులు కదుపుతుంది. అందుకు దళితుల్ని టార్గెట్ చేసుకుంది. తన పార్టీలోని మాల, మాదిగ నాయకులతో పాటు కొందరు ఆయా కుల సంఘాల నాయకులను, మాల, మాదిగ ఐఎఎస్, ఐపిఎస్ అధికారులను మాజీ ఐఎఎస్, ఐపిఎస్‌లను, నాన్ గవర్నమెంట్ ఆర్గనైజేషన్‌లను తన లక్ష్యాలు నెరవేర్చడానికి వాడుకుంటున్నారు. ఏ కులాల వారిని ఆ కులాల దగ్గరకు పంపించి ఒక కులం మీద మరొక కులానికి ద్వేషం కలిగేలా నూరిపోస్తున్నారు. మన ఈ దుస్థితికి మన పక్క కులపోల్లే కారణమని రెచ్చగొడుతున్నారు. చదువులేని కారణంతోనే మనం ఈ స్థాయికి దిగజారిపోయి ఉన్నామని, మన పేదరికం పోవాలంటే అందరూ చదువుకొని మాలాగా ఐపిఎస్‌లు చదివి ఉన్నత పదవులు పొందితేనే మన పేదరికం, కుల వివక్ష పోతుందని పాలకుల పట్ల ఉన్న వ్యతిరేకత నుండి దళితుల్ని పక్కదారి పట్టిస్తున్నారు. సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలతో ముడిపడి ఉన్న వ్యవస్థీకృతమైన కుల సమస్యను వ్యక్తి స్థాయికి దిగజార్చి దళితుల దయనీయ స్థితికి ప్రభుత్వ విధానాలు కారణం కాదని నూరిపోస్తున్నారు.

ఈ నాలుగేళ్ల అభివృద్ధి కోసం చంద్రబాబు పరిశ్రమలను రాష్ట్రానికి తెచ్చింది లేదు. నిరుద్యోగాన్ని రూపుమాపింది లేదు. సింగపూర్ తరహా రాజధాని నిర్మాణం పేరుతో అమరావతిలో తాత్కాలిక భవనాలు నిర్మించారు. ఇంతవరకు శాశ్వత నిర్మాణాల ఊసే లేదు. వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీకి చెందిన 20 మంది ఎంఎల్‌ఎలను బెదిరించి, ప్రలోభపెట్టి తెలుగుదేశంలో చేర్చుకున్నారు. పటిష్టమైన కమ్మకుల నిర్మాణం ఉందని, గ్రామ స్థాయిలో అక్రమ సంపాదన ద్వారా ప్రజల ధనాన్ని గుంజుకున్న జన్మభూమి కమిటీ సభ్యులే 2019లో మళ్లీ అధికారం హస్తాగతం చేసుకోవచ్చనే ధీమాతో ఉన్నారు. చంద్రబాబు నాలుగేళ్ల పాలన అప్రజాస్వామిక, అనైతిక, అవినీతి మయంగా నడిచింది. ముఖ్యమంత్రి, మంత్రులే దళితులను, మంగలి కులస్తులను అవమానపరిచే విధంగా అగ్రకులాధిపత్యం ప్రదర్శిస్తుంటే గ్రామ స్థాయిలో ప్రజల మధ్య వైరుధ్యాలు, వైషమ్యాలను ఎంతగా రెచ్చగొడుతున్నారో అర్థం చేసుకోవచ్చు. ప్రజల మధ్య ఘర్షణలు సృష్టించి మెజారిటీ వర్గానికి మద్దతుగా నిలిచి, ఓటు బ్యాంకును కొల్లగొట్టి అధికారం చేజిక్కించు కోవచ్చనే పార్శ్వం రాష్ట్రంలో చంద్రబాబు, కేంద్రంలో మోడీ అమలు చేస్తున్నారు. ఇది ప్రజాస్వామ్యానికి అత్యంత ప్రమాదకరం.

*(రచయిత రాష్ట్ర అధ్యక్షులు, కులనిర్మూలన పోరాట సమితి ఏపి)* వీ

# చంద్రబాబుకు బహిరంగ లేఖ

మేధావీ, అత్యంత ప్రతిభావంతుడూ,సంపన్నుడూ అయిన మా రాయలసీమ ముద్దుబిడ్డకు.

అన్నా, చంద్రన్నా!

మీరు ఈ మధ్యకాలంలో పదే పదే 'నేనూ రాయలసీమ బిడ్డనే' అని ప్రకటించుకోవాల్సి వస్తున్నందుకు మీకెలా ఉందేమో గాని, మీ తోబుట్టువులైన మాకేమో చాలా బాధగా ఉంది. మీరా ప్రకటనను గర్వంగా చేస్తున్నారో, లేక అపరాధ భావంతో చేస్తున్నారో? మీరు చేస్తున్న పద్ధతిలో మాత్రం మాకు అపరాధనా భావమే కనపడుతుంది.

అయినా చంద్రన్నా, తాగునీరు, సాగునీరు కరువై, ఉపాధి లేక యితర రాష్ట్రాలకు వలసలకు వెళ్లుతూ బిచ్చమెత్తుకొనే మాకు మా రాయలసీమ బిడ్డయిన మీరు దేశంలోని అందరి ముఖ్యమంత్రులకన్నా ధనవంతులుగా పేరొందడం. గర్వకారణం కాదా.

అంతెందుకు, దేశదేశాలలో ఉన్న ప్రముఖులందరూ, ఒక బిల్ గేట్స్ కావొచ్చు, నాదెళ్ల సత్యం కావొచ్చు, అంబానీ, అధానీలు కావొచ్చు, వీరంతా మీరు నేర్పిన పాటాలవల్ల, మీరు యిచ్చిన సలహాలవల్లనే గదా, ఆయా రంగాలలో ఉన్నత శిఖరాలు అధిరోహించారు. అంతటి గొప్ప వ్యక్తియినా మిమ్మల్ని 'మా రాయలసీమ బిడ్డ' అని మేము సగర్వంగా చెప్పుకోవాలి గాని, మీరే పదే పదే అలా చెప్పుకోవడం అంతగా సబబు అన్పించడం లేదన్నా. అయినా మీకెందుకంత శ్రమ. మీరు కనుసైగ చేస్తే మీ గొంతును తమగొంతులుగా విన్పించే వందిమాగాధులనేకులు మన 'రాయలసీమ బిడ్డలే' ఉన్నారు. అంతెందుకు మీరు తానా అంటే తందాన అనే మీడియా మీ సరసనే కాచుకొని ఉంది కదా. మీ పెరుగుదలను, ఉన్నతిని చూడలేక, ఈర్షతో, అసూయతో మిమ్మల్ని 'రాయలసీమద్రోహి', 'తల్లి పాలు తాగి, రొమ్ములు గుద్దేరకమని' కొందరు మిమ్మల్ని నిందిస్తున్న మాట నిజమే.

వాళ్లంతా శ్రీశ్రీ అన్నట్టు 'నేటి నిజం చూడలేని కీటక సన్నాసులు' నీవు చేస్తున్న అభివృద్ధిని, అది ఏ ప్రాంతంలోనయితేనేం చూడలేని కబోదులు. నీ ఉదారతను, నీ విశాల హృదయాన్ని, నీ అంతరంగాన్ని అర్థం చేసుకోలేని సంకుచిత ఉప ప్రాంతీయవాదులు. వదిలేయన్నా వాళ్ల మానాన వాళ్లు పోతారు. ఎటూ, ఇదే విధానం కొనసాగుతే మిమ్మల్ని విమర్శించేవారు, మీరు పుట్టినగడ్డలో, అదే రాయలసీమలో ఒక్కరూ మిగలరు. ఉపాధి కోసం రాష్ట్రాన్ని దాటిపోతారు, లేక ఇక్కడే ఉంటే ఆకలి చావులు చస్తారు.

చంద్రన్నా! నీవొక దార్శనికునివి. నీ ఆలోచనలు, నీ విధానాలు మాలాంటి మొద్దు బుర్రలకు ఏమి అర్థమవుతాయన్నా. నీవు సీమలో తప్పు పుట్టినావు. ఏ కృష్ణా, గుంటూర్ జిల్లాలలోనో, ఉభయ గోదావరి, కనీసం విశాఖలోనయినా పుట్టాల్సిన వాడివి. సీమ తల్లి అదృష్టం కొద్దీ నీవిక్కడ జన్మించావు. నేడు నీవు సీమకేం చేయలేదని అంటున్నా కోపం తెచ్చుకోక నీ గొప్పతనాన్ని సీమకూ అంటిస్తూ 'నేనూసీమ బిడ్డనే' అని చెప్పుకుంటున్నావు. కనీసం దీనికైన సీమబిడ్డలం మేమంతా నీకు కృతజ్ఞత చెప్పుకోవాలి. నీ ముందుచూపుతో, నాడే 'వ్యవసాయం దండగా' అని చెప్పావు. మా మొద్దు బుర్రలకు ఎక్కలేదు. అందుకే, మేము నేడు అప్పుల్లో మునుగుతూ ఆకలిచావులు చస్తున్నాం. మేమంతా ఆనాడే నీమాట విని వ్యవసాయం వదలి ఏ సాఫ్ట్‌వేర్‌లో చేరి ఉంటే బిల్ గేట్స్‌లము కాకపోయినా నాదేళ్లలమైనా అయ్యుండుం కదా. నీ మాటే విని ఉంటే ఈ పాటికి రాష్ట్రం, నీ స్వప్నసీమ సింగపూర్‌గా మారేది కదా. ప్రతి ఇంటి నిండా పిల్లలబదులు రోబోలు ఉండేవికదా. వాటికి ఆకలి, దప్పులు ఎటూ ఉండవు. దాంతో సీమకు తాగు, సాగు నీటి అవసరం ఉండేది కాదు. ఎంత దూరదృష్టి అన్నా, నీది. మేమే మూర్ఖులం. నిన్నవసరంగా ఆపార్థం చేసుకున్నాం.

'వ్యవసాయం దండగ' అని తెల్సిన నీవు, నీ ప్రాంతాన్ని, అదే రాయలసీమను వ్యవసాయ రహిత ప్రాంతంగా చేయాలనుకున్నావ్. నీరు ఉంటే గదా, నీవు చెప్పినా వినకుండా ఇక్కడి నీ వాళ్లు వ్యవసాయం చేస్తారు. దాంతో, అష్టకష్టాలు పడతారని నీవు ఊహించావు. అందుకే పోతిరేడ్డిపాడు నుండి కృష్ణా వరద జలాలు అందకుండా 1996 లోనే శ్రీశైలం రిజర్వాయర్ కనీస నీటిమట్టాన్ని 854 అడుగుల నుండి 834 కుదించి రైతుల చేతుల. కాళ్లు కట్టేసావు. ఏమి తెలివన్నా నీది?

ఒక్క 69 జీవోతో రాయలసీమను వ్యవసాయరహిత ప్రాంతంగా మార్చేసావు. పోరపాటున వర్శాలొచ్చి నీటిమట్టం పెరిగి, సీమకు నీళ్లందుతే నీ వాళ్లు సేద్యం చేసి నష్టపోతారన్న భయంతో, నీవిచ్చిన జీఓనే ఉల్లంగిస్తూ నీటిని 769 వరకు తోడావు. అదే విధంగా కేసి కాలువ రైతాంగాన్ని విముక్తం చేసేందుకు గుండ్రేవుల రిజర్వాయర్ నిర్మాణాన్ని, మొత్తంసీమ ప్రజల్ని శాశ్వతంగా వ్యవసాయం నుండి విముక్తి కల్పించేందుకు మరే ఇతర సాగునీటి ప్రాజెక్టులనూ చేపట్టలేదు.

అవును మరి, అనంతపురం జిల్లా వాసులకు సాగు నీరందిస్తే బెంగళూరు, మద్రాస్, కేరళలో పనిచేసేందుకు చౌక కూలీలెవరు దొరుకుతారు. గతంలో, కర్నూల్ జిల్లాకు చెందిన ఒక పెద్దాయన తమ ఊర్లో పాఠశాల పెట్టమని అడిగితే, అందరూ బడికి పోతే కూలీకి వచ్చేవారెవరని అన్నాడట. నిజమే. ఆయన కేవలం వూరి విషయం వరకే పరిమితమయితే, నీవు గొప్పవానివి గనుక మొత్తం దేశం గురించి, ఇతర రాష్ట్రాల ఇబ్బందుల గురించి ఆలోచించావు. సీమ వాసులకూ అవసరమైన ఉపాదికల్పిస్తే, ఇతర రాష్ట్రాలు యిబ్బంది పడవూ? అందులోనూ యిప్పుడు కలల నగరం అమరావతికీ చౌకలో, అనుభవమున్న కూలీలు అవసరమాయే. కొందరు దీన్ని సీమకు ద్రోహం అంటారు గాని నీ నిష్పాక్షికతను అర్థం చేసుకోవడం మాలాంటి ఉప ప్రాంతియవాధులకు సాధ్యమా? అందులోనూ సీమలో అభివృద్ధి పథకాలు చేపడితే, నిన్ను స్వార్థపరుడు అని అనరూ. అది నీకే కాదు, సీమబిడ్డలమైన మాకు చెడ్డపేరు కదా! సీమకా చెడ్డ పేరు రాకునేందుకే నీవు అన్ని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ సంస్థలనూ కోస్తాలోనే పెడుతున్నావు. యిప్పుడు ఎవరినైనా అనమను మా చంద్రన్న ప్రాంతీయ దురభిమాని అని కనీసం ప్రాంతీయవాది అని కూడా నింద వేయలేరు కదా.

అయినా నిన్నొక్కడినే – 'తల్లి పాలు తాగి రొమ్ముగుద్దే' వాడివని, తిన్న యింటివాసాలు లెక్కపెట్టే' వానివని, అనడం ఎంత తప్పో, దశాబ్దాలుగా సీమ పెద్దలు చేస్తున్నదదే అని చరిత్ర చెబుతుంది. సీమలో పుట్టి కోస్తా అభివృద్ధికి పాటుపడటం మనకు వారసత్వంగా వస్తున్నదే గదా!. తెలియక అడుగుతాగాని, మనకు మనమే చేసుకుంటే, అందులో

గొప్పధనమేముంది? మెచ్చుకొనేదెవరు? అధికార పీఠం దక్కేదేలా? అంగబలం, అర్థ బలం ఉన్నవాళ్లకు సేవచేయడమే మన పరమావధి అని 1953 నుండి మన పూర్వులు మనకు చెపుతూనే ఉన్నారు. చేసి చూపించారు కూడా. నీవివేమీ పట్టించుకోవద్దన్న. గతం లో ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు . నీవు అది తప్పని నిరూపించావు. ఇంట ఓడినా రచ్చగెలువవచ్చని నిరూపించావు. జాతీయంగా, అంతర్జాతీయంగా మన దిన పత్రికలూ ప్రచారం చేస్తున్నట్టుగా ఖ్యాతినార్జించావు.

శభాస్, చంద్రన్న! మేము కర్నాటక, తమిళనాడు, కేరళలో మురికివాడల్లోనూ, రోడ్లపైనా అడుక్కుంటూ బతుకుతున్నా, మా రాయలసీమ బిడ్డ పేరు దేశ, విదేశాలో అంతటా మారుమోగడం మాకు గర్వకారణం కాదా!

అన్నా, నీదెంత విశాల హృదయం గాకపోతే, నీ ప్రాంత న్యాయమైన ప్రయోజనాలను విస్మరించి, శ్రీభాగ్ ఒడంబడికను తుంగలో తొక్కుతావు. రాయలసీమలో గాకపోయినా, కనీసం దొనకొండలో రాజధాని ఏర్పాటు చేసినా, సీమకు దగ్గరగా ఉంటుందని, దాంతో నీకు సీమ పక్షపాతి అనే చెడ్డ పేరువస్తుందని, రాజదానినీ ఏకంగా అమరావతీ అంటూ గుంటూర్–విజయవాడ మధ్యలో నిర్మిస్తున్నావు. అందుకే కదా శివరామకృష్ణన్ నివేదికనూ లేక్కచేయలేదు. ఇక రాజధాని లేక పోయే, కనీసం హైకోర్ట్‌నైనా ఇవ్వమని మన వాళ్లు ఉద్యమిస్తున్నారు. నీకు తన, మన అనే తేడా లేదుగా. నీవేం తెలివితక్కువ వాడివా?, ఉద్యమాన్ని పక్కదోవ పట్టించేందుకు పవన్ కళ్యాణ్, జే పి, ఆంధ్ర మేధావులను దింపావు. ప్రత్యేక హోదా, బడ్జెట్ కేటాయింపులు కొత్త నినాదం, దాంతో విభజన చట్టం లోని అంశాలు, హంద్రీ–నీవ, గాలేరు నగరి ప్రాజెక్టుల పూర్తి, బుందేల్‌ఖండ్ ప్యాకేజీ, కడపలో ఉక్కు కర్మాగార ఏర్పాటు. అమరావతీని ఫ్రీ జోన్ చేయాలని గాని, జనాభా ప్రాతిపదికన ఉద్యోగాలివ్వాలనే డిమాండ్లు మూలన పడేలా చేసారు. అందుకు నీకు అన్ని పార్టీలూ తరతమ బేధం లేకుండా చేయూతనిస్తున్నాయనుకోండి.

అంతే కాదు నీకు ప్రాంతాల మధ్య బేధం లేదని చెప్పడానికే కదా అమరావతీ చుట్టూ నవనగర నిర్మాణానికి దానికి సీమలోని యెర్ర చందనంతో పాటు అన్ని ప్రకృతి వనరులనూ అమరావతికే అంకితం చేసావు. అమరావతి–పోలవరం నీకు రెండు కళ్లు కదన్నా! పాపం త్రినేత్రుడిలా మూడో కన్ను లేదుగా, నీకు రాయలసీమపై దృష్టి సారించడానికి. దాంట్లో నీ తప్పేముందన్నా. అంతా మా కర్మ. మా ప్రారబ్దం. అన్నీ అమరావతీ చుట్టేనేవారు, నిన్ను అర్థం చేసుకోవడం లో విఫలమవుతున్నారు. మాలాంటి కుళ్లుబోతులకు, నీలాంటి మేధావి ఆలోచనాసరళి ఏం అవగతమవుతుంది.

కోస్తా పెద్దన్నలు దశాబ్దాలుగా సుఖాలకు అలవాటు పడిన వారాయే. మరెంత సుఖాన్నయినా తట్టుకోగల శక్తి వారికుంది. కాని, రోజుల తరబడి. తరతరాలుగా కనీసం గంజి నీళ్లకూ నోచుకోని మాకు అకస్మాత్తుగా షడ్రసోపేత భోజనాన్ని పెడితే అరగించుకోగలమా? కడుపు ఉబ్బి చావమూ. అందుకే, ముందుచూపుతో నీవు సకల సౌకర్యాలు అక్కడే కల్గిస్తూ, తర తరాలుగా మాకలవాటైన జీవితాన్ని మాకే ఉంచావు. నినడిమంత్రపు సిరిలు తో మన రాయలసీమ వాళ్లకు కళ్లు నెత్తికెక్కవూ? దశాబ్దాలుగా, ఉపాధికై వలసలు, ఆకలి చావులు, రైతాంగపు ఆత్మహత్య లకు అలవాటు పడ్డ జీవితాలు కదన్నా మావి, అలవాటుపడ్డాం, కాబట్టి మేం ఈ కస్టాలు అనుభవించగలం. అవేమీ మాకు కొత్త గాదు. కాని సుఖాలకు అలవాటుపడ్డ పెద్దన్నలు అదే దక్షిణ కోస్తా వాళ్లు ఒక చుక్క నీరు తక్కువయినా గగ్గోలు పెట్టరూ. అయినా, అధికార పీఠం కోసం వారిపై ఆధారపడ్డ వాళ్లం, ఆమాత్రం వాళ్లకు సేవ చేయొద్దా. అంతా అత్తగారింటికే దోచి పెడుతున్నాడని గిట్టని వాల్లనుకుంటే నీవేమీ పట్టించు కోవని మాకు తెలుసు. దున్నపోతుపై వాన కురుస్తే ఏమవుతుందన్నా?

చంద్రన్నా, నీవు మా సీమ బిడ్డవు అని తలుస్తూనే మా ఛాతి 54 ఉబుకుతుంది. గర్వంతో మా కష్టాలన్నీ మరచిపోతాం. సీమ నుండి ఎఐఐఎంఎల్‌ను, కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌ను, చివరకు అనంతపూర్ మెడికల్ కాలేజీకి మంజూరు చేసిన రూ. 9 కోట్లలను కోస్తాకు తరలించావని, పద్మావతీ మెడికల్ కాలేజీలో సీమ ఆడపిల్లలకు కేటాయించిన సీట్లనూ నీవు కోస్తా ఆడపిల్లలకే యిచ్చావనీ, చివరకు సుప్రీంకోర్టు మొట్టికాయ లేసినా పట్టించుకోలేదని యిక్కడ గిట్టని వారంటారు.

కాని, నీ అంతరంగం వారికెలా అర్థమవుతూంది. చదువూ–సంధ్యలు కోస్తా వాళ్లకే గాని, సీమ వాసులకెందుకన్నా, అదీ ఆడపిల్లలు డాక్టర్లా. అవ్వవ్వా! ఎవరైనా వింటే నవ్విపోరు. సీమలో మగపిల్లలనే చదివించు కోనేందుకు తలలు తాకట్టు పెడుతున్నారే? అలాంటప్పుడు ఆడపిల్లలను చదివించడం, అదీ డాక్టర్ కోర్సును, ఎంత కష్టమో? ఎంతయినా సీమ బిడ్డవు కాబట్టీ, నీవు అర్థం చేసుకున్నావ్. అందుకని కోర్టును లెక్కపెట్టక కనీసం ఒక బ్యాచ్ సీమ తల్లితండ్రులను అయినా కాపాడావు. దీనికి నిన్ను మెచ్చుకోక విమర్శించడం ఎంత దుర్మార్గం?

అయినా నీవు మాకేం తక్కువ చేస్తున్నావ్? సోలార్ విద్యుత్ కర్మాగారం పెడుతున్నావు కదా! రాయలసీమలో తప్ప మరెక్కడా పెట్టె అవకాశం లేదనీ, ఎక్కువ సంఖ్యలో వుద్యోగాలుండని అనేవారు, అంటూనే ఉంటారు. ఇక, న్యూక్లియార్ ఫ్యూయల్ కాంప్లెక్స్ పెడుతున్నావాయే? ఆ కర్మాగారంలో ఒక్కసారి లీకేజ్ జరిగితే, నిరుద్యోగంతో, ఆకలి, ఈతి బాధలున్న సీమ ప్రజలు, వ్యవసాయం నుండే కాదు ఈ లోకం నుండీ విముక్తి పొందుతారు. అయినా, సీమ ప్రజలు ఎప్పుడూ సాగునీరు, తాగు నీరు అంటూ సణుగుతూంటే ప్రభుత్వాలకు తలనొప్పి కదా.

చంద్రన్నా, నీవు చేపట్టిన పనులు, సాధించిన విజయాలూ సీమ తల్లి గర్వపడేలా ఉన్నాయి. తన పిల్లలకు ఎండిన స్తన్యాలతో పాలివ్వలేని మన తల్లి, నీ ఘనకార్యాలను చూస్తూ వాటిని తలుస్తూ, భాష్పాలు కారుస్తూనే ఉంది. వాటిని కన్నీటిదారాలని ఎవరైనా అంటే మేము ఒప్పుకోములే, సోదరా. ' అతనికంటే ఘనుడు ఆచంట మల్లన్ను అన్నట్టు మన పుత్రరత్నం, అదే లోకేష్ బాబు తండ్రిని మించిన తనయుడయ్యాడు. నెలల క్రితమే భూమి పూజ జరుగక ముందే కియా మోటార్స్ కర్మాగారం ద్వార 5 లక్షల ఉద్యోగాలిచ్చాడు. ఆ మాత్రం చెప్పకపోతే మన వాళ్లు కించపడరూ. అయినా ఎవరి కర్మకు ఎవరు భాద్యులు – దళితులుగా పుట్టాలని ఎవరైనా కోరుకుంటారా? అని నీవే ప్రశ్నించినట్టు, ఎవరైనా 'మిమ్మల్ని రాయలసీమలో పుట్టమన్నారా' అని మమ్మల్ని అడిగితే మా దగ్గర జవాబు లేదు. అయినా, మేమేమి నిన్ను యిబ్బంది పెట్టం. ప్యాకేజీ, హోదా అంటూ కొట్టుక చస్తాం, మీ పన్లు మీరు చెసుకపొండి.

మా కోపం ఏమిటి? పేదవాని కోపం పెదవికి చేటు అంటారు. కోస్తా పెద్దన్నలకు మాత్రం కోపం తెప్పించవద్దు. ఆ కోపం పెదవికి గాక పదవికి చేటు తెస్తుంది.

చివరిగా అన్నా, నీ రెండు కళ్లనూ, అవే అమరావతీ, పోలవరం లను జాగ్రత్తగా కాపాడుకో. రెండూ బంగారు గనులు మరి.

(మా రాయలసీమ బిడ్డవు కాబట్టి చనువుతో నీవు అని సంబోధించి నందుకు క్షమించగలవు.)

ఇట్లు

నీ నుండి ఏమీ ఆశించలేని / ఆశలేని నీ రాయలసీమ బిడ్డలు

**అరుణ్**

*(కన్వీనర్ రాయలసీమ విద్యావంతుల వేదిక)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో విద్యా పరిరక్షణ ఉద్యమం

*విద్యా వ్యవస్థ పూర్తిగా ప్రైవేటు రంగం అధీనంలోకి వెళ్లిపోయిందనీ, విద్యా వ్యాపారాన్ని పెంపొందించడానికే పాలకులు ఎక్కువగా శ్రద్ధ చూపిస్తున్నారనీ అంటున్నారు* **రమేష్ పట్నాయక్**

రాష్ట్ర పునర్ వ్యవస్థీకరణ జరిగి అలాగే కొత్త రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడి నాలుగు సంవత్సరాలు పూర్తి అయింది. ఈ నాలుగు సంవత్సరాల కాలంలో కేంద్ర బిజెపి నీతి (విధానాన్ని హిందీలో నీతి అంటారు, అందుకే విధాన సంఘాన్ని నీతి ఆయోగ్ అంటారు,) రాష్ట్ర తెలుగుదేశం ప్రభుత్వం కార్యాచరణను చర్చించడం రానున్న ఎన్నికలలో విద్యారంగ ఉద్యమ ఎజెండాను ముందుకు తీసుకువెళ్లడానికి ఉపయోగ పడవచ్చు. రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు విధానాలను అనుసరిస్తూన్న విషయం అందరికీ తెలిసిందే. ఆపైన కేంద్ర ప్రభుత్వం యొక్క విద్యా కాషాయీకరణ పథకాన్ని, ప్రధానంగా 2016 లో నూతన జాతీయ విద్యావిధాన ముసాయిదాగా వెలువరించబడినప్పటికీ 2014 నుంచే కేంద్ర ప్రభుత్వం అమలు చేయడానికి ప్రయత్నిస్తూన్న వ్యాపారీకరణ, కాషాయీకరణ, కేంద్రీకరణ విధానాలను రాష్ట్ర ప్రభుత్వం ఎంతవరకు అమలుచేసిందీ ఎంత వరకు అమలు చేయలేదు అన్న విషయాన్ని కూడా కనీసం సూచన ప్రాయంగానైనా పరిశీలించాలి. ఈ వ్యాసం ప్రధానంగా పాఠశాల విద్యకే పరిమితం. అయితే ముందుగా కొంత నేపథ్యాన్ని పరిశీలిద్దాం.

శాస్త్రీయ, ప్రజాతంత్ర, లౌకిక విద్యా విధానం కొరకు ప్రజల ఆకాంక్ష స్వాతంత్ర పోరాటంలోనే బలంగా వచ్చింది. అయితే అది క్రమంగా సాకారం అవడానికి బదులు దూరమవుతూ ఉంది. 1966 లో వచ్చిన కొఠారీ కమిషన్ అటువంటి విద్యా విధానాన్ని అందులో భాగంగా ఉమ్మడి పాఠశాల వ్యవస్థను సిఫారసు చేసింది. కొఠారీ కమిషన్ శాస్త్రీయ దృక్పథం పెంపొందించే విద్యతో పాటు ప్రకృతి శాస్త్రాల విద్యగురించి కూడా సిఫారసు చేస్తే స్వాతంత్ర్యానంతర ప్రభుత్వాలు రెండవదానిని మాత్రమే తీసుకున్నాయి. అంతే కాదు దానిని కాలక్రమంలో సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించడానికి కుదించాయి. బిజెపి ప్రభుత్వం వచ్చిన తరువాత శాస్త్రీయ దృక్పథం అన్న మాట ఇప్పుడు విధాన ప్రకటనలలో కూడా కనిపించడం లేదు. ఇక ఉమ్మడి పాఠశాల విధానం అవసరాన్ని, ఔన్నత్యాన్ని గొప్పగా చిత్రీకరించిన కొఠారీ, అట్టి వ్యవస్థ సంస్థాపనకు సూచించిన ప్రక్రియను మాత్రం లోపభూయిష్టంగా రూపొందించాడు. ఈ ప్రకటన చేస్తున్నందుకు పాఠకులు రచయితను క్షమించాలి. ప్రభుత్వరంగ పాఠశాలలు అభివృద్ధి చెందితే ప్రైవేటు పాఠశాలలు అవే కుదించుకుపోతాయనే అవగాహనతో ఆ కృషిని ప్రారంభించాలని కమిషన్ ప్రభుత్వానికి సిఫారసు చేసింది. ఆ విధంగా మంత్రుల పిల్లలు, అధికారుల పిల్లలు వెళ్లే 'పబ్లిక్' పాఠశాలల కొనసాగింపును వారి ఇచ్ఛకు విడిచిపెట్టింది. వారికి మెరుగైన పాఠశాలలు ఉన్నాయి కాబట్టి వారు ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధిని పట్టించుకోలేదు. క్రమంగా ధనిక, ధనిక మధ్యతరగతి, మధ్యతరగతి చివరకు దిగువ మధ్యతరగతి పిల్లలు ప్రైవేటు పాఠశాలలకు తరలిపోయాయి.

కొఠారీ అనుకున్నదానికి విరుద్ధంగా జరిగింది. కొఠారీ కమిషన్, ప్రభుత్వ రంగం అభివృద్ధి చెందితే ప్రైవేటు రంగం కుదించుకుపోతుందని భావిస్తే ప్రైవేటు రంగం విస్తరించి ప్రభుత్వ రంగం కునారిల్లిపోయింది. కొఠారీ ప్రైవేటు రంగం రద్దుకు సిఫారసు చేసి ఉంటే కనీసం ఈ మధ్య (2015) అలహాబాద్ హైకోర్టు తీర్పు ఇచ్చినట్లు జడ్జీల పిల్లలు, మంత్రుల పిల్లలు, అధికారుల పిల్లలు, ఉద్యోగుల, ఉపాధ్యాయుల పిల్లలు, ప్రభుత్వం నుంచి ఒక్క రూపాయి ప్రయోజనం పొందిన వారందరి పిల్లలు ప్రభుత్వ బడులకే వెళ్లాలని సిఫారసు చేసి ఉంటే, దానిని ప్రభుత్వం చట్టం చేసి ఉంటే పరిస్థితి మరొక రకంగా ఉండేదేమో. ప్రైవేటు రంగాన్ని రద్దుచేస్తే ప్రభుత్వ రంగం బలపడుతుంది అన్న విషయాన్ని గుర్తించకుండా ప్రభుత్వ రంగం బలపడితే ప్రైవేటు రంగం కుదించుకుపోతుందని భావించడంలోనే ప్రధాన తప్పిదం ఉంది. బండిని గుర్రానికి ముందు కట్టడం జరిగింది. ఇది ఒక లోపం కాదు, ఇది అచారిత్రకమైన దృక్పథం. ఇది మొత్తం విషయాన్ని తలక్రిందులుగా చూడడం. లక్ష్యం మంచిదైనా కార్యప్రణాళిక దానికి అనుగుణంగా ఉండాలి కదా. అలా లేనప్పుడు అనుకున్న ఫలితాలు ఎలా వస్తాయి.

అదలా ఉండగా 20 సంవత్సరాల అనంతరం, 1986లో వచ్చిన 'జాతీయ విద్యా విధానం 1986' కామన్ స్కూలు విధానం అనే పదబంధాన్ని వాడుతూనే ప్రభుత్వ రంగంలో మూడు అంచెల (అనియత, నియత, నవోదయ) విధానాన్ని తీసుకువచ్చింది. ప్రైవేటు రంగాన్ని నియంత్రించడానికి ఎటువంటి చర్యలు తీసుకోలేదు. 1990లో వచ్చిన మార్కెట్ ఎకానమికి కావలసిన విద్యావిధానాన్ని పాలకులు 1986లోనే తీసుకు వచ్చారని చెప్పాలి. ఈ విధానంతో విద్యావ్యాపారం బాగా విస్తరించింది, విద్యావస్తువు కూడా మార్కెట్ ప్రయోజనాలకు అనుగుణంగా మార్చబడింది. సామాజిక ప్రకృతి శాస్త్రాలకు కాలం చెల్లిందనే భావన ప్రచారం చేసారు. సైన్స్, ఆర్ట్స్ కోర్సులకు అదనంగా కాదు వాటి స్థానంలో టెక్నాలజీ, కంప్యూటర్ కోర్సులు తీసుకువచ్చారు. బిఎ చదివితే నిరుద్యోగమేనని, బిఇ లేదా బిటెక్‌లు చదివితే ఉద్యోగాలొస్తాయని ప్రచారం చేశారు. ఇప్పుడు తెలుగు రాష్ట్రాలలో లక్షల సంఖ్యలో నిరుద్యోగులైన కంప్యూటర్ ఇంజనీర్లు ఉన్నారు. వారు గ్యాంగుమన్ పనికి దరఖాస్తు చేస్తూన్నారు. పోలీసు కాన్‌స్టేబుల్స్ అవుతున్నారు.

నిరుద్యోగం ప్రధానంగా విద్యారంగ సమస్యకాదు. అది ప్రధానంగా ఆర్థిక రంగ సమస్య. ఉద్యోగిత లేని అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్నప్పుడు నిరుద్యోగ సమస్య ఏ కోర్సుచదివినా ఉంటుంది. మరొక 20 సంవత్సరాల కాలం గడిచేసరికి విద్యావ్యవస్థల నామరూపాలు పూర్తిగా మారిపోయాయి. ఈ పరిస్థితులలోనే కేంద్ర బిజెపి ప్రభుత్వం నూతన విద్యా విధానం తీసుకువస్తున్నట్లు ప్రకటించింది. ప్రజల అభిప్రాయాల

సమీకరణ పేరుతో ఒక వెబ్‌సైట్ నాటకం ఆడింది. తరువాత సుబ్రమణియన్ కమిటీని నియమించింది. సుబ్రమణియన్ కమిటీ నివేదికనూ బుట్టదాఖలు చేసింది. తరువాత కేంద్ర మానవ వనరుల శాఖ తాను తయారు చేశానని చెప్పి 'నూతన జాతీయ విద్యావిధానం కొరకు కొన్ని ప్రాతిపదికలు' అన్న పేరుతో ఒక డాక్యుమెంటును చర్చకు వెబ్‌సైట్‌లో పెట్టింది. అయితే అది నాగపూర్‌లో ఆర్‌ఎస్‌ఎస్ కార్యాలయంలో తయారైందన్న విషయం బయటపడిన తరువాత దానిని వెబ్‌సైట్ నుంచి తొలగించింది. ఈ డాక్యుమెంట్‌నే మనం 'నూతన జాతీయ విద్యా విధాన ముసాయిదా 2016' అని వ్యవహరిస్తూన్నాం. నిజానికి ఇందులో కొన్ని అంశాలను 2014 నుంచే అమలు చేస్తూ ఉంది లేదా అమలు చేయడానికి ప్రయత్నిస్తూ ఉంది.

బిజెపి నాయకత్వానగల కేంద్ర ప్రభుత్వం అమలు చేస్తూ ఉన్న లేదా అమలు చేయడానికి ప్రయత్నిస్తూ ఉన్న విద్యా విధానాన్ని నాలుగు మాటలలో చెప్పుకుందాం. 1) సమానత్వానికి, సామాజిక న్యాయానికి వ్యతిరేకంగా విద్యావ్యాపారం, 2) ప్రజల ప్రయోజనాలకు, దేశ సార్వభౌమాధికారానికి వ్యతిరేకంగా విద్యా భౌగోళీకరణ 3) సాంస్కృతిక, మత వైవిధ్యాలకు వ్యతిరేకంగా బహుళసంఖ్యాకవాదం – మెజారిటేరియనిజం, హిందూ ఉన్మాదం, 4) కులపరమైన, లింగపరమైన అసమానతలను పెంపొందించే బ్రాహ్మణీక పునరుద్ధరణ వాదం, 5) ఫెడరలిజానికి వ్యతిరేకంగా అధికార కేంద్రీకరణ, 6) విశ్వవిద్యాలయాలలో ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా ఆధికారస్వామ్యం 7) విశ్వవిద్యాలయాల మధ్య వివక్ష కేంద్ర ప్రభుత్వ విధానాలుగా చెప్పుకోవచ్చు. కాంగ్రెస్ పాలనలో కూడా ఇవన్నీ ఉన్నాయి. అయితే బిజెపి పాలనలో కుల, మత, లింగ, సాంస్కృతిక అధిపత్యవాదాలు విశ్వవిద్యాలయాలలో వివక్ష, విశ్వవిద్యాలయాల మధ్య వివక్ష ప్రమాదకరమైన స్థాయిలో పెరిగాయి. కేంద్ర మానవ వనరుల మంత్రిత్వ శాఖ 2016లో వెబ్‌సైట్‌లో పెట్టిన ముసాయిదా విద్యా విధానం ఈ మూల స్తంభాలపైననే ఆధారపడి ఉంది. బిజెపి తిరిగి ఎన్నికైతే పార్లమెంటరీ బూర్జువా ప్రజాస్వామ్యానికి తిలోదకాలిచ్చే అవకాశమే ఎక్కువుగా ఉంది. ఒకే సారి ఎన్నికలు, అధ్యక్ష పాలన వారి తంత్రాలుగా ఉన్నాయి. నిరంకుశ విధానం వైపు ఫాసిజం వైపు వారు అడుగులు వేస్తున్నారు.

మన చర్చను పాఠశాల విద్యకు పరిమితం చేద్దాం. ఏ రాష్ట్రంలోనైనా ప్రస్తుత పాఠశాల విధానాన్ని పరిశీలించాలంటే పాఠశాల రంగంలో కేంద్ర ప్రభుత్వ విధానాన్ని సూచనా ప్రాయంగానైనా పరిశీలించాలి. బిజెపి తన 2016 డ్రాఫ్ట్ పాలసీ డాక్యుమెంటులో (ఇది అధికారికంగా వెనక్కు తీసుకోబడినా ఆచరణలో 2014 నుంచే అమలు జరుగుతుందని ముందు గానే నమోదు చేశాం) పాఠశాల విద్యపై విపరీతమైన దాడి కనిపిస్తుంది. ఈ సందర్భంగా మనం విద్యాహక్కు చట్టాన్ని వస్తువుగా తీసుకుని చర్చిద్దాం. కాంగ్రెస్ తీసుకువచ్చిన విద్యాహక్కు చట్టం విద్యా వ్యాపారాన్ని రద్దు చేయలేదు. ఉమ్మడి పాఠశాల విధానాన్ని స్థాపించలేదన్న విషయం తెలిసిందే. అంతేకాదు అందులో ఎ) పూర్వ ప్రాథమిక విద్యకు హక్కులేదు, బి) సెకండరీ విద్యకు హక్కు లేదు, సి) ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధికి తగిన నిబంధనలు లేవు, డి) ప్రైవేటు పాఠశాలల నియంత్రణకు నిబంధనలు లేవు, అన్నింటికీ మించి ఇ) ప్రభుత్వ నిధులను ప్రైవేటు యాజమాన్యాలకు ధారాదత్తం చేయడానికి కావలసిన రీయింబర్స్‌మెంట్ పథకం ఈ చట్టంలో ఉంది. చివరిది మాత్రమే విద్యా హక్కు చట్టాన్ని వ్యతిరేకించడానికి విశేషమైన కారణం కాగలదు. మిగిలిన నాలుగు విషయాలు పాతవే. చట్టంలో చేరి పటిష్టపరచబడ్డాయి అంతే. అయితే, ఆశ్చర్యకరమైన విషయమేమంటే అత్యధికులు విద్యాహక్కు చట్టం అంటే ఏమిటో తెలియకుండా దానికి మద్దతు ప్రకటించారు. నిజాయితీపరుడు, ప్రముఖ విద్యావేత్తగా పేరున్న ఒక పెద్దాయన తన జీవతంలో ఇది 'రెండవ ఆగస్టు 15' అని ఈ చట్టాన్ని ప్రారంభించిన రోజున ఒక సభలో చెప్పాడు. ఇక వ్యతిరేకించిన వారిలో అత్యధికులు ఆ చట్టం విద్యా వ్యాపారాన్ని రద్దుచేయలేదని, ఉమ్మడి విద్యావ్యవస్థను సంస్థాపించలేదని వ్యతిరేకించారు, అంటే వారి ఆశయాలు అందులో ప్రతిఫలించనందుకు వ్యతిరేకించారు. విద్యాహక్కు చట్టాన్ని వ్యతిరేకించ డానికి ఉండగల విశేషకారణం మాత్రం రీయింబర్స్‌మెంటు పథకమే. ఎందుకంటే అది మాత్రమే కొత్త దాడి. ఇది ప్రభుత్వ ధనాన్ని ప్రైవేటు యాజమాన్యాలకు ధారాదత్తం చేసే విధానం. ప్రైవేటు ఈ నాడు ఎంతగా విస్తరించిందంటే, ఏమాత్రం ఫీజు కూడా కట్టలేని వారే ప్రభుత్వ పాఠశాలలకు వస్తున్నారు. తెలుగు రాష్ట్రాలలో ప్రభుత్వ పాఠశాలలకు వస్తున్న విద్యార్థులు మొత్తం విద్యార్థులలో అటు ఇటుగా 50 శాతంగా ఉన్నారు. అనేక రాష్ట్రాలలో విద్యా మార్కెట్ పెరగగలిగినంత పెరిగి ఆగిపోయింది. విద్యా మార్కెట్ మరింత విస్తరించడమనేది నిరుపేదలు ప్రైవేటులో జాయిన్ అయితేనే సాధ్యం. నిరుపేదలు జాయిన్ కావాలంటే రీయింబర్స్‌మెంటు ఒక్కటే మార్గం. రీయంబర్స్‌మెంటు లేకుండా ప్రైవేటు పాఠశాలలలో 50 శాతం రిజర్వేషన్లు అమలు చేయమని ఉంటే అప్పుడు తెలిసేది ప్రైవేటు యాజమాన్యాల కుల, వర్గ వివక్ష. ఒక్కమాటలో చెప్పాలంటే విద్యాహక్కు చట్టంలో ఉన్న 25 శాతం రీయింబర్స్‌మెంటు పథకం మార్కెట్ విస్తరణ పథకం. ఇది మిల్టన్ ఫ్రైడ్‌మన్ ప్రబోధించిన స్కూలు ఛాయిస్ పథకం వంటిది. స్కూలు ఛాయిస్ పథకం కూడా యథాతథంగా త్వరలో రానున్నది. అదివేరే విషయం.

ఇప్పుడు ఈ చర్చ మనకెందుకు అవసరమైందంటే, బిజెపి ప్రభుత్వం విడుదలచేసిన 2016 ముసాయిదా విధాన పత్రం పరిశీలించిన తరువాత విద్యా హక్కు చట్టంలో మెరుగులు కనిపిస్తున్నాయి. 'విద్యాహక్కు చట్టం 2009' లో మెరుగులు చూడాల్సిన దుస్థితికి మనం నెట్టివేయబడ్డాం. 'విద్యాహక్కు చట్టం 2009' (రీయింబర్స్‌మెంటు పథకాన్ని విడిచిపెట్టి) కాపాడుకోవలసిన అవసరం కనిపిస్తుంది! కారణాలు చూడండి: 1) 'విద్యాహక్కు చట్టం – 2009' 8వతరగతి వరకు నిరంతర సమగ్ర మూల్యాంకన పద్ధతిని నిర్దేశించింది. ఏ విద్యార్థిని ఒకే తరగతిలో నిలువ ఉంచడానికి లేదు, వైఫల్యాలకు కారణాలు కనుగొని ప్రత్యేక శ్రద్ధతో సవరించి ప్రొమోట్ చేయాలి. కాగా, 2016 ముసాయిదా 5 వతరగతిలో ఫెయిల్ అయినవారికి ఒక్క అవకాశం ఇచ్చి డిటెయిన్ చేయాలని నిర్దేశించింది. ఈ మేరకు ఇప్పుడు పార్లమెంటులో బిల్లు పెట్టారు. విద్యపై కేంద్ర సలహా సంఘం (సిఎబిఇ) సమావేశంలో కొన్ని ప్రభుత్వాలు వ్యతిరేకించడం వలన రాష్ట్ర ప్రభుత్వాలకు ఆప్షన్ ఇచ్చారు. నిజానికి బాలలు విఫలమవ్వరు. విఫలమయ్యేది పాఠశాలకు పంపని తల్లిదండ్రులు, పాఠాలు చెప్పని ఉపాధ్యాయులు, ఉపాధ్యాయులను నియమించని ప్రభుత్వాలు. తరచి చూస్తే తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల కారణాల వెనుక కూడా ప్రభుత్వమే ఉంటుంది. పెద్దల వైఫల్యానికి బాలలను శిక్షించడమే డిటెన్షన్ విధానం. డిటెన్షన్ విధానాన్ని సమర్థిస్తూ బిజెపి తన 2016 ముసాయిదాలో 'ఎన్ని అవకాశాలు కల్పించినా వారి సామాజిక కారణాల వలస కొద్దిమంది అవకాశాలను అందిపుచ్చుకోలేరని' ప్రకటించి నిస్సిగ్గుగా తన కులవివిక్ష దృక్పథాన్ని బయట పెట్టుకుంది. 2) 'విద్యాహక్కు చట్టం 2009' 1 నుండి 8వ తరగతి వరకూ బాలలందరికీ ఒకే పాఠ్య

ప్రణాళిక నిర్దేశించింది. (సరదు పాఠ్య ప్రణాళికను అనుసరించి పాఠ్యపుస్తకాలు బోర్డుల వారీగా రాయబడతాయి, అది వేరే విషయం) కాగా, 2016 ముసాయిదా 6 నుంచి 10వ తరగతి వరకు 'చురుకైన విద్యార్థులకు' ఒక పాఠ్య ప్రణాళిక, 'చదువులో వెనుకబడిన' విద్యార్థులకు తేలికపాటి పాఠ్యప్రణాళిక నిర్దేశించింది. నిజానికి వెనుకబడిన విద్యార్థులు ఉండరు, వెనుకబడిన పాఠశాలలు ఉంటాయి. 5వ తరగతి వరకు మంచి పాఠశాలలో చదివిన విద్యార్థులు సాధారణంగా చురుకైన విద్యార్థులవుతారు, కాగా 5వ తరగతివరకు వసతులు, ఉపాధ్యాయులు, సక్రమ నిర్వహణ లేని పాఠశాలలలో చదివే విద్యార్థులు సాధారణంగా చదువులో వెనుకబడతారు. ప్రభుత్వ పాఠశాలలను నిర్లక్ష్యంచేసి అందులో చదువుతున్న పేద, దళిత, వెనుకబడిన, మైనారిటీ విద్యార్థులను మొద్దులు అని ముద్రవేయడం బిజెపి విధాన లక్ష్యం. వారిని మొద్దులుగా ప్రకటించిన తరువాత వారికి రెండవ స్థాయి పాఠ్య ప్రణాళిక నిర్దేశించడం జరిగింది. 6 నుంచి పాఠ్య ప్రణాళిక 'ఏ', పాఠ్యప్రణాళిక 'బి' ఉంటాయి. చురుకైన విద్యార్థులకు పాఠ్య ప్రణాళిక ఎ అమలుచేస్తారు, చదువులో వెనుకబడిన వారికి పాఠ్య ప్రణాళిక 'బి' అమలు చేస్తారు. దీని ఫలితంగా ప్రైవేటు పాఠశాలలలో పాఠ్య ప్రణాళిక 'ఎ', ప్రభుత్వ పాఠశాలలలో పాఠ్యప్రణాళిక 'బి' అమలవుతాయని వేరుగా చెప్పనవసరం లేదు. అంతేకాదు, పాఠ్య ప్రణాళిక 'బి' ని అనుసరించిన వారికి ఉన్నత విద్యలకు అర్హత ఉండదని సదరు విధాన పత్రం స్పష్టం చేసింది. 3) 'పాఠశాల నుంచి విద్యార్థి వృత్తి నిపుణుడుగా కాదు బయటికి వెళ్లవలసింది, ఈ ప్రకృతి గురించి, సమాజం గురించి వేనవేల ప్రశ్నలతో బయటకు వెళ్లాలి, పాఠశాల విద్య విద్యార్థిలో ప్రశ్నలు లేవనెత్తాలి' అంటాడు ప్రముఖ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్. తద్విరుద్ధంగా మన పాఠశాలవిద్య విద్యార్థి జవాబులు కంఠస్థవం పెట్టేదిగా రూపొందంచబడిన విషయం తెలిసిందే. గాంధీ బేసిక్ విద్యావిధాన ప్రతిపాదనలను పాలకవర్గాలు తమకు అనుకూలంగా మార్చుకున్నాయి. మార్క్స్ పాలిటెక్నిక్ విద్యను వామపక్షం అపార్థం చేసుకుంది. పాఠశాల విద్యను వృత్తిపరం చేయడానికి పాలకవర్గాలు ప్రయత్నించాయి కాగా వామపక్షాలు వ్యతిరేకించలేదు. అయితే అదృష్టవశాత్తూ మనదేశంలో నిజానికి పాఠశాల విద్య ఏనాడూ విస్తృతంగా వృత్తిపరం చేయబడలేదు. మంచిదే అయింది. అదే ఒరవడిలో 'విద్యాహక్కు చట్టం 2009' 8వ తరగతి వరకు ఎటువంటి వృత్తివిద్యను ప్రతిపాదించలేదు. అందరికీ లిబరల్ విద్యనే ప్రతిపాదించింది. ఇప్పుడు బిజెపి ప్రభుత్వం తయారుచేసిన 2016 ముసాయిదా విద్యావిధానం 5వ తరగతి పరీక్షలలో తప్పినవారందరినీ వృత్తివిద్యలకు పంపించాలని ప్రతిపాదించింది. వృత్తివిద్యలు భారత దేశంలో కులవిద్యలే అన్నది తెలిసిన విషయమే. 4) బోధనా మాధ్యమం: 'విద్యాహక్కు చట్టం 2009' ఎలిమెంటరీ విద్యలో వీలయినంతవరకు మాతృభాషా మాధ్యమాన్నే అమలు చేయాలని నిర్దేశించింది. కాగా బిజెపి ప్రభుత్వం 2016 ముసాయిదా విద్యావిధానం 6వ తరగతి నుంచి అన్ని యాజమాన్యాల పాఠశాలలు ఆంగ్ల మాధ్యమాన్నే అమలుచేయాలని, 5వ తరగతి వరకు మాధ్యమం విషయం రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించాలని నిర్దేశిస్తూంది, 5) 'విద్యాహక్కు చట్టం 2009' లో ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలకు ఉండవలసిన కనీస వసతులు, నియమించబడవలసిన ఉపాధ్యాయుల కనీస సంఖ్య, వారి విద్యార్హతల గురించి తప్పక అమలు చేయవలసిన నిబంధనలు ఉన్నాయి. ఇవి అవసరమైన ప్రమాణాల కంటే తక్కువగా ఉన్న మాట నిజమే. అయితే, తెలుగు రాష్ట్రాలతో సహా వివిధ రాష్ట్రాలలో ఉన్న అధమ పరిస్థితులకంటే 'విద్యాహక్కు చట్టం 2009'లో ఉన్న నిబంధనలు మెరుగ్గా ఉన్నాయి. అమలు విషయానికి వస్తే పాఠశాలకు ఉండవలసిన కనీస వసతులకు సంబంధించి ఇంతవరకు 9.5 శాతం (95 శాతం కాదు) మాత్రమే అమలు జరిగాయి. దీనిని బట్టి 100 శాతం అమలు జరిగితే మన పాఠశాలలు ఎంతో మెరుగ్గా ఉంటాయని ఊహించవచ్చు. అలాగే, ఉపాధ్యాయ నియామకాలకు సంబంధించి పరిశీలిస్తే ఉభయ తెలుగు రాష్ట్రాలలో పరిస్థితి కొంత మెరుగనే చెప్పాలి. ఎందుకంటే డిఎస్‌సి వేయడం ఇక్కడ ఒక రాజకీయ సమస్యగా ఎదిగింది. కాగా దేశవ్యాప్తంగా పరిశీలిస్తే 8.5 లక్షల మంది ఉపాధ్యాయులకు కనీస అర్హతలు లేవని ప్రభుత్వ గణాంకాలే చెప్తున్నాయి. అమలు విషయం అలా ఉంచితే కనీసం వసతులు, ఉపాధ్యాయుల సంఖ్య విషయమై చట్టంలో నిబంధనలు ఉన్నాయి. ఇప్పుడు కేంద్ర బిజెపి ప్రభుత్వం నీతి ఆయోగ్ ప్రకటించిన మూడు సంవత్సరాల కార్యాచరణ పథకంలో వసతులకు సంబంధించి, ఉపాధ్యాయ నియామకాలకు సంబంధించి ఉన్న నిబంధనలను (దీనిని వారు ఇన్‌పుట్ అప్రోచ్ అన్నారు) రద్దుచేయాలి లేదా వాటిని ఉట్టి మార్గదర్శకాలుగా మార్చివేయాలి అని, ఫలితాలు రాబట్టడానికి సూపర్‌విజన్, సర్వియలెన్స్ (ఈ పదం వారు వాడలేదు, వారి ఉద్దేశం స్పష్టం చేయడానికి ఈ పదం సరిపోతుంది) పెంచాలని పేర్కొన్నారు. 6) అన్నింటికంటే మించి 'విద్యాహక్కు చట్టం 2009'లో పొందుపరచిన పాఠ్య ప్రణాళిక మౌలికాంశాలు భారత రాజ్యాంగ విలువలకు లోబడిఉన్నాయి. ఆ చట్టాన్ని రూపొందించే సందర్భంలో జరిగిన చర్చలు కూడా అందుకు కారణం. అయితే ఇప్పుడు కేంద్ర బిజెపి ప్రభుత్వం వీటిని పూర్తిగా మార్చివేయాలని, కాషాయీకరించాలని చూస్తూంది. ఇది అన్నింటికంటే ప్రమాదకరమైనది.

'విద్యాహక్కు చట్టం 2009', బిజెపి విధానాలను తారతమ్యంగా పరిశీలిస్తే, ఎ) కనీస వసతులు, ఉపాధ్యాయ నియామకాల నిబంధనలను ఎత్తివేసి 'ఫలితాల'పై దృష్టి పెట్టే ప్రపంచబ్యాంకు 'జెర్మ్' విధానాన్ని, బి) మాతృభాషా మాధ్యమ స్థానంలో ఆంగ్ల మాధ్యమాన్ని, సి) నిరంతర సమగ్ర మూల్యాంకన స్థానంలో డిటెన్షన్ విధానాన్ని, డి) విద్యార్థులందరికీ ఒకే పాఠ్య ప్రణాళిక స్థానంలో రెండు గ్లాసుల పద్ధతిని, ఇ) లిబరల్ విద్య స్థానంలో వృత్తి (కుల)విద్యను, యఫ్) శాస్త్రీయ, ప్రజాస్వామిక, లౌకిక పాఠ్య ప్రణాళిక స్థానంలో కాషాయీకరణను ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం తీసుకువస్తుంది. దీనర్థం ఏమిటి? 'విద్యాహక్కు చట్టం 2009'లో ఉన్న మెరుగులను బిజెపి కాషాయీకరణ నుంచి కాపాడుకోవలసిన అవసరంలో మనం ఉన్నాం అని గ్రహించాలి. ఇప్పటికీ మన పోరాటాన్ని విద్యా హక్కు చట్టానికి వ్యతిరేకంగా ఎక్కుబెడితే మనం బిజెపి ఎజెండాను పంచుకున్నట్లే అవుతుంది. మనం పాత బోల్షివిక్కులుగా మాత్రమే ఉంటాం. పైన సూచించిన ఆరు దాడులలో మొదటి రెండూ విద్యా వ్యాపారీకరణకు సంబంధించినవి. ఇవి అధికారంలో ఏ పార్టీ ఉన్నా కొనసాగుతాయి. కాగా చివరి నాలుగు సంఘపరివార్ కులతత్వం నుంచి వచ్చినవి. అయితే, పాఠ్యప్రణాళిక విషయంలో రెండు గ్లాసుల విధానం, వృత్తి (కుల) విద్యలు అనే అంశాలను ప్రస్తుతానికి బిజెపి అధికారంలో ఉన్న రాష్ట్రాలు కూడా అమలుచేస్తున్నట్లు వార్తలు రావడం లేదు. ఆంగ్ల భాషా మాధ్యమం విషయంలో కూడా వారు ఎక్కువగా పట్టింపు చూపడం లేదు. డిటెన్షన్ పాలసీని తీసుకురావాలని మాత్రం కేంద్ర బిజెపి ప్రభుత్వం పట్టుదలగా ఉంది. ఆ మేరకు పార్లమెంటులో విద్యా హక్కు చట్టానికి ఒక సవరణ చట్టం కూడా ప్రవేశపెట్టారు. అది

# నేరెళ్ల వేణుమాధవ్



సుప్రసిద్ధ ధ్వన్యనుకరణ కళాకారుడు నేరెళ్ల వేణుమాధవ్ (1932-2018) జూన్ 19న వరంగల్‌లో కన్నుమూశారు. ఎనభై ఆరు సంవత్సరాల జీవితంలో ఆరు దశాబ్దాలకు పైగా మిమిక్రీ కళను ప్రదర్శిస్తూ, పరిచయం చేస్తూ, నేర్పుతూ, ప్రజలకు వినోద, విజ్ఞానాలు కలిగిస్తూ ఆయన ప్రపంచమంతా పర్యటించారు. అభిమాన నటుడు చిత్తూరు నాగయ్యను అనుకరిస్తూ మొదలు పెట్టిన స్వరానుకరణ కళకు తెలుగుసీమలో ఆయనే ఆద్యుడు. ఆ తర్వాత ధ్వన్యనుకరణ, వెంట్రిలాక్విజం వంటి అనేక రంగాల లోకి ఆయన తన కళను విస్తరించారు. రేడియో, టెలివిజన్ ఇంకా విస్తరించని రోజుల్లోనే తాను విన్న ప్రముఖుల గొంతులను అనుకరిస్తూ, స్వయంగా ఆ ప్రముఖుల, వేలాది మంది శ్రోతల మన్ననలు అందుకున్నారు. అలాగే వివిధ ధ్వనులు, సినిమా సన్నివేశాలు గొంతులో పలికించడం, ఒకేసారి రెండుమూడు ధ్వనులు పలికించడం వంటి ఎన్నో కొత్త ప్రయోగాలు చేశారు. ఆయన తెలుగు, ఉర్దూ, ఇంగ్లిష్, హిందీ, తమిళం భాషల్లో ప్రదర్శనలిచ్చేవారు. వేణుమాధవ్ కొంతకాలంగా పార్కిన్సన్, వృద్ధాప్య సంబంధ ఆరోగ్య సమస్యలతో బాధపడుతున్నారు. మిమిక్రీ కళను మరింత మంది నేర్చుకోవాలనే కోరికతో ఆయన సిలబస్ కూడ రూపొందించి, తెలుగు విశ్వవిద్యాలయంలో డిప్లొమా కోర్సును పెట్టించారు. మొదటి రెండేళ్లు ఆయనే పాఠాలు చెప్పారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో కూడ మిమిక్రీపై సాయంత్రం తరగతులు నిర్వహించే వారు. ఉమ్మడి రాష్ట్రంలో ఆయన 1972-78 మధ్య కాలంలో శాసనమండలి సభ్యుడిగా నామినేట్ అయ్యారు. ప్రముఖ నిర్మాత బిఎన్ రెడ్డి ప్రోత్సాహంతో ఆయన కొన్ని సినిమాల్లో కూడ నటించారు. 2001లో పద్మశ్రీ పురస్కారం పొందారు. ఆంధ్ర, కాకతీయ విశ్వవిద్యా లయాల నుంచి, ఇందిరా గాంధీ సార్వత్రిక విశ్వ విద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్ అందుకున్నారు. వేణుమాధవ్ తో వీక్షణంకు ప్రత్యేక అనుబంధం ఉంది. 2005 ఏప్రిల్ నుంచి 2017 నవంబర్ వరకు వీక్షణం కార్యాలయం ఆయనకు చెందిన ఫ్లాట్ నుంచే నడిచింది. హిమాయత్‌నగర్‌లోని ఆయన ఫ్లాట్‌కు మామూలుగా వచ్చే అద్దెలో సగం కన్న తక్కువకు వీక్షణంకు ఇవ్వడం ద్వారా ఆయన వీక్షణం పట్ల తన అభిమానం ప్రకటించారు. నేరెళ్ల వేణుమాధవ్ స్మృతికి వీక్షణం వినమ్రంగా నివాళి అర్పిస్తున్నది. ఆయన సహచరి శోభావతి గారికి, కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాపం ప్రకటిస్తున్నది. వీ

పెండింగులో ఉంది. వారు తిరిగి ఎన్నికైతే పూర్తి ఎజెండాను అమలు చేస్తారనే దాంట్లో సందేహం అవసరం లేదు. అన్నింటికంటే ప్రధానమైన విషయమేమంటే నీతి ఆయోగ్ కార్యాచరణ పథకంలో స్థానం సంపాదించుకున్న జెర్మ్ యొక్క దాడి. జెర్మ్ అనేది నిజానికి ప్రపంచబ్యాంకు తను ప్రతిపాదించిన 'సంస్కరణలకు' తాను పెట్టిన పేరుకాదు. ప్రపంచబ్యాంకు విద్యారంగంలో ప్రతిపాదిస్తూ ఉన్న నయా సరళీకరణ సంస్కరణలను విమర్శిస్తున్నవారు వాటికి గ్లోబల్ ఎడ్యుకేషన్ 'రిఫార్మ్' మూవ్‌మెంట్ (జెర్మ్) అని పేరు పెట్టారు. ఈ పేరు పెట్టింది ప్రముఖ ఫిన్‌లాండ్ విద్యావేత్త పాసి సెహల్‌బెర్గ్. దీనిని మరొక చోట వివరిద్దాం.

### ఆంధ్రప్రదేశ్‌లో పాఠశాల విద్య

ఆంధ్రప్రదేశ్ విద్యావ్యాపారానికి పెట్టింది పేరు. ఉమ్మడి రాష్ట్రంలోనే పాఠశాల విద్య విస్తృతంగా వ్యాపారీకరణకు గురయ్యింది. ఇప్పుడు రెండు రాష్ట్రాలలో విద్యా వ్యాపారం పోటాపోటీగా పెరుగుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వం కూడా ప్రపంచబ్యాంకు జెర్మ్‌ను, ఆంగ్ల మాధ్యమాన్ని అమలు చేస్తూంది. పాఠ్యపుస్తకాలలో, పాఠశాల నిర్వహణలో కాషాయీకరణ క్రమంగా చోటుచేసుకుంటుంది. అయితే కాషాయీకరణ ఇక్కడ ప్రధానమైన ఎజెండాకాదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేబ్ సమావేశంలో కూడా డిటెన్షన్ విధానాన్ని వ్యతిరేకించి, ఆ విషయంలో రాష్ట్రాలకు నిర్ణయాధికారాన్ని అడిగింది, రాష్ట్రంలో విద్యావ్యాపారం మాత్రం వెర్రి తలలు వేస్తూంది. ప్రపంచబ్యాంకు రూపొందించిన, నీతి ఆయోగ్ ఆమోదించిన, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అమలు చేస్తున్న జెర్మ్ ఇప్పుడు ఒక ప్రధాన ప్రమాదంగా ఉంది. ఆంగ్ల మాధ్యమాన్ని సర్వవ్యాప్తం చేయడం, తెలుగును ఒక భాషగా కూడా నిరాకరించడం ఒక పెద్ద సవాలుగా ఉంది. నిజానికి మాతృభాష స్థానంలో ఆంగ్లభాష రావడం అనేది విద్యావ్యాపారీకరణ విధాన ఫలితమే. విద్యావ్యాపారాన్ని రద్దు చేయడం, ఉమ్మడి పాఠశాల విధానాన్ని అమలుచేయడం చాలా పెద్ద విషయాలు. నిజానికి అవి కేంద్ర ప్రభుత్వం తీసుకోవలసిన విషయాలు. రాష్ట్ర ప్రభుత్వం చేయగలిగే విషయం ప్రభుత్వ పాఠశాలలను అభివృద్ధి చేయడం, ప్రైవేటు పాఠశాలలను నియంత్రించడం. ఇది నిలబడే పరిష్కారం కాదు. నిరంతరం ఘర్షణలకు ఆస్కారం కలిగించే పరిష్కారం మాత్రమే. విద్యావ్యాపారం రద్దు, ఉమ్మడి పాఠశాల విధాన సాధన అఖిలభారత ఉద్యమాల ద్వారా సాధ్యమయ్యేవరకు రాష్ట్ర ఉద్యమాలు చేయగలిగేది నిరంతరం తలెత్తుతున్న ఘర్షణల పరిష్కారానికి నిరంతరాయంగా ప్రజా ఉద్యమ నిర్మాణాన్ని కొనసాగించడమే. ఉభయ తెలుగు రాష్ట్రాలలో విద్యాపరిరక్షణ ఉద్యమాలు అట్టి కార్యాచరణలోనే ఉంటూ అఖిల భారత ఉద్యమంలో భాగాలుగా ఉన్నాయి. ఉద్యమ విషయం పక్కనపెట్టి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం విషయానికి వస్తే అది ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధికిగాని ప్రైవేటు పాఠశాలల నియంత్రణకు గాని చేస్తున్నది ఏమీలేదు. తద్విరుద్ధంగా ప్రభుత్వ పాఠశాలలను మూసివేస్తూ, ఉపాధ్యాయ పోస్టులను రద్దుచేస్తూ ఉంది. ప్రైవేటు యాజమాన్యాలు రాష్ట్రాన్ని పరిపాలిస్తున్నాయి. ప్రభుత్వరంగ విధ్వంసం, ప్రైవేటురంగ విస్తరణ పాలక వర్గాల విధానంగా ఉంది. ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్ పాఠశాల విద్యలో కొన్ని పాదార్థిక విషయాలను పరిశీలిద్దాం.

*(ఇంకా ఉంది)*

*(రచయిత కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ)* వీ

# దళితుల చరిత్ర - భౌగోళిక మూలాలు

*సకల సంపదలకు సృష్టికర్తలైన దళితుల చారిత్ర క మూలాలను తెలియజేస్తూ, వీరి చరిత్రను దళితేతరులు తెలుసుకోవలసిన అవసరాన్ని గుర్తు చేస్తున్నారు* **డా. కత్తి పద్మారావు**

చరిత్రలో అసమానతలకు గురైనవారు ముఖ్యంగా అస్పృశ్యులు. కొన్ని వేల సంవత్సరాలు అణచివేయబడిన అస్పృశ్య కులాలు అకారణంగా అస్పృశ్యతను అనుభవించారు. అకారణంగా ఎన్నో అవమానాలకు గురయ్యారు. నిర్లక్ష్యానికి గురయ్యారు. ఎన్నో నిందలు అనుభవించారు. దీనికి మూలాలు వెతుక్కొనే పనిలో ఇప్పుడు దళితులు కృషి చేస్తున్నారు. తమని తాము నిలబెట్టుకోవడం కోసమే కాక, భారతదేశ చరిత్ర, సంస్కృతి, ఆర్థిక, జీవన వ్యవస్థలను నిర్మించడంలో తమ పాత్రను ప్రమాణంగా నిరూపించుకోగలుగుతున్నారు. ముఖ్యంగా శ్రమకు జ్ఞానానికి ఉన్న సంబంధం గురించిన చర్చ కొనసాగిస్తున్నారు. ఉత్పత్తిలో భాగస్వామ్యం లేని కులాలు, ఉత్పత్తిలో భాగస్వామ్యం ఉన్న కులాల మూలాలు వెతుక్కున్నారు. జ్ఞానానికి, ఉత్పత్తికి అవినాభావ సంబంధం ఉంది. జ్ఞానం లేని ఉత్పత్తి జీవనాధారమైంది కాదు. శ్రమజీవి అయినవాడు తప్పక జ్ఞానవంతుడై ఉంటాడు. శ్రమజీవి కానివాడు, శ్రమ దోపిడీ కోసం ఆలోచిస్తాడు. ఇతరుల శ్రమ దోచుకునే వాడెవ్వడూ జ్ఞానవంతుడు కాలేడు. మరి జ్ఞానం లేనివాడు ఏమి కోరుకుంటాడు. ఆధిక్యాన్ని కోరుకుంటాడు. అభూతమైన కీర్తిని కోరుకుంటాడు. తనసుతాను కీర్తించుకుంటాడు. తన కీర్తనలకు నమూనా దేవుణ్ణి సృష్టించుకుంటాడు. ఆదేవుడికి ముందు మోకరిల్లుతాడు. తాను ఒక బానిసని ప్రకటించుకొంటాడు. కర్మవాదాన్ని ముందుకు తెస్తాడు. పూర్వజన్మ ఫలితం అంటాడు. దోపిడీకి మూలమైన 'అబద్ధాన్ని' సృష్టిస్తాడు. మనిషికి తనమీద నమ్మకం పోగొడతాడు. తన్ను తాను అవమానించుకుని ఇతరులకు దాసోహం అనే పరిస్థితులు తీసుకొస్తాడు. దీనంతటికీ అనంత సాహిత్యాన్ని సృష్టిస్తాడు. దాన్ని ముందు భాషిస్తాడు. తరువాత లిఖిస్తాడు. తరువాత ప్రపంచానికి ఒక చోధకునిగా 'అసత్యాన్ని' చాటింపువేస్తాడు.

**దళితుల చరిత్ర అంటే ఏమిటి?**

దళితుల చరిత్ర అనగానే ఈ అబద్ధాన్ని 'అబద్ధం'గా నిరూపించి, సత్య నిర్ధారణ కోసం చేసే ప్రయత్నమే దళితుల చరిత్ర. దళితుల చరిత్రంటే అణగదొక్కబడిన వారి చరిత్ర. వారు సంపదను కోల్పోయిన చరిత్ర, వారు హక్కులను కోల్పోయిన చరిత్ర, వాళ్లు హింసించబడిన చరిత్ర, వాళ్లు తిరిగి పోరాడిన చరిత్ర, అసలు భారతదేశ చరిత్రంటే తప్పక అది దళితుల చరిత్రే. దళితులు లేని ఊరు లేదు. దళితులు సృష్టించని ఉత్పత్తి పరికరాలు లేవు. దళితులు పేర్లు పెట్టని వృక్షాలు, జంతువులు, గృహ పరికరాలు భారత దేశంలో లేవు. దళితులు అన్ని శాస్త్రాలను సృష్టించారు. దళితుల గురించి దళితులే తెలుసుకోవడం కాదు. దళితేతరులు కూడా తెలుసుకోవలసి ఉంది.

దళితులది అపారమైన సృష్టి, కొలవలేని సహనం, వెలగట్టలేని శ్రమ. పేర్కొనలేని అణచివేత, నిర్ధారణ చేయలేని అపహాస్యత. అంతులేని దీనగాథ. ఎంతో కన్నీరు, ఎంతో నెత్తురు, ఎంతో వ్యథ, ఎన్నో యుద్ధాలు, ఎందరో మృతులు, ఎందరో తిరిగి లేచినవారు భారతదేశంలోని ప్రతి చెట్టు, ప్రతి కొండ వీరి గాథల్ని మౌనంగా చూశాయి. మౌనంగా రోధించాయి. ఇప్పుడు నోరు తెరుస్తున్నాయి. ప్రతి చెట్టు దళితుల కథను తన ఆకుల మీద లిఖిస్తుంది. అనంత వేదనని అక్షరాల్లోకి ఇముడ్చుతుంది. సముద్రాంతరాలకు, ఖండాంతరాలకు వేదనలు, గాథలు మోసుకెళుతున్న బృహత్తర గాథా లహరియే దళితుల చరిత్ర.

నిజానికి చరిత్ర పరికరాలు కూడా రూపొందించిన వారు దళితులే. చరిత్ర పరికరాలు బౌద్ధయుగంలోనే ఎక్కువ ఆవిర్భవించాయి. బౌద్ధ నిర్మాణాలకు అవసరమైన శిల్పాలు, శాసనాలు, ధాతు పేటికలు ఇవన్నీ కొండల నుండి తొలిచింది దళితులే. ఈ కట్టడానికి కావాల్సిన ముక్కలను కొండల నుండి విడదీసేవారిని 'పాషాణికులు' అంటారు. 'పాసానిక' అనే శబ్దం అమరావతికి చెందిన ప్రాకృత శాసనాల్లో క్రీ.పూ. రెండవ శతాబ్దిలో దొరికినట్లు ఆచార్య ఈమని శివనాగిరెడ్డి పేర్కొంటున్నారు. ఈ శాసనంలో చందుడనే ఒక పాషాణకుని మామ, అమరావతి స్థూప నిర్మాణ సమయంలో ఒక కట్టడ భాగాన్ని దానం చేసినట్లుగా చెప్పబడింది. అయితే ఈ పాషాణికులు దళితులే అని స్పష్టం అవుతోంది. 'అమరావతి స్థూపం చుట్టూ నిర్మించిన వేదికకు ఉపయోగించిన పెద్ద సైజు స్థంభాలను, అడ్డు పట్టీలపై గల ఉష్ణీష భాగాలను గ్రానైటు రాళ్లపై మలచి, నిర్మాణ స్థలానికి రవాణా చేసింది కూడా పాషాణికులే. లభ్యతను బట్టి స్థూపాలకు, చైత్యాలకు, శిలామండపాలకు బుద్ధ ప్రతిమలకు తెల్లసున్నపు రాతిని వాడారు. ఇలా రకరకాల రాళ్ల లక్షణాలను తెలుసుకుని వాటిని సేకరించి శిల్పులకు అందించడంలో పాషాణికులు నిపుణులు". నిజానికి శిల్పులుగా రూపొందిన దళితులు సున్నిత హృదయులు. ఎండకు, వానకు, చలికి రాళ్లలో నివశించి వారు నల్లబడ్డారు. వాళ్లను 'కృష్ణ' వర్ణులని ద్వేషించారు. అంతఃపురాల్లో వున్న రాణులెందరో వీరి శిల్ప కళా నైపుణ్యానికి ముగ్ధులై వీరిని ప్రేమించిన ఘట్టాలున్నాయి. శిల్పాలు చెక్కడం అయిపోయాక వారి చేతులు నరికించిన కర్కశమైన చక్రవర్తులున్నారు. అయితే దళితులు తమ చరిత్ర నిర్మాణాన్ని ఏ సందర్భంలోను ఆపలేదు. అనేక అణచివేతలను ఎదుర్కొని భారత ఉపఖండంలోని శిల్ప సంపదను సృష్టించాడు.

**చరిత్ర నిర్మాణకర్తలు దళితులే**

శిలా శాసనాలు, తామ్ర శాసనాలు చెక్కిందంతా దళితులే. అయితే చరిత్ర నిర్మాణంలో వీరి నామవాచకాలను చెరిపివేశారు. రాళ్లలో ఉన్న అనేక తేడాలను వీరే కనిపెట్టారు. అమరావతిలోని వడ్డమాను స్థూపాలకు గ్రానైటును వాడారు. ప్రకాశం జిల్లాలోని చందవరం దూపాడు స్థూపాల శిలా ఫలకాలకు సున్నపు రాతితో పాటు స్థానికంగా లభించే పలక

రాతిని వాడారు. విశాఖపట్టణం జిల్లాలోని బావికొండ, తోట్లకొండ, పావురాళ్లకొండ, బొజ్జన్నకొండ, శ్రీకాకుళం జిల్లాల్లోని శాలిహుండం, రామతీర్థం మొదలైనచోట్ల కొండల నుండి తొలచిన రాతినే పాషాణులుగా చెప్పబడుతున్న దళితులు శిలలకు వాడారని ఈమని శివనాగిరెడ్డిగారు చెబుతున్నారు.

భారతదేశం భౌగోళిక రూపంలో కొండలు, లోయలు, అడవులు చాలా ప్రధానమైనవి. నాటి మూలాలను తెలుసుకుని జన జీవనానికి వాటిని ఉపయుక్తం చేయడం అనేది చిన్న విషయం కాదు. ఒక్కొక్క ఉత్పత్తి పరికరాన్ని కనుక్కోవడానికి వీరు ఆ వస్తు స్వభావాన్ని లోనికి వెళ్లి తెలుసుకోవడానికి ఎంతో కృషి, ఎన్నో త్యాగాలు, ఎంతో విజ్ఞాన సంపత్తిని ఉపయుక్తం చేశారు. ఈ అన్వేషణలో మనుష్యులే కాదు. కొన్ని మానవదాతులు అంతరించాయి కూడా. మానవులు తమ ఉనికిని, నిర్మాణాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేకపోయినట్లయితే చాలా నష్టం జరిగే ప్రమాదముంది. అందుకే దళితులు తమ ఉనికిని తాము తెలుసుకో వలసిన అత్యవసర స్థితి ముందుకు వచ్చింది. దళితులు భారతదేశంలోను హిమాలయ పర్వతాల్లోను, దక్షిణాపదంలోను, తూర్పు పడమటి కనుమల తీరభూముల్లోను విస్తరించి ఉండడం వల్ల భారత ఉపఖండం మొత్తం వీరు పంచుకొని ఉన్నట్లు మనకు అర్థమౌతుంది. భారతదేశంలో అతిముఖ్యమైన పర్వతాలు హిమాలయ పర్వతాలు. భారతదేశానికి పెట్టని కోటగా నిలబడి వున్నాయి. కాశ్మీరం, సివాలిక్, తెహరిఘర్వాల్, కుమాన్, నేపాల్, సిక్కిం, బూటాన్ లందు విస్తరించియున్న హిమాలయ పర్వత పంక్తి పొడవు 2400 కిలోమీటర్లు. వెడల్పు 240 కిలోమీటర్ల నుండి 320 కిలోమీటర్లు. ఈ పర్వత పంక్తులందున్నతమైన 40 శిఖరములున్నవి.

హిమాలయ పర్వతములు కామ రూపము అనగా అస్సాం నుండి కాశ్మీరమువరకు వ్యాపించియున్నవి. త్రివిష్టవము లేక టిబెట్టు నుండిగాని, భారత ద్వీప కల్పము నుండి గాని ఏర్పడిన భూమ్యుపరితల పీడనము వలన హిమాలయ పర్వతము లేర్పడియుండును. ఇవి ఒకే పర్వత శ్రేణిగను, పంక్తిగను కనిపింపవు. వేర్వేరు సమానాంతరములుగ, ఏకోన్ముఖములుగ, విశాలమైన లోయలుగ, పీఠభూభాగములుగనివి అచట గోచరించును. హిమాలయములందున్న చిన్న పర్వతముల నిడిని 160 కిలోమీటర్ల నుండి 400 కిలోమీటర్ల వరకుండును. అందు మధ్యనున్న ఘన హిమాలయములు 2400 కిలోమీటర్ల పొడవున వ్యాపించి యున్నవి. మధ్య ఆసియాలోని హిందూకుష్, కారకోరం, కార్థార్, సులేమాన్, కున్‌లున్, టిన్‌షాన్, ట్రాన్స్ ఆలమ్ పర్వతములతో హిమాలయ పర్వతములను పామియర్ పీఠభూమి కలుపుచున్నది.

**దళితుల భౌగోళికత**

సింధునది జన్మ స్థలము నుండి బ్రహ్మపుత్రా నది వరకు పర్వత పంక్తులు ఆగ్నేయ, వాయవ్య దిశలందు వ్యాపించి, కాశ్మీరు, కామరూప దేశముల మధ్య విస్తరించి యున్నవి. నంగ పర్వతం 28,630 అడుగుల ఎత్తుగలది ఇచట సింధునది అత్యంత వేగముగా ప్రవహించి పర్వతమును ఢీకొని, ఆగి, సొరంగము నేర్పరచి ముందుకు సాగుచున్నది. హిమాలయాల ప్రాధాన్యం అర్థం చేసుకుంటే భారతదేశంలో మూలవాసుల ప్రాధాన్యత కూడా అర్థమౌతుంది. అసలు ఆఫ్ఘనిస్తాన్ మధ్య ఆసియాల గుండా అనేక జాతులు ఇక్కడ వచ్చాయి అంటే అది మూలవాసుల విస్తృత భావన వల్లే జరిగింది. ఈ ద్వీపకల్పం భారత భౌగోళిక ప్రాధాన్యం గురించి చెప్తూ రొమిల్లాథాపర్ ఇలా విశ్లేషించారు..

"భౌగోళికంగా భారత ఉపఖండం ఉత్తరాది పర్వతాలన్నీ, గంగా సింధు నదీ పరీవాహక ప్రాంతమనీ, ద్వీప కల్పమనీ మూడు పెద్ద భూభాగాలుగా విభజించబడింది. పూర్వకాలంలో ఉత్తరాది పర్వత సముదాయం ఆసియాకు, ఉత్తర భారతదేశానికీ మధ్య సంబంధ బాంధవ్యాలకు ఒక పెద్ద అవరోధంగా పేర్కొనబడింది కాని ఆ పర్వతాలు నిజంగా అవరోధాలు కావు. భారత ఉపఖండంలోని వాయవ్య ప్రాంతం, మధ్య పశ్చిమ ఆసియా ప్రజలతో నిరంతరమైన బాంధవ్యం కలిగి ఉంది. వాయవ్య సరిహద్దున ఉన్న కనుమల ద్వారా విభిన్న సంస్కృతుల పరిచయం, సమ్మేళనం జరుగుతూనే వచ్చింది.

ఉత్తర భారత భూభాగానికి వాయవ్య దిక్కున హిందూకుష్, సులేమాన్, కిర్థార్ పర్వత శ్రేణులు, ఉత్తరాన ఈశాన్యంలో హిమాలయాలూ సరిహద్దులుగా ఉన్నాయి. హిందూకుష్ పర్వతాలు నదీపరీవాహక ప్రాంతాల మధ్య స్థలం ఎత్తైన ప్రదేశమైన 'ఆక్సస్' సింధులోయల మధ్య భౌగోళిక సంపర్కం కలగచేస్తాయి. ఈ దృక్పథంతో చూస్తే హిందూకుష్ పర్వతశ్రేణి ఒకప్పుడు తలచినట్లు మధ్య ఆసియాతో సంబంధం లేకుండా చేసి అవరోధంగా నిలచినదనే భావన సరియైనది కాదని అర్థమౌతుంది. వాయవ్య సరిహద్దున ఉన్న కనుమలు నీరు లేకపోయినా అతి తక్కువ హిమపాతం పడటం వలన ఎక్కువ వాడుకలోకి వచ్చాయి. ఆ కనుమలే కైబర్, బోలాన్, గోమాన్‌లు. హుంజా, ఎగువ సింధులోయలవలె సారవంతమైన స్వాట్ లోయ కూడా మరో రహదారిలా పనిచేసింది. అప్ఘనిస్థాన్‌ను అజమాయిషి చేయటానికి బ్రిటిష్ కాలంలో 19వ శతాబ్దంలో రష్యన్ చొరబాటును నిరోధించడానికి, కైబర్ కనుమ కీలకపాత్ర నిర్వహించడం చేత చరిత్రలో గుర్తించబడి సాహిత్యంలో ముఖ్య స్థానం సంపాదించింది. తొలి యుగాలలో బోలన్ కనుమ ప్రముఖ పాత్ర నిర్వహించింది. ఆ కనుమ ద్వారా ఆఫ్ఘనిస్థాన్ సయస్థాన్ ప్రాంతానికి, హెల్మండ్ లోయలోకి ప్రవేశించి, ఈశాన్య ఇరాన్‌లోకి ప్రవేశించే అవకాశం కలిగింది. మేసిడోనియా పాలకుడైన అలగ్జాండర్‌కు స్వాట్ లోయతో సంబంధం ఉండటం చేత ఇది ఆధునిక చరిత్రలో ఒక ఆకర్షణీయమైన అంశంగా రూపొందింది. (భారతదేశ చరిత్ర క్రీ.శ.1300 వరకు, రొమిలా థాపర్, పేజీ నెం.64) ఆఫ్ఘనిస్థాన్ మధ్య ఆసియాలకు వెళ్లి అక్కడ నుండి వచ్చే పశుపోషకులు ఈ కనుమల ద్వారా తరచు ప్రయాణం చేశారు. ఈ ప్రాకృతికమైన అంశాలన్ని మనం పరిశీలించి నప్పుడు ఆది భారతీయులు భారతదేశ నిర్మాణానికి ఎంత కృషి చేశారో మనకు అర్థమైంది. అదే కాలంలో వింధ్య పర్వతాలకు నర్మదా నదికి మధ్య ఉన్నటువంటి దక్షిణంగా ఉన్నటు వంటి పీఠ భూమిలో కూడా దళితులు పెద్ద ఎత్తున సమాజాన్ని నిర్మించాయి. ప్రాచీన భారతంలో జనావాసాల జీవనాన్ని మనం లోతుగా పరిశీలిస్తే ఆ రోజుకు ఈ రోజుకి కూడా మూలవాసులు భారతదేశ ప్రాకృతిక జీవన విధానానికి వాళ్లు అలవాటుపడి ఉన్నారని మనకు అర్థమౌతుంది. భారతదేశ భౌగోళిక స్థితిలో కొండలకు నదులకు చాలా అనుబంధం ఉంది. కొండను ఎక్కగలిగి, నదిని ఈదగలిగిన వాళ్లే ఈ దేశాన్ని మొదట నిర్మించారని మనకు స్పష్టమౌతుంది. అంతేకాక ఈ కొండలు ఎత్తైనవి, నదులు అనంత ప్రవాహం కలిగినవి. ఈ రోజుకు బ్రాహ్మణులు కొండను ఎక్కలేరు. నదులు ఈదలేరు. నదులు ఈదగలిగినవారు, కొండల్ని ఎక్కగలిగిన వారిదే ఈ దేశం అంటే శూద్రులు అతిశూద్రులే మిగులుతారు. ఒకసారి కొండల నదుల అనుసంధాన్ని గురించి చూద్దాం..

ఘన హిమాలయములు ఎత్తైన శిఖరములుగలవి. వీటి సరాసరి

ఎత్తు 20 వేల అడుగులు - ఎవరెస్టు శిఖరం-29028 అడుగులు; నంగ పర్వతము-28630 అడుగులు; కాంచనగంగ-28150 అడుగులు; నందాదేవి ధవళగిరి-26820 అడుగులు

టిబెట్టు హిమాలయములు 40 కిలోమీటర్ల వెడల్పున వ్యాపించి ఉన్నవి. ఇందు లోయలు నదులు, ఎత్తు పల్లములు కనిపించును. ఇవి 12000 నుండి 14000 అడుగుల ఎత్తులో నున్నవి. సర్ సిడ్నీ బురార్డ్ అను శాస్త్రజ్ఞుడు హిమాలయములను నాలుగు భాగములుగ విభజించెను. అవి: 1) సింధునది నుండి సట్లేజ్ నది వరకు వ్యాపించిన పర్వతములు పంజాబు హిమాలయములు. వీటి నిడివి 560 కిలోమీటర్లు. 2) సట్లేజ్ నది నుండి కాళీ వరకు విస్తరించియున్న పర్వతములు కామోన్ హిమాలయములు. వీటి పొడవు 320 కిలోమీటర్లు. 3) కాళీ నుండి తీస్టావరకు వ్యాపించిన పర్వతములు నేపాల్ హిమాలయములు. ఈ పర్వతపంక్తుల నిడివి 960 కిలోమీటర్లు. 4) తీస్టా నుండి బ్రహ్మపుత్రానది పర్యంతం వ్యాప్తమైన పర్వతములు అస్సాం హిమాలయములు ఇవి 720 కిలోమీటర్ల నిడివి కలవి. అస్సాం హిమాలయములందు హిమరేఖ 14500 అడుగులున్నది. కాశ్మీర్ హిమాలయమున గల హిమరేఖ 7000 నుండి 19000 అడుగులున్నది. హిమ నదులు ఎత్తైన పర్వత శిఖరములందుద్భవించును. ఈ పర్వత శిఖరములందు జనించిన హిమ నదులలో ముఖ్యమైనది 72 కిలో మీటర్ల పొడవుండును. ట్రాన్స్ ఆలమ్ హిమనది 77 కిలోమీటర్ల పొడవు, 18000 అడుగుల వెడల్పు కలిగియున్నది. (భారతదేశ చరిత్ర - సంస్కృతి (మొదటి భాగం) వేదయుగము, బి.ఎస్.శాస్త్రి, ఎం.ఏ., పేజీ నెం.9,10)

సింధూ, సట్లజ్, బ్రహ్మపుత్ర నదులన్నీ కూడా కొండల నుండి పుట్టినవి. భారతదేశానికి కొండలు పెట్టని కోటలు. సౌందర్యవంతమైనవి కూడా. నదీ కొండ కలిస్తేనే జీవించటానికి ఒక సాంస్కృతిక పునాది ఏర్పడుతుంది. కొండని ఎక్కలేనివాడు, నదిని ఈదలేనివాడు పర్వతాల్ని దృశ్యాలుగా మాత్రమే చూస్తాడు. నదీ కొండ ఉన్న దగ్గర చెట్లు ఉంటాయి. చెట్లు ఉన్న దగ్గర జంతువులు ఉంటాయి. జంతువుల్ని మచ్చిక చేయగలిగే సామర్థ్యం ఉన్నవాళ్లే భారతదేశ ఆదిమ జాతులు. ఈ విషయాన్ని చర్చిస్తూ కొశాంబి తన యాన్ ఇంట్రడక్షన్ టు ది ఇండియన్ హిస్టరీ అనే గ్రంథంలో ఇలా విశ్లేషించారు..

### జంతువులను మచ్చిక చేయగల సామర్థ్యం

రెండు భిన్నమైన ఆకారాల ద్వారా ఇదంతా తెలుస్తోంది. మొదటిది ఇవాళ్టికి కూడా దేశవ్యాప్తంగా చూడగలిగిన గిరిజన సంఘీభావం వల్ల గానీ, ఉమ్మడి క్రతువుల వల్ల గానీ మొండిగా ఆహార సేకరణ దశలోనే ఉండిపోయాయి. ఆక్రమించని భూమి, పశు పక్ష్యాదులు, సహజ ఉత్పత్తుల కొరత పెరిగిపోయినప్పుడు వారు అభివృద్ధి చెందిన ప్రాంతాలకు వలస వెళ్లడానికి నెట్టబడతారు. అక్కడ వారు సాధారణంగా భిక్షాటన ద్వారా, లేదా ఏరుకోవడం ద్వారానో ఆహార సేకరణలో కొనసాగుతారు. ఈ గిరిజనుల ఆచారాలను చూస్తే వారికి అంతకు ముందు ఇతర ఆహార సేకరణ పద్ధతులు ఉండేవని అర్థమవుతుంది. వారు సాధారణంగా పశు పక్ష్యాదులను వేటాడేవారు. ఉచ్చులువేసి పట్టేవారు. లేదా అడవిలో దొరికేవి ఏరుకునేవారు. ఆకలికి తాళలేక కొద్దికాలం వ్యవసాయ పనుల్లోనో, ఇతర శ్రమల్లోనో ఉన్నప్పుడు మినహా సాధారణంగా ఈ ప్రజలు వాడడానికి పనిముట్లు ఉండనైనా ఉండవు, లేదా అతి సులభంగానైనా ఉంటాయి. ఈ పనిముట్లు ఇప్పుడైతే ఇనుమువో, ఉక్కువో అయినందువల్ల వాడేవాళ్లు తమ పనిముట్లను తామే ఉత్పత్తి చేసుకోలేదని స్పష్టమే. వారి జీవన విధానంలో మౌలిక మార్పు ఏదీ రాకుండా గతంలో కూడా ఇవి వాళ్లు ఉత్పత్తి చేసుకోగలిగి ఉండేవాళ్లు కాదు. వాళ్ల చుట్టూ కమ్ముకొస్తున్న ఆధునిక, ఇతోధిక పురోగతి సాధించిన సమాజమే వాళ్లకు లోహాన్నీ, పనిముట్టునూ అందించింది. ఈ దశలో మనకు ఉన్న రెండో సమాచార వనరు-పురాతత్వ శాస్త్రం గతాన్ని తవ్వుతూ పోతే మనం అసలు లోహపు పనిముట్లే లేని ఒక పొరకు చేరుతామని చెపుతుంది. అయినా, లోహయుగపు పొరలకు కింద కూడా మనుషులు రాతి పనిముట్లను వాడారని చూపేందుకు ప్రాచీన పనిముట్ల నిక్షేపాలు కనబడు తున్నాయి. గోకే పనిముట్లను తవ్వే పనిముట్లు, చేతి గొడ్డళ్లు, చురకత్తుల లాంటి రాతిపలకలు, బాణాల కొనలు, ఎందుకు ఉపయోగించారో తెలియని చిన్న చిన్న రాతి పనిముట్లు ఇవన్నీ కూడా నిస్సందేహంగా మానవ హస్తాల సృష్టే, ఈ పనిముట్లు అదనంగా కలపను కూడా వాడేవారని చూపుతాయి. ఉదాహరణకు, బాణం కొనలు గానీ, చిన్న చిన్న రాతి ముక్కలు గాని ఒక చెక్క పిడికి అతికించినవో, కొడవలికి అతికించినవో అయి ఉంటాయి. ఇతర పనిముట్లు రాళ్లను విసరడానికి తయారు చేసిన సంక్లిష్ట యంత్రంలోనో, చెక్కపలక మీద బంకతో అతికేసినవో అయి ఉంటాయి. ఈ పురాతత్వ పొరలను కచ్చితంగా ఏ కాలానికి చెందినవో నిర్ధారించడం సాధ్యం కాదు. కాని, పొరలన్నీ కలిపి చూసినప్పుడు ఒక కాలక్రమ వరుసను నిర్దిష్టంగా చెప్పవచ్చు. అలాగే వేరు వేరు చోట్ల అటువంటి పనిముట్లే దొరికితే వాటిని కలిపి చదవడం కూడా పూర్వచరిత్ర అధ్యయనంలో ఒక మౌలిక పద్ధతి. ఈ రెండు పద్ధతులను పురాతత్వ శాస్త్రం భూగర్భ శాస్త్రం నుంచి తీసుకుంది." (భారత చరిత్ర అధ్యయనానికి ఒక పరిచయం, పేజీ నెం.56)

### చరిత్ర - ఉత్పత్తి పరికరాలు

భారతదేశ చరిత్రను ఉత్పత్తి పరికరాల నుంచి కాని మనం విశ్లేషణ చేయగలిగితే భారతదేశానికి కొత్త చరిత్ర ఏర్పడుతుంది. పాతరాతియుగం, కొత్తరాతియుగానికి సంబంధించిన వారసులే సింధూ నాగరికత నిర్మాతలనేది మనకు స్పష్టమవుతుంది. సంస్కృతేతర భాష, సాహిత్యం ఉపకరణాల నుంచే ఈ చరిత్రను మనం నిర్మించాల్సి ఉంటుంది. ఇనుప పనిముట్లను రూపొందించటంలో బ్రాహ్మణులకు ఎటువంటి ప్రమేయం లేదు. నిప్పుల్లో మాంసం కాల్చినవాడే, నిప్పుల్లో ఇనుమును కూడా కాల్చాడు. నిప్పు మానవ సమాజ పరిణామానికి కీలకమైన మలుపు తీసుకువచ్చింది. ఇప్పటికీ గిరిజనులు నిప్పును సామాజిక, శాస్త్రీయ, సాంకేతిక పరికరంగానే చూస్తారు. నిప్పును ఒక దేవతగా కొనియాడే బ్రాహ్మణులకు నిప్పుతో కొలిమిని రూపొందించటం కాని, కొలిమిలో ఇనుప వస్తువులు తయారుచేయటం గురించి కాని వారికి తెలీదు. మొదట భారతదేశపు మూలవాసులు ఉత్పత్తి పరికరాలను కనిపెట్టారు. అవే కాలక్రమంలో చారిత్రక, నిర్ధారిత పరికరాలయ్యాయి. చారిత్రక యుగంగా చెప్పబడుతున్న అశోకుడు వచ్చేవరకు మూలవాసులు రూపొందించిన ఇనుప పరికరాలను బ్రాహ్మణులు చరిత్ర పరికరాలుగా వాటిని లెక్కించలేదు. కోశాంబి, రొమిల్లా థాపర్, దేవీప్రసాద్‌ఛటోపాధ్యాయ దీనికి భిన్నంగా వ్యవహరించారు. ఉత్పత్తి పరికరాల్లో ప్రధానమైంది గొడ్డలి. గొడ్డలి వచ్చిన తర్వాత అడవులను నరకటం ద్వారా నూత్న సామాజిక రూపాలు ఏర్పడ్డాయి. ఉత్పత్తి పరికరాలు ఒక్కోదానికి ఒక్కో చరిత్ర ఉంది. అశోకుడు రూపొందించిన శిల్పాలు అన్నింటికి ఉలి మూలం. మరి ఉలి గురించి చరిత్రలో ప్రాధాన్యత తక్కువగా ఉంది. అంటే ఒక గొడ్డలి ఒక నూత్న సమాజాన్ని రూపొందించింది. ఒక ఉలి

ఒక నూత్న సాంస్కృతిక వ్యవస్థను రూపొందించింది. ఇటు మూలాల్లోకి వెళ్లకుండా భారతదేశ చరిత్రలో చూస్తే ముఖ్యంగా గిరిజనుల, దళితుల చరిత్ర బయటకు రావటం కష్టం. ఇప్పటివరకు బ్రాహ్మణవాద దృక్పథం తోనే చరిత్ర ఎక్కువగా నడుస్తుండటం వల్ల సింధూ నాగరికతలో రూపొందిన ఇటుక గురించి కూడా ఎక్కువ చర్చ జరగలేదు. ఇటుక ఎలా ఏర్పడుతుంది? నిప్పుతో మట్టిని కాల్చాలి. అప్పటికీ దళితులు నిప్పుతో మట్టిని కాల్చి భవనాలకు రాళ్లను అందిస్తున్నారు. సింధూ నగరం ఎలా ఏర్పడిందో దాని పరికరాలు ఏమిటో, ఆ పరికరాలు రూపొందించినవారు ఎవరు అని చరిత్రకారులు సామాజిక మూలాలను చూడలేదు. అందుకనే మూలవాసుల చరిత్రకు ముసుగు వేయబడింది. రొమిల్లాథాపర్ తన భారతదేశ చరిత్రలో ఈ చర్చను ఇలా సాగించింది. “ఇప్పటికీ భారతదేశంలో అనేక స్థాయిలకు చెందిన సమాజాలున్నాయి. అందులో కొన్ని పాతరాతియుగపు నాగరికతా ఛాయలను గుర్తుకు తెస్తాయి. ఈ ‘సజీవప్రాక్ చరిత్ర’ సాంస్కృతిక లక్షణాల కొనసాగింపును వక్కాణిస్తుంది. జాతి పురావస్తు శాస్త్రం, మానవవర్గ అధ్యయన శాస్త్రం అందించే ఆలోచనలు, మానవ ఆవాసాల తవ్వకాల సమాచారాన్ని సరిపోల్చే ప్రయత్నాలు చేస్తున్నాయి. ఈ సరిపోల్చడం ఫలితంగా కొన్ని సందేహాలు తలెత్తవచ్చు. కాని అటువంటి అధ్యయనాల ఉపయోగం – ఉదాహరణకు సామాజిక వ్యవస్థీకరణ రూపాలు లేదా కళాకృతుల ప్రయోజనాలు – అడిగే ప్రశ్నల బట్టి ఉంటుంది. సాంస్కృతిక లక్షణాల కొనసాగింపు కనిపించిన ప్రాంతాల్లో, ఈ పద్ధతులు, గ్రంథస్థ అధ్యయనం లో కలసి క్షేత్రీయ కార్యక్రమానికి ఎంతో సహాయపడ్డాయని నిరూపిస్తాయి. ఈ పద్ధతి ప్రధానంగా భారతదేశ మత అధ్యయన విషయంలో ఉపయుక్తంగా ఉంటుందని సముచితమైన వాదన ఉంది. క్షేత్రీయ కార్యక్రమం లిఖిత సమాచారాన్ని బాగా ఆకలింపు చేసుకోవటానికి కావలసిన అంతర్ దృష్టిని పెంపొందిస్తుంది. ముఖ్యంగా అధిక సంఖ్యాకులు ఛాందస తత్వానికి, ధర్మశాస్త్రాలకంటే క్రతుకాండ నిర్వహణకూ మాత్రమే ప్రాధాన్యమిచ్చే సమాజాలలో క్రతుకాండ నిర్వహణ లో చోటు చేసుకున్న మార్పులు, చరిత్ర గతిలో వచ్చిన మార్పులను మిళితం చేసుకుంటాయి. అప్పుడు గ్రంథస్థ ఆధారమైన మత అధ్యయన ప్రక్రియను వివిధ మతాచారాల ఆచరణలు తులనాత్మక అధ్యయనపు అనుబంధంగా చేరుస్తున్నారు. గత అర్థ శతాబ్దంలో పురావస్తు శాస్త్రజ్ఞుల తవ్వకాల్లో క్రీ.పూ. మొదటి, రెండవ సహస్రాబ్దులకు చెందిన గణాత్మకమై, విస్తారమైన, ఉత్తేజకరమైన సాక్ష్యాధారాలు దొరికాయి. వాయవ్యదిశలో విలసిల్లిన మొదటి పట్టణ నాగరికత పతనానంతరం ఏర్పడిన జనావాసాలు ఎక్కడున్నవో గుర్తించడానికి అవకాశం కల్గింది. ఇలా దానిని అనుసరించిన సంస్కృతుల జాడలు తెలుసుకోవచ్చు. ఈ సంస్కృతులు అంతకు ముందున్న సంస్కృతులకు కొనసాగింపా అనే ప్రశ్న వస్తుంది. అయితే అనంతర సంస్కృతుల స్వభావాన్ని గుర్తించడం కూడా అంతే ముఖ్యమైంది. గంగా మైదానంలోను, మధ్య భారతదేశం లోను దాని అంచుల్లోనూ, మొదటి మధ్య సహస్రాబ్దిలో రెండవ పట్టణ నాగరీకరణ జరిగినట్లు పూర్వగామి జనావాసాలు సాక్ష్యమిచ్చాయి.” (రొమిల్లా థాపర్ భారతదేశ చరిత్ర, క్రీ.శ. 1300 వరకు, పేజీ నెం–5)

### చరిత్ర – సామాజిక శాస్త్రం

చరిత్ర సామాజిక శాస్త్రంతోనూ, మానవ పరిణామ శాస్త్రంతోను, మానవ శారీరక నిర్మాణ శాస్త్రంతోను సమన్వయించినప్పుడే ప్రపంచవ్యాప్తంగా మూలవాసుల చరిత్ర మనముందుకు వస్తుంది. కల్చరల్ యాంత్రోపాలజీలో ద యూనివర్సల్స్ ఇన్ ద కల్చర్ విభాగంలో మెల్‌విలీ జె.హర్స్‌కోవిట్స్ ఇలా విశ్లేషిస్తున్నారు.

భారతదేశ చరిత్రను సామాజిక, సాంస్కృతిక, తాత్విక, భాషా చారిత్రక, మానవ పరిణామవాద పద్ధతిలో రాయవలసిన అవసరం ఉంది. అప్పుడు మూలజాతుల పునాదులు మనకు అర్థమవుతాయి. భారతదేశచరిత్ర ఇప్పటివరకు రాయబడిన దానిలో ఎక్కువ సంస్కృత భాషా సాహిత్య ప్రభావమే ఉంది. దానికి కారణం యాంత్రోపాలజీ భారతదేశంలో ఎక్కువ అభివృద్ధి చెందకపోవడం. జంతువులను మచ్చిక చేసింది కానీ, దుస్తులను కనిపెట్టింది కానీ, లోహాలను కనిపెట్టింది కానీ మూలవాసులే. అయితే వీరిని చారిత్రక నిర్మాతలుగా ప్రకటించలేదు. ముఖ్యంగా చిన్న చిన్న రాళ్లను అంటే పెద్దరాళ్లను చెక్కినప్పుడు ఊడిన పెచ్చులను నునుపుగా చేసి చాకులుగా తయారుచేశారు. రాతి మొనను పదునుగా చెక్కి విల్లంబులకు, ఈటెలకు గుచ్చేవారు. మూలవాసులు తమ జీవనానికి నదీ తీరాన్ని ఎన్నుకున్నారు. ముఖ్యంగా సెలయేల్లు గట్టులను నివాసంగా చేసుకున్నారు. అందుకే భారతదేశంలో హిమాలయ ప్రాంతాల్లో కానీ, నర్మదా నదీ లోయలో కానీ ఎక్కడ వెతికినా మనకు రాతి మూలకాలే కనిపిస్తాయి. రాతి ఆయుధం తయారు చేయడం బ్రాహ్మణులకు రాదు. వాళ్లు రాతి బండను పచ్చడి నూరటానికే వాడతారు. యుద్ధానికి వాడలేరు. అయితే భారతదేశ చరిత్రకారులు బ్రాహ్మణులకు ముందటి సమాజాన్ని, అనాగరికులని, పురాతన మానవులని పేర్కొంటూ వారిని మూలవాసులుగా, చరిత్ర నిర్మాతలుగా పేర్కొనలేకపోయారు. నిజానికి మొదట దుస్తులు తయారుచేసింది కూడా దళితులే. వానాకాలంలో, చలికాలంలో, తాము వేటాడిన జంతువుల చర్మాలను చెట్టుకుండే బెరడును, విశాలమైన ఆకులను వంటికి చుట్టుకుని మొదటి శరీరాన్ని కప్పుకోవడం నేర్పింది దళితులే. ముఖ్యంగా దుప్పి చర్మం కప్పుకుంటే చలి రాదు అని తెలుసుకుని వాళ్లు దుప్పిచర్మాన్ని వలిచి వస్త్రంగా తయారుచేశారు. నిజానికి ఇప్పుడు పెద్దగా చెప్పుకుంటున్న కులాలేవీ అప్పుడు లేవు. వీళ్లందరు వ్యవసాయం వచ్చిన తర్వాత వచ్చిన కులాలవాళ్లే. అందుకే కమ్మ, రెడ్డి, కాపు, రాజు వంటి కులాలు మేము వ్యవసాయ కులాలు అని చెప్పుకుంటున్నాయి. క్రీ.శ. 7వ శతాబ్దం తర్వాత వ్యవసాయ కులాలు వచ్చాయి. అయితే కొత్త రాతియుగం, పాత రాతియుగం, మధ్యరాతియుగాలే కాక ఆద్య శిలా యుగ పనిముట్లు అన్నీ దళితులే తయారుచేశారు. జంతువులను వేటాడే దశ నుంచి జంతువులను మచ్చిక చేసుకునే దశను తీసుకు వచ్చింది దళితులే. ఎందుకంటే వేటాడితే జంతువును ఒకేసారి తినొచ్చు. కానీ దాన్ని నిలువరించి, దాని కట్టేసి పాలు పితికితే సంవత్సరాలు పాలు తాగవచ్చని జంతు మచ్చిక దశను సృష్టించారు. గేదె, ఆవు వంటి జంతువులన్నింటినీ మచ్చిక చేసుకున్న జంతువులే. అంతేకాకుండా కుక్కను మచ్చిక చేసి వీరు వేటాడటానికి తోడు తీసుకువెళ్లేవారు. అంతేకాకుండా ఈ జంతువులను మచ్చిక చేసుకున్న తర్వాత వాటిలో కొన్నింటిని ఎన్నిక చేసి మాంసానికి ఉపయోగించటం వల్ల వేటాడే అవసరం లేకుండా పోయింది. జంతు మచ్చిక వల్ల చాలా ప్రయోజనాలు వచ్చాయి. ఈ విషయం మీద చర్చిస్తూ రొమిల్లా థాపర్ తన తరతరాల భారతదేశ చరిత్రలో ఇలా విశ్లేషించారు. ఆదిమ మానవుడు సంచార జీవనం మాని స్థిర నివాసం ఏర్పరచుకుని తన ఆహారాన్ని తాను స్వయంగా పండించుకోవటం ప్రారంభించినప్పుడు చెట్లు కొట్టివేసి, దుబ్బులు తవ్వి నేలని వ్యవసాయ యోగ్యంగా చేసుకోవలసి వచ్చింది. అంతకుముందే కనిపెట్టబడ్డ రాతి పనిముట్లు, నిప్పు వ్యవసాయాభివృద్ధికి గొప్పగా

# మార్క్సిజాన్ని నేర్చుకుందాం

***ప్రస్తుతం సమాజంలో ఉన్న ఆకలి, పీడన, దారిద్ర్యాన్ని రూపుమాపడానికి ఇప్పుడున్న సిద్ధాంతాలేవి పనికిరావనీ, వ్యవస్థను మార్చి సమసమాజాన్ని స్థాపించడానికి మార్క్సిజాన్ని నేర్చుకోవాలనీ అంటున్నారు*** **చంద్ర వెంకటేశ్వర రావు**

**భూ**గోళంపై మొదటగా శ్రామిక శక్తి జెండా ఎగిరిన 1871 నాటి పారిస్ తిరుగుబాటు కార్మిక వర్గం కదన రంగానికి సమర్థులేనని నిరూపించింది. తదుపరి అక్టోబర్ విప్లవ విజయం భూగోళంపై ఆకలీ, పీడనా, దారిద్ర్యాన్నీ రూపుమాపి మానవ సమానతా సమాజాన్ని స్థాపించవచ్చని మరోసారి రుజువు పరిచింది. ఆ బోల్షివిక్ విప్లవాన్ని నడిపించిన, ఆచరణ నాయకత్వానికే కాక శ్రామిక వర్గానికి కూడా అందాలి. ప్రస్తుత నాయకత్వం శ్రామిక వర్గానికి ఆ మార్క్సిజాన్ని అందించి, లెనినిజాన్ని అందించాలి, బోధించాలి, నేర్పించాలి. అలా సిద్ధాంతం వెంట నడిపించాలి. అప్పుడు మాత్రమే మార్క్సిజం లెనినిజం వెలుగులో శ్రామిక వర్గ పోరాటాలు ముందుకు పోతాయి. అందుకే మార్క్సిజాన్ని నేర్చుకుందాం.

మార్క్సిజం ప్రాపంచిక దృక్పథం. అనేక రకాల శ్రామిక సమూహాల జీవన సారంలోంచి ఆవిర్భవించిన శ్రామిక వర్గ సిద్ధాంతం. మిర్క్సిస్టు సిద్ధాంతం భావవాదానానికి, వ్యతిరేకంగా, పూర్తిగా భౌతికవాద దృక్పథంపై ఆధారపడి రూపొందించబడిన సిద్ధాంతం. మార్క్స మహాశయుడు నిరంతర అధ్యయన శీలి. రోజుకు దాదాపు పద్దెనిమిది గంటలు అధ్యయనానికి కేటాయించి విస్తృత శోధన, పరిశోధన చేసి చరిత్రని, వర్తమానాన్ని భౌతికవాద దృక్పథంలో పరిశీలించి మార్క్సిజం ద్వారా ప్రపంచ శ్రామికులకు వెలుగుబాట పరిచాడు. మార్క్స తన సహచర మహోపాధ్యాయుడు ఏంగెల్స్‌తో కలిసి జర్మన్ ఐడియాలజీపై విస్తృతమైన అధ్యయనం చేశాడు. వారి ఇరువురి స్నేహ పూర్వకమైన నేపథ్యం, సిద్ధాంత రూపకల్పన, జీవితాచరణ ప్రపంచానికే ఆదర్శవంతమైనది.

మార్క్స తన కంటే ముందరి జర్మన్ తత్వవేత్తల సిద్ధాంతాలని శ్రద్ధగా అధ్యయనం చేశాడు. 18, 19 శతాబ్దాలు జర్మన్ తత్వశాస్త్రం ప్రపంచాన్ని ఏలిన కాలం. ఆ కాలంలో మార్క్స (1818-1883) హెగెల్ (జర్మన్ భావవాద తత్వవేత్త) రచనలపై దృష్టి పెట్టాడు. హెగెల్ తాత్విక దృక్పథం ప్రస్తుత ప్రపంచ పోకడలకు అనుకూలంగా లేకపోవడం గమనించాడు. హెగెల్ భావవాద సిద్ధాంతానికి అప్పటి భౌతిక ప్రపంచ ఆచరణకు జోడి కుదరకపోవడాన్ని మార్క్స మౌలికమైన అంశంగా ఎంచుకున్నాడు. హెగెల్ భావవాద దృక్పథంతో మొదలైన మార్క్స, క్రమంగా భౌతికవాద దృక్పథం వైపు అడుగులు వేసిన ఫోయర్ బా తాత్విక దృక్పథం వైపు మార్క్స దృష్టి సారించాడు. ఫోయర్ బా తన కంటే ముందరి భావవాద తాత్విక దృక్పథానికి అభిముఖంగా ప్రయాణం మొదలు పెట్టాడు. ఫోయర్ బా తాత్విక ప్రయాణం మార్క్స తన దృక్పథాన్ని పరిశీలించుకొనుటకు ప్రయోగశాలగా ఉపయోగపడింది. ఇలా ప్రాచీన జర్మన్ తత్వశాస్త్రం క్రమంగా మార్క్సను చేరుకునే సరికి సంపూర్ణ భౌతికవాదంగా రూపుదిద్దుకుంది హెగెల్ దీనిలో అద్వితీయ పాత్ర పోషించాడు.

తత్వశాస్త్ర చరిత్ర సామాజిక శాస్త్రాలను విస్తృతంగా అధ్యయనం గావించిన మార్క్స అప్పుడప్పుడే పురుడుపోసుకుంటున్న పెట్టుబడిదారీ విధానం క్రమక్రమంగా క్షీణిస్తున్న భూస్వామ్య విధానాల సంది దిశను పరిశీలించిటకు తన అధ్యయనాలను ఉపయోగించుకున్నాడు. జర్మనీలో బలపడుతున్న భౌతికవాద తాత్విక దృక్పథం. ఇంగ్లాండులో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం, సంపూర్ణ వర్గ సమాజ లక్షణాలలో ముందుకు రావడం మార్క్సిజానికి ప్రాథమిక పాఠశాలగా ఉపయోగపడింది. భూస్వామ్య భావజాలంలో కుస్తీపడుతున్న పెట్టుబడిదారీ విధానాలు మార్క్స ఉభయతరాలను పరిశీలించుటకు ఉపయోగపడింది. భూస్వామ్య సమాజంలో భౌతికమైన భూ సంబంధాలపై ఆధారపడ్డ ఉత్పత్తి సంబంధాల అధ్యయనం, రెండు సమాజాల విశ్లేషణ, అంతిమంగా చరిత్రంతా వర్గ పోరాటాల చరిత్రగా నిర్ధారించుటకు పునాది పడింది. భూస్వామ్య సమాజాన్ని, పెట్టుబడిదారుడు కార్మికుడుగా ఉన్న

---

దోహదపడ్డాయి. రాతి గొడ్డళ్లతో చెట్లు కొట్టాడు. దుబ్బులు తవ్వాడు. మిగిలిన కాడల దుబ్బుకి నిప్పంటించి తగలబెట్టాడు. కాని రాతి గొడ్డలితో చెట్లు నరకడం విపరీతమైన ప్రయాసతో కూడుకున్న పని. ఆ పరిస్థితుల్లో లోహాల్ని కనిపెట్టడం సంభవించింది. మొట్టమొదట కనిపెట్టబడ్డ లోహం రాగి. ఇది లోహయుగ ప్రాథమిక దశ. క్రమేణా, రాగితో తగరం, తుత్తునాగం వంటి ఇతర లోహాల్ని కలిపి కంచు తయారు చెయ్యటం నేర్చుకున్నాడు. ఈ లోహాల ఎరుక, తయారీ లోహాన్ని ఎలా రూపొందించుకున్నదీ ఇప్పటికింకా అంతుపట్టకుండా వున్న విషయం. లోహంతో తయారుచేసిన చాకులు, గొడ్డళ్లు మొదలైనవి రాతితో చేసిన వాటికన్నా, చాలా పదునైనవి, ఎక్కువ సమర్థవంతంగా ఉపయోగపడ్డాయి. మానవుడు కేవలం రాతి పనిముట్లను మాత్రమే ఉపయోగించిన కాలాన్ని రాతియుగం (పాతరాతి యుగం, కొత్త రాతియుగం) అంటారు. స్వల్పమైన రాతి పనిముట్లతో పాటు లోహాన్ని ఉపయోగించిన కాలాన్ని లోహయుగం (లేదా తామ్ర - శిలాయుగం) అంటారు. దళితుల చరిత్రకు డా. బి.ఆర్. అంబేద్కర్ పునాదులు వేశాడు. భారతదేశంలో ఉన్న ఉత్పత్తి పరికరాలను పరిశీలిస్తే దళితుల చరిత్ర మరింతగా సాక్షాత్కరిస్తుంది. దళితులంటే మూలవాసులే భారతదేశ చరిత్ర నిర్మాతలే ముఖ్యంగా ఈనాటి దళిత గిరిజన, బహుజనులు, వ్యవసాయ సంస్కృతీ వారసులు, స్త్రీలు అందరూ దళితులుగానే పరిగణింప బడతారు. దళితులంటే చరిత్ర విస్మరించినవారు. బ్రాహ్మణ వాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్న వారందరూ దళితులే.

*(రచయిత సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)* వీ

పెట్టుబడిదారీ వర్గ సమాజాన్ని గతానికి తీసుకెళ్లి వస్తు మార్పిడి, ఆదిమ కమ్యూనిస్టు సమాజం తప్ప ఇక అన్ని సమాజాలు వర్గ సమాజాలే అని మార్క్స్ నిర్ధారించి నిరూపించాడు.

దోపిడీ వర్గ సమాజాన్ని నిర్మూలించుటకు ఏకైక మార్గ వర్గ పోరాటం అనేది మార్క్సిజపు నినాదం. చరిత్రంతా పాలక వర్గాలన్నీ, దోపిడీ వర్గాలే నని, తన రచనల ద్వారా చెప్పాడు. బలిపీఠంకై బారు తీరిన చారిత్రక సత్యాన్ని మార్క్స్ భౌతికవాద దృక్పథంలో సమాజాన్ని పరిశీలించి గతాన్ని తర్క బద్ధంగా అధ్యయనం చేసి, గతాన్ని, తార్కికతను అలాగే భౌతికవాద దృక్పథంతో వరుసగా పేర్చి గతితార్కిక భౌతికవాదాన్ని అభివృద్ధి చేసి, గత సమాజాల వర్గ నీతిని బహిర్గతం చేశాడు. మార్క్స్ సహచర మిత్రుడు ఏంగెల్స్ మార్క్స్‌తో కలిసి వర్గ పోరాటాలను, చరిత్రను అధ్యయనం చేసి సామాజిక మార్పులో శ్రమ నిర్వహించిన పాత్రను వెలుగులోకి తెచ్చాడు. వానరుడు నరుడిగా మారే క్రమంలో శ్రమ నిర్వహించిన పాత్రను ఎలుగెత్తి చాటి మార్క్సిజాన్ని మరింత సుసంపన్న చేశాడు.

అమెరికా, ఇంగ్లాండ్, జర్మనీ, ఫ్రాన్స్, బెల్జియం తదితర అమెరికా యూరోపియన్ దేశాలలో జరిగిన వర్గ పోరాటాలను అధ్యయనం చేశాడు. ఆసియాలో రష్యా, చైనా, భారత్ లాంటి దేశాలలోని శ్రామిక వర్గ ప్రయోగ రీతుల్ని అధ్యయనం చేసి ప్రపంచ పీడిత జనావళికి తమ విముక్తికి తామే సన్నద్ధులు కావాల్సిన చైతన్యాన్ని కలిగించి ఉద్యమించడానికి తగిన పోరాట భూమికను ఏర్పాటు చేశారు. 1789 నాటి ఫ్రెంచి విప్లవం తదుపరి 1871 నాటి ప్యారిస్ కమ్యూన్ వరకు దృష్టి సారించి వర్గ సమాజాన్ని వర్గ పోరాటం ద్వారానే రద్దు పరుచాలని, వర్గ దోపిడీని, దోపిడీకి గురవుతున్న వర్గమే ఎదురించి పోరాటం చేసి తమపై జరుగుతున్న దోపిడీని రద్దుపరచాలని అందుకై ప్రపంచ మానవాళి విముక్తికై ఒక శాస్త్రీయమైన గతితార్కిక చారిత్రక భౌతికవాద కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని మార్క్సిజం రూపంలో ప్రపంచ పీడిత జాతికి కరదీపికగా అందించాడు. మార్క్స్ సిద్ధాంత అధ్యయనాలతో తీవ్రంగా ప్రభావితుడైన ఎంగేల్స్ తన అద్భుతమైన మేధస్సును పలు రచనల ద్వారా, వ్యాసాల ద్వారా, ఉత్తరాల ద్వారా, పీటికల ద్వారా, ప్రసంగాల ద్వారా చివరకు ప్రవాసాల ద్వారా, జైలు నిర్బంధాల ద్వారా మొత్తంగా తన భౌతికవాద, తాత్విక ప్రాపంచిక దృక్పథం ద్వారా మార్క్సిజానికి అండగా నిలిచి, మార్క్సిజం పేరు  కిందన నిలిపి మాత్రం అనుమానం లేకుండా మార్క్సిజం అభివృద్ధికి కృషి చేశాడు. ఎంగేల్స్ మిత్రుత్వంలో మార్క్స్ జీవితం మరింత దేదీప్యమానమైంది. మార్క్స్ మార్క్స్ కుటుంబం అష్ట దరిద్ర, అష్ట చక్రబంధంలో ఉన్న సమయంలో సహచర ఉద్యమకారుడు మిత్రుడ ఎంగేల్స్ అందించిన ఆర్థిక, హార్థిక చేయూత ప్రపంచంలో మిత్రుత్వానికి మొట్ట మొదటి ఉదాహరణగా చెప్పవచ్చు. ఎంగేల్స్ అధ్యయన, ఆర్థిక చేయూత మార్క్స్‌కు గనక లేకపోతే ప్రపంచ పీడిత హస్త కలవాలమైన మిర్క్సిస్టు శాస్త్రీయ సిద్ధాంతం ఇంత ప్రభావశీలంగా, మానవాళి శ్రమ జగత్తు తరుపున ఇంత సరి అయిన కొలమానాలలో నిలువగలిగేదేనా అనే సందేహం. ఈ శాస్త్రీయ సిద్ధాంత నిర్మాణంలో మార్క్స్‌కు ఎదుసైన ఆరోగ్య, ఆర్థిక సమస్యలు కఠినాతి కఠినమైనవి. అయినా చెక్కు చెదరని ధీరోధాత్తుడు మార్క్స్ మహాశయుడు.

కార్మిక వర్గ ఆశాజ్యోతి మార్క్సిజం. కార్మికవర్గ స్వప్నలోకం సోషలిస్టు సమాజం కార్మిక వర్గ పోరాటాలకు కార్మిక వర్గ రాజకీయాలు తప్పనిసరి. కార్మిక వర్గ పార్టీ నిర్మాణం ఇందుకు మొదటి మెట్టు. వర్గ చైతన్యాన్ని నిరతంరం నూరిపోయడం ద్వారానే కార్మిక వర్గ రాజకీయాలలో ప్రగతి సాధించగలం. వర్గ దోపిడీ నుండి కార్మిక వర్గం విముక్తి చెందాలంటే ప్రగతిశీలమైన ఆలోచనలు ఉన్నతమైన భావాలు ఉత్పత్తి అవసరం. సరైన భావాలు సరైన అధ్యయనం ద్వారానే వస్తాయి. ప్రస్తుత వర్గ వైరుధ్య సమాజాన్ని సరైన అంచనాలతో నిర్ధారించింది మిర్క్సిస్టు సిద్ధాంతం మాత్రమే. మర్క్సిజాన్ని అధ్యయనం చేయడమంటే మొత్తం సమాజాన్ని అధ్యయనం చేయడం. మార్క్సిజం తెలియకపోతే గతాన్ని విశ్లేషించలేం. వర్తమానాన్ని పరిశీలించలేం. భవిష్యత్తును అంచనా వేయలేం. మానవ మనుగడకు గత, వర్తమాన, భవిష్యత్తు సమాజాలు ఎలా సరైనవో ఎలా కావో అంచనా వేయలేం.

మార్క్సిజం జానపద నవల స్వప్న వృత్తాంతము కాదు. సమస్త శాస్త్రీ నిరూపణలో పరిపూర్ణ సామ్యవాద సమాజ నిర్మాణ సామగ్రిని తయారు చేసిన మానవ విముక్తి ఖారానాం. మార్క్సిజం ద్వారాపూ మొత్తం మానవ చరిత్ర. చరిత్రలో జరిగిన పోరాటాల స్వభావం. చరిత్రలో వైరుద్యాల పాత్రా ఆయా చారిత్రక దశలలో అతివాద, మితవాద, అవకాశవాద పోకడలు అర్థం అవుతాయి. మార్క్సిజం పీడిత మానవాళికి చుట్టపు చూపు కాదు. శుభలేఖ కాదు. అది పీడిత జనాబాహుళ్యపు దైనందిన జీవిత నిరంతర శ్వాసాసమరం. మార్క్సిజం తెలికపోవడం మూలంగానే మానవ చరిత్రను రాజులు, రాణులు, నియంతల చరిత్రగానే చెప్పుకుంటాం. మార్క్సిజం ద్వారానే ఈ భూమిపై చరిత్రంతా శ్రమ జీవుల చరిత్రని చరిత్ర నిర్మాతలు శ్రమ జీవులను ప్రకపితమైంది. చారిత్రక భౌతికవాదం చెబుతుంది. చరిత్రంతా వర్గ పోరాటల చరిత్రని, వర్గ వైరుద్యాల చరిత్రని, ఇలా చరిత్రలోని ప్రతి మలుపువెనుక, ప్రతి మజిలీలో మార్క్సిజం ఉందని వేల సంవత్సరాల వయసు కల్గిన పాలక, పాలిత, వర్గ సమాజాన్ని నిలబెట్టి, నిలువునా బద్దలుకొట్టి, చరిత్రలో ఎంతపాటి నియంతలనైనా దోషులుగా నెలబెట్టి, వారి వర్గ నీతిని బహిర్గతం చేసి, ప్రపంచ పీడిత జనవాళిని విముక్తి పోరాటాల వైపు కదిలించిన ఘనత మార్క్సిస్టు శస్త్రీయ సిద్ధాంతానిదే.

ఈ సమాజానికి మార్క్సిజం ఒక ఫిజిషియన్. సమస్త సామాజిక శాస్త్రాల సారాంశమే మార్క్సిజం. మార్క్సిజాన్ని అధ్యయనం చేయడం మొత్తం సామాజిక జీవన చిత్రాలను అధ్యయనం చేయడం. సమకాలీన సామాజిక పరిస్థితుల్ని అధ్యయనం చేయడం మార్క్సిజం ద్వారానే సాధ్యం. మూడోవంతు ప్రపంచ జనాభాకు మిర్క్సిజం విముక్తి పతాకగా పరిచయమైందంటే, మార్క్సిజంలో ఎంత సామాజిక శ్రమ చరిత్ర దాగుందో అర్థం చేసుకోవచ్చు. శ్రమ దోపిడీ రద్దు శ్రామిక ప్రజల విముక్తి సమరశీల పోరాటాల ద్వారానే సాధ్యమని మార్క్సిజం చెబుతుంది. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థపై మార్క్సిజం గురిపెట్టిన బాణం. పెట్టుబడిదారీ ఏనుగు కుంబస్థలంపై కురిసిన పిడుగుల రాసే మార్క్స్ కాపిటల్ (పెట్టుబడి గ్రంథం) మార్క్స్ పెట్టుబడి గ్రంథం భూస్వామ్య, పెట్టుబడిదారీ వ్యవస్థల అసలు రూపాన్ని ఎత్తి చూపింది. వారి దోపిడీ విధానాల్ని వారి సమస్త ఆర్థిక, సామాజిక శాస్త్రాలకు ఎదురుగా నిలిచి, శ్రామిక జన పక్షాన పోరాట నగారా మోగించింది. మానవ విలువల్ని మానవతా సుగందాల్ని మానవ సమాజానికి ఎలా ఎందించాలో పెట్టుబడి గ్రంథం చెబుతుంది.

శ్రమ దోపిడీ రహస్యాన్ని పెట్టుబడిదారుడికి శ్రమజీవి శ్రమ అదనపు విలువగా ఎలా అందుతుందో వివరించి, మొత్తం దోపిడీ సమాజపు

# మన మార్క్స్

***సరిగ్గా వంద సంవత్సరాల కింద మార్క్స్ శతజయంతి సందర్భంగా మార్క్సిజం విశిష్టతను చాటి చెపుతూ ఇటలీకి చెందిన మార్క్సిస్టు మహోపాధ్యాయుడు* ఆంటోనియో గ్రాంషీ *రాసిన వ్యాసం***

(ఇటలీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, మార్క్సిస్టు మేధావి ఆంటోనియో గ్రాంషీ (1891-1937) ఇటలీకి చెందిన సోషలిస్టు పత్రిక ఇల్ గ్రిడో డెల్ పొపొలోలో 1918 మే 4న మార్క్స్ శతజయంతి సందర్భంగా రాసిన వ్యాసం ఇది. సరిగ్గా ఆ సమయానికే ఇటలీలో బెనిటో ముసోలినీ నాయకత్వంలో ఫాసిజం బలపడడం మొదలయింది. చివరికి 1922లో ముసోలినీ ప్రధానమంత్రి కూడ అయి ఫాసిస్టు పాలన ప్రారంభించాడు. తన మీద హత్యాప్రయత్నానికి కమ్యూనిస్టులు కుట్ర పన్నుతున్నారనే అబద్ధపు ఆరోపణతో ముస్సోలినీ 1926లో కమ్యూనిస్టుల మీద, ప్రగతిశీలవాదుల మీద దారుణ దమనకాండ ప్రారంభించి, అప్పటికి ఇటలీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడుగా ఉన్న గ్రాంషీని అరెస్టు చేయించాడు. గ్రాంషీకి వ్యతిరేక వాదనలు చేస్తూ ప్రాసిక్యూషన్ నిఈ మేధను కనీసం ఇరవై సంవత్సరాలు పని చేయించకుండా ఉండడం అవసరరా అని న్యాయస్థానాన్ని కోరింది. న్యాయస్థానం వెంటనే గ్రాంషీకి ఐదు సంవత్సరాల జైలు శిక్ష విధించింది. ఏడాది తర్వాత మరొక ఇరవై సంవత్సరాల శిక్ష విధించింది. అరెస్టయ్యే నాటికి ముప్పై ఐదేళ్ల వయసులో ఉన్న గ్రాంషీ జైలులో తీవ్ర అనారోగ్యం పాలయ్యాడు. గ్రాంషీని విడుదల చేయాలని ప్రపంచవ్యాప్తంగా జరిగిన నిరసన ప్రదర్శనలను, విజ్ఞప్తులను ముసోలినీ ప్రభుత్వం పెడచెవిన పెట్టింది. చివరికి పదకొండు సంవత్సరాల జైలు జీవితం తర్వాత 1937లో గ్రాంషీ జైలులోనే మరణించాడు. ఆయన జైలులో చేసిన ఆలోచనలు, రచనలు దాదాపు

---

గుట్టును రట్టు చేశాడు మార్క్స్. అభివృద్ధి పరిచిన గతితార్కిక భౌతికవాద చారిత్రక భౌతికవాదం మార్క్సిస్టు తత్వశాస్త్రం పీడిత ప్రజలకై నిలిచే సాహిత్య సాయుధులు. 1883, మార్చ్ 12న ప్రపంచ శ్రామిక జనం నుంచి వీడ్కోలు తీసుకున్నాడు. ఆ మహనీయుని జననం ప్రపంచానికి ఎంతటి ఆశాజనకమో ఆయన మరణం అంతటి నిరాశాజనకం. నిష్కళంకంగా, తుది శ్వాసవరకు, వ్యక్తిగత, కుటుంబ బంధాలకు అతీతంగా, ఆరోగ్యం, వ్యక్తిగత అవసరాలకు మించిన శ్రామిక జన విముక్తి భావకుడు తన తుది శ్వాసను తనకోసం కాక విడవడం, పీడిత జనానికి తన ఆశయ పతాకం అందించడం. మార్క్సిజం ఎలుగులో లెనిన్, లెనినిజాన్ని అభివృద్ధి పరిచి రష్యాను, మార్క్సిజం లెనినిజం వెలుగులో మావో తన ఆలోచనా విధానంలో చైనా విముక్తి, ప్రపంచ మానవ చరిత్రలో రెండు పెద్ద ధీరోదాత్త ఘట్టాలు.

మార్క్సిజాన్ని మనం ఎందుకు నేర్చుకోవాలి? ఎందుకంటే మార్క్సిజం ఒక శాస్త్రీయ సామాజిక సిద్ధాంతం. మానవ జీవితాన్ని ఆద్యంతాలు వివరించే సామాజిక శాస్త్రం. మానవ పరిణామంతో కూడిన సామాజిక పరిణామ క్రమాన్ని ఆయా చారిత్రక దశలలో జరిగిన సామాజిక మార్పుల కోణాల్ని, శాస్త్రీయంగా విశ్లేషించి, నేటి మన సమాజ స్థితిగతులు, ఇట్లా ఉండడానికి గల కారణాలను చూపే అక్షర దృశ్య చిత్రం. సమాజంలో ఉన్న అసమానతలు, ఎగుడు, దిగుడు జీవితాలు, పేద, ధనిక తారతమ్యాలు, కష్టజీవులు, నానాటికి కష్టాల, రోగాల పాలవుతూ, పెట్టుబడి దారుల క్షణం శ్రమచేయకుండా కుబేరులుగా మారటాలు. ఈ వర్గ స్వభావాలు, స్త్రీ, పురుష అసమానతలు, నిర్లక్ష్యం చేయబడుతున్న బాల్యం, వీధుల పాలవుతున్న వృద్ధాప్యం, స్త్రీలపై అణచివేత, భ్రూణ హత్యలు, వరకట్న హత్యలు, అత్యాచారాలు, విద్యకు నోచుకోకపోవడం, వైద్యానికి దూరమైపోవడం, గూటి, కూటి కోసం, గుడ్డ కోసం వెంపర్లాట. ఆకలి చావులు, ఆత్మహత్యల లాంటి సమస్త రుగ్మతలతో నిండి ఉన్న సమాజంలో మనం జీవిస్తున్నాం. ఇలాంటి సమాజాన్ని మార్చడానికి మనం మార్క్సిజాన్ని లెనినిజాన్ని మావో పంథాను అధ్యయనం చేయాలి. ఆచరించాలి.

ఒకవైపు భావవాద దాడి, మరోవైపు రాజ్యపు భౌతిక దాడులు, మార్క్స్ అనుచరుల పట్ల రాజ్యపు దుస్సాహసం, దాష్టీకం, మానవ సంబంధాల్ని పటాపంచెలు గావిస్తున్న ప్రచార, ప్రసార దృశ్య, శ్రవణ, సంస్కృతి, ప్రతి విషయాన్ని లాభంతో ప్రతి స్త్రీని కామంతో చూసే అమానవీయ విష సంస్కృతి. మనిషికి మనిషికి మధ్య మర్మాలు, అదర్మాలు రాజ్యమేలుతున్న ఈ సమాజంలో మనం జీవిస్తున్నాం కాబట్టి మర్క్సిజం మనకు ఇప్పుడు మరింత అవసరంగా ముందుకొస్తుంది.

ఇలా మనచుట్టూ జరుగుతున్న అన్యాయాల్ని, అక్రమాల్ని, ప్రశ్నించే, ఎదిరించే, ధైర్యం, స్థైర్యం మార్క్సిజం మనకిస్తుంది. మనిషి మంచిగా బతికే మౌలిక మానవతా సున్నిత భావాల్ని మార్క్సిజం మనకు నేర్పిస్తుంది. మార్క్సిజం తెలియకపోతే మనిషి 'రోబో'గా మారే ప్రమాదం ఉంది. మార్క్సిజాన్ని నేర్చుకోవడం ద్వారానే, ఆచరించడం ద్వారానే శ్రమైక లోకాన్ని ప్రేమించగలం. శ్రమ జీవుల్ని గుర్తించి, గౌరవించి శ్రామిక జన విముక్తి కోసం ముందుకెళ్లగలం. అన్యాయాల, అక్రమాల, దౌర్జన్యాల, దాష్టికాల కరాళ నృత్యాలని తుదముట్టించే సైన్యంగా తయారుకాగలం, సైన్యాన్ని తయారు చేయగలం. అలా ప్రతి మానవ సంబంధంలోని మర్మాన్ని, సున్నితత్వాన్ని మార్క్సిజం భూతద్దంతో మాత్రమే చూడగలం.

సకల దేశాల శ్రామికుల విముక్తి కోసం దోపిడీని ఓడించి, శ్రామిక రాజ్య స్థాపన కోసం కావాల్సిన ఆలోచన, ఆచరణ, నిర్మాణాన్ని సమకూర్చే ఏకైక ఆయుధం మార్క్సిజం.

*(రచయిత కార్మిక నాయకుడు)* వీ

మూడువేల పేజీలు, ముప్పై నోట్ పుస్తకాలలో మిగిలిపోయాయి. అంతకు ముందూ, జైలులోనూ కూడ ఆయన మార్క్సిజం మీద, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అంశాల మీద చేసిన ఆలోచనలు మార్క్సిస్టు ఆలోచనా ధారకు ఎన్నో సృజనాత్మక కానుకలందించాయి.)

మనం మార్క్సిస్టులమేనా? అసలు మార్క్సిస్టులనేవాళ్లు ఉంటారా? మూర్ఖత్వమా, నువ్వొక్కదానివే శాశ్వతమైన దానివి. బహుశా ఈ ప్రశ్న రానున్న కొన్ని రోజుల్లో, మార్క్స్ శతజయంతికి అటూ ఇటూగా, చాలమంది లేవనెత్తుతారు. ఎన్నెన్నో సిరా నదులూ, తెలివిమాలినతనపు నదులూ ప్రవహిస్తాయి. పిచ్చి ప్రేలాపనలూ, కళాత్మకమైన టక్కుటమారాలూ ఎప్పటికీ చెడిపోని మానవ వారసత్వ సంపద కదా.... మార్క్స్ ఒక అందమైన చిన్న సిద్ధాంతం ఏదీ రాయలేదు. స్థల కాలావధులకు అతీతంగా, ప్రశ్నించడానికి వీలులేని, పరమ నియమాలతో, నిర్ద్వంద్వమైన కర్తవ్యాలతో నిండిన కాల్పనిక కథావళులను వదిలిపోయిన ప్రవక్త కాడాయన. ఆయన వదిలిపోయినది ఒకే ఒక్క విస్పష్టమైన కర్తవ్యం, నియమం: అది-ప్రపంచ కార్మికులారా, ఏకం కండ్డి అనే నినాదం. సంఘటితం చేసే కర్తవ్యం, ఆ కర్తవ్యాన్ని ప్రచారం చేయడం ఒక్కటే బహుశా మార్క్సిస్టులనూ, మార్క్సేతరులనూ వేరు చేసేది. అది చాల చిన్నదనిపిస్తుంది. కాని చాల పెద్దది కూడ. మరి ఇందులో మార్క్సిస్టు కాకుండా ఉండాలని ఎవరనుకుంటారు?

అయినా అది అలాగే ఉంటుంది. తమకు తెలిసినా తెలియకపోయినా ప్రతి ఒక్కరూ ఎంతో కొంత మార్క్సిస్టులే. మార్క్స్ మహానుభావుడు. ఆయన ఆచరణ ఫలప్రదమైనది. ఆయనేమీ శూన్యంలోంచి ఏదో కనిపెట్టాడని కాదు. ఆయన తన ఊహలోంచి ఒక చారిత్రక దృక్పథాన్ని తవ్వితీశాడని కాదు. కాని అప్పటివరకూ శకలాల రూపంలో, అసంపూర్ణంగా, అపరిణతంగా ఉన్నది ఆయనలో పరిణతిగా, వ్యవస్థగా, చైతన్యంగా రూపు దిద్దుకుంది. ఆయన వ్యక్తిగతంగా సాధించిన అవగాహన ప్రతి ఒక్కరి అవగాహన అయింది. అది ఇప్పటికే ఎంతెంతో మంది అవగాహనగా మారింది. అందువల్ల మార్క్స్ కేవలం మేధావి కాదు, ఆయన ఆచరణవాది. ఆయన ఆలోచనలో మాత్రమే కాదు ఆచరణలో కూడ మహానుభావుడు, సార్థక జీవి. ఆయన పుస్తకాలు ఆలోచనలను మార్చినట్టుగానే ప్రపంచాన్ని మార్చాయి.

మానవజాతి చరిత్రలో మేధస్సు, చైతన్య స్ఫూర్తి ప్రవేశించిందనడానికి మార్క్స్ సూచన.

సరిగ్గా చరిత్రలో మనిషి పాత్ర గురించి థామస్ కార్లైల్ కూ హర్బర్ట్ స్పెన్సర్ కూ మధ్య జరిగిన మహా చర్చ జరిగిన కాలంలోనే ఆయన కృషి వెలువడింది.

కార్లైలేమో ఆధ్యాత్మిక ఐక్యతతో నిగూఢమైన సమ్మేళనం జరిగిన నాయకుడే, మహా వ్యక్తే మానవ జాతి భవిష్యత్తును నిర్ధారిస్తాడని, సంపూర్ణతా, పవిత్రతా నిండిన భ్రమాజనిత స్థలంలో అపరిచితమైన, క్షణభంగురమైన గమ్యానికి నడిపిస్తాడనీ అన్నాడు.

స్పెన్సరేమో ప్రకృతినీ, పరిణామాన్నీ, యాంత్రిక చలనాన్నీ, నిర్జీవ సాధారణీకరణనూ నొక్కి చెప్పాడు. మనిషంటే ఒక ప్రాకృతిక శరీరంలోని ఒకానొక అణువు అన్నాడు. అమూర్తమైన నియమానికి విధేయంగా ఉండే అణువు అనీ, కాని వ్యక్తులలో అది చారిత్రక నిర్దిష్టతగా, తక్షణ ప్రయోజనంగా పర్యవసిస్తుందనీ అన్నాడు.

ఈ చరిత్రలో ఒక మహాకాయుడిలా బలవత్తరమైన శక్తితో విస్పష్టంగా తనను తాను ప్రవేశ పెట్టుకున్నాడు మార్క్స్. ఆయన మార్మికవాది కాదు. ప్రత్యక్షైక వాదం ప్రతిపాదించిన అధిభౌతికవాదీ కాదు. ఆయన చరిత్ర కారుడు. గతకాలపు దస్తావేజుల వ్యాఖ్యానకర్త. ఆ దస్తావేజులలో కొన్ని ఎంపిక చేసుకుని వ్యాఖ్యానించినవాడు కాదు, సమస్త దస్తావేజులనూ తన పరిధిలోకి తీసుకున్నవాడు.

అప్పటివరకూ మానవానుభవాల చరిత్రల అంతర్గత లోపం అదే. అవన్నీ దస్తావేజులలోని ఒక భాగాన్ని మాత్రమే పరీక్షించి, పరిగణనలోకి తీసుకున్నవి. ఆ ఎంపిక చేసిన భాగం కూడ చారిత్రక సంకల్పం వల్ల కాదు, కేవలం పాక్షిక అభిప్రాయ దురభిప్రాయాల వల్ల జరిగింది. ఆ అభిప్రాయ దురభిప్రాయాలు అసంకల్పితంగా, మంచి మనసుతోనే ఏర్పడినా సరే. ఆ పరిశోధనంతా సత్యం కోసం, కచ్చితత్వం కోసం, గతకాలపు జీవితాన్ని సమగ్రంగా పునఃసృష్టించడం కోసం జరగలేదు. కేవలం ఒక ప్రత్యేక కార్యకలాపాన్ని ఎత్తిపట్టడానికి, అంతకుముందే తమ మనసులో ఉన్న ప్రాతిపదికను నిరూపించడానికి మాత్రమే జరిగింది. చరిత్ర సంపూర్ణంగా భావాల క్షేత్రం. మనిషిని కేవలం ఒక ఆత్మగా, శుద్ధ చైతన్యంగా మాత్రమే అక్కడ గుర్తించారు. ఈ భావన వల్ల రెండు తప్పుడు పర్యవసానాలు సంభవించాయి. మనుషులలో రూపొందిన భావాలన్నీ కేవలం యథేచ్ఛగా, కాల్పనికంగా వెలువడినట్టు అనిపించింది. ఇక ప్రాముఖ్యత పొందిన వాస్తవాలు కేవలం పిట్టకథలూ ఉపాఖ్యానాలూ మాత్రమే గాని చరిత్ర కాదు. చరిత్రను దాని నిజమైన అర్థంలో రాసి ఉన్నారంటే అది కేవలం ఆయా వ్యక్తులు విడివిడిగా ప్రదర్శించిన అద్భుత ప్రజ్ఞ వల్లనే కాని చరిత్ర రచనను ఒక క్రమబద్ధమైన, చైతన్యపూర్వకమైన శాస్త్రీయ కార్యాచరణగా భావించినందువల్ల కాదు.

మార్క్స్ కు కూడ చరిత్ర అంటే భావాల క్షేత్రమే. ఆయనకు కూడ మనిషి చైతన్యమే ప్రధానం. వ్యక్తులు ఒంటరిగా గాని, సంఘటితంగా గాని సాగించే చైతన్యపూర్వక కార్యాచరణే చరిత్ర. కాని మార్క్స్ దృష్టిలో ఆ భావాలు, చైతన్యం సారాన్ని సంతరించుకున్నాయి. తమ యథేచ్ఛను వదిలించుకున్నాయి. అవి ఇంకెంతమాత్రమూ కాల్పనికమైన మత లేదా సామాజిక అమూర్తత్వాలు కావు. వాటి సారాంశం ఆర్థికవ్యవస్థలో, వాస్తవికమైన కార్యాచరణలో, ఉత్పత్తికీ, వినిమయానికీ సంబంధించిన వ్యవస్థలలో, సంబంధాలలో ఉంది. అంటే చరిత్రగా జరిగేది శుద్ధమైన వాస్తవిక (ఆర్థిక, నైతిక) కార్యాచరణ. ఒక భావన నిజం కావాలంటే అది కేవలం తార్కికంగా శుద్ధసత్యంతో, శుద్ధ మానవతతో సమన్వయంలో ఉంటే సరిపోదు. అది ఒక ప్రణాళికలాగనో, మానవజాతి సాధించవలసిన సాధారణ నైతిక లక్ష్యంలాగనో మాత్రమే ఉనికిలో ఉండదు. అందుకు భిన్నంగా అది ఆర్థిక వాస్తవికతలోనే తన సార్థకతను సాధిస్తుంది. ఆర్థిక వాస్తవికతలోనే తనను తాను నడుపుకోగల సాధనాన్ని కనిపెడుతుంది. ఒక దేశపు, ఒక సమాజపు, ఒక సామాజిక బృందపు చారిత్రక లక్ష్యాలు ఏమిటో కచ్చితంగా తెలుసుకోవాలంటే, మొట్టమొదట ఆ దేశంలో, ఆ సమాజంలో ఎటువంటి ఉత్పత్తి, వినిమయ వ్యవస్థలూ సంబంధాలూ ఉన్నాయో తెలుసుకోవాలి. ఆ పరిజ్ఞానం లేనట్టయితే కేవలం పాక్షిక గ్రంథాలు, సిద్ధాంతపత్రాలు రాయడం మాత్రమే వీలవుతుంది. ఆ గ్రంథాలు సంస్కృతీ చరిత్రకు ఉపయోగకరమైనవే. వాటిలో

అప్రధానమైన ప్రతిఫలనాలు దొరుకుతాయి, సుదూర పర్యవసానాలు దొరుకుతాయి కాని అది చరిత్ర కాజాలదు. సుదృఢమైన సాంద్రతతో ఉండే వాస్తవిక కార్యాచరణ అందులో బైటపడదు.

విగ్రహాలు వాటి వేదికల మీది నుంచి కూలిపోతాయి. దేవతల కళ్ల ముందర సుగంధ ద్రవ్యాల పరిమళపు మేఘాలు చెల్లాచెదురైపోతాయి. మనిషికి భౌతిక వాస్తవికత గురించి స్ఫురణ కలుగుతుంది. సంఘటనల పరంపర వెనుక అసలు కారణమేమిటో రహస్యం మనిషికి తెలిసిపోతుంది. మానవజీవి తనను తాను తెలుసుకుంటుంది. తన వ్యక్తిగత సంకల్పం విలువేమిటో మనిషికి తెలిసివస్తుంది. ఆవశ్యకతకు విధేయం కావడం ద్వారా, క్రమశిక్షణ గరపడం ద్వారా ఆ సంకల్పాన్ని మరింత శక్తిమంతం చేసుకోవచ్చునని మనిషికి తెలిసివస్తుంది. చివరికి ఆ వ్యక్తిగత సంకల్పం ఆవశ్యకత మీద కూడ ప్రాబల్యం వహిస్తుంది. తన సొంత లక్ష్యాలతో మమేకమవుతుంది. మరి ఏ మనిషి తనను తాను తెలుసుకుంటారు? సాధారణంగా ఏ మనిషైనా అని కాదు. ఆవశ్యకత కాడి బరువు మోస్తున్న మనిషికి మాత్రమే ఆ అవకాశం ఉంది. ఈ చరిత్ర సారాంశం కోసం అన్వేషిస్తే, ఆ సారాంశాన్ని ఉత్పత్తి, వినిమయాల వ్యవస్థలలో, సంబంధాలలో గుర్తిస్తే, ఎవరైనా మానవ సమాజం ఎలా రెండు వర్గాలుగా చీలిపోయిందో గుర్తించక తప్పదు. ఉత్పత్తి సాధనాలను సొంతం చేసుకున్న వర్గం ఇప్పటికే తప్పనిసరిగా తానెవరో గుర్తించే ఉంది. తన శక్తి గురించీ, కర్తవ్యం గురించీ దానికొక చైతన్యం ఉంది. కాకపోతే అది గందరగోళ భరితమైనదీ, శకలాల రూపంలో ఉన్నదీ కావచ్చు. దానికి వ్యక్తిగత లక్ష్యాలున్నాయి, వాటిని సాధించడానికి ఉద్దేశపూర్వకంగా, వస్తుగతంగా సంఘటితమయ్యే సామర్థ్యం ఉంది. ఆ లక్ష్యసాధనా మార్గం ఆకలితో చిక్కిన శరీరాలతో, యుద్ధరంగాలలోని మృతదేహాలతో నిర్మాణమయిందని దానికి లెక్కే లేదు.

వాస్తవ చారిత్రక మృతజీవులను సంఘటితం చేసే బాధ్యత తన మీద ఉందని మరొక వర్గం గుర్తించడం ఒక జ్ఞానోదయం వంటిది. ఆ గుర్తింపే కాపరి లేని పెద్ద మందను పద్ధతిలో పెట్టే సూత్రంగా మారుతుంది. ఆ క్రమంలో ఆ మంద స్వీయ చైతన్యాన్ని పొందుతుంది. తనను తాను ఒక వర్గంగా స్థాపించుకునే ప్రయత్నంలో ఎంతటి కర్తవ్యం దాగి ఉన్నదో అది గ్రహిస్తుంది. తన వ్యక్తిగత లక్ష్యాలను సాధించడానికి అవసరమైన సాధనాలు సంపాదించేవరకూ, ఆ కోరికలు తన సంకల్పంగా మారేవరకూ తన లక్ష్యాలన్నీ ఉత్తి యథాలాపపు బోలు మాటలే, మితిమీరిన ఆకాంక్షలే అవుతాయని ఆ వర్గం చైతన్యం పొందుతుంది.

స్వచ్ఛందవాదమా – ఆ మాటకు అర్థం లేదు. లేదా దాన్ని యథేచ్ఛా సంకల్పం అనే అర్థంలో వాడుతుండవచ్చు. కాని మార్క్సిస్టు అర్థంలో సంకల్పం అంటే లక్ష్యం గురించిన అవగాహన. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే తన సొంత శక్తి గురించి కచ్చితమైన పరిజ్ఞానం, దాన్ని కార్యాచరణలో వ్యక్తీకరించే సాధనాల గురించి పరిజ్ఞానం. దాని అర్థమేమంటే, మొట్టమొదట, ఆ వర్గం నిర్దిష్టతను సంతరించుకుంటుంది. విశిష్టమైనదవుతుంది. తన ప్రత్యేక లక్ష్యాలు సాధించడానికి సుదృఢంగా సంఘటితమవుతుంది. క్రమశిక్షణాయుతమవుతుంది. ఊగిసలాటలకు లోనుకాకుండా, పక్కదారి పట్టకుండా ఉంటుంది. దాని అర్థం అది ఒక సుదూర మజిలీ దాకా నేరుగా సరళరేఖలో సాగిపోయే ప్రేరణగా ఉంటుంది. మధ్య దారిలో దారిపక్క పచ్చిక బయలులో అలుపు తీర్చుకోవడానికి ఆగడమో, ఆ పచ్చదనంతో మెత్తనయిన సుహృద్భావ సోదరులు అందించే పానీయం తాగడమో, గౌరవమూ ప్రేమా కలిసిన మృదు భాషణ వినడమో ఏవీ చేయకుండా సాగవలసి ఉంటుంది.

కాని నిమార్క్సిస్టు అర్థంలోను అనే మాట అర్థరహితం. ఆ మాటతో సందిగ్ధాలు రావచ్చు, మతిలేని మాటల జల్లు కురియవచ్చు. మార్క్సిస్టు, మార్క్సిస్టు అర్థంలో... వంటి మాటలు ఎందరెందరి చేతుల్లోనో చలామణీ అయి అరిగిపోయిన నాణాల్లా మారిపోయాయి.

మనకు కార్ల్ మార్క్స్ అంటే మానసిక, నైతిక జీవిత మార్గదర్శి. ఒక పంగలకర్ర పట్టుకున్న పశుల కాపరి కాదు. ఆయన మన మానసిక సోమరితనాన్ని వదిలించే ప్రేరకుడు. మన నిద్రాణమైన శక్తులను మేల్కొలిపి, మంచి పోరాటం కొరకు సిద్ధం చేసే వైతాళికుడు. శూన్యంలో, అమూర్తతల గురించి మాట్లాడకుండా ఉండడానికి అవసరమైన స్పష్టమైన భావాల నిజాయితీ, దృఢమైన సంస్కృతి సాధించడానికి ఎంత తీవ్రంగా, పట్టువదలకుండా పని చేయాలో ఆయనే ఉదాహరణ. తెలుసుకోగలిగిన, ఆలోచించగలిగిన ఏకశిలా సదృశ మానవమేధ ఆయన. మాట్లాడడానికి ఆయన నాలుక కోసం వెతుక్కోడు. అనుభూతి చెందడానికి ఆయన గుండెమీద చెయ్యి పెట్టుకోడు. కాని ఆయన వాస్తవికతా సారాంశాన్ని చుట్టుముట్టి, దాన్ని అధీనం చేసుకోగలిగిన ఉక్కు తర్కపు వాదనలను తయారు చేశాడు. ఆ తర్కం ప్రజల మనసులో చొరబడుతుంది. ఆ మనసుల్లో పేరుకుపోయి ఉన్న దురబి . ప్రాయాల, స్థిరాభిప్రాయాల మేటలను కూల్చివేస్తుంది. నైతిక స్వభావాన్ని బలోపేతం చేస్తుంది.

మనకు కార్ల్ మార్క్స్ అంటే కూనిరాగాలతో ఏడుస్తున్న శిశువు కాదు. పూజారులను బెదరగొట్టే గడ్డపు మనిషి కాదు. ఆయన జీవితచరిత్రలోని అనేక గాథలలో ఏ ఒక్కదానికీ చెందినవాడు కాదాయన. బైటికి కనబడే ఆ మానవ జంతువుకు చెందిన ఎంత ప్రతిభా లేదా ఎంత మొరటుదనమూ ఆయనవి కావు. ఆయన ఒక విశాల గంభీరమైన ఆలోచనాత్మక మేధ. తన అస్తిత్వమేమిటో, తన పర్యవసానమేమిటో, తానేమిటో ఏమి కానున్నదో అనే చైతన్యాన్ని గ్రహించడానికి మానవజాతి వందల సంవత్సరాలుగా సాగిస్తున్న ఉద్వేగపూరిత అన్వేషణలో ఒకానొక వ్యక్తిగత సందర్భం ఆయన. నిగూఢమైన చరిత్ర లయను గ్రహించడానికి, ఆ గుట్టు విప్పిచెప్పడానికి, తన ఆలోచనలో మరింత శక్తిమంతంగా ఉండడానికి, మరింత మెరుగ్గా ఆచరణ సాగించడానికి మానవజాతి చేస్తున్న అన్వేషణలో ఒక సందర్భం ఆయన.

ఆయన మన మనసులో ఒక అత్యవసరమైన, అంతర్గర్భితమైన భాగం. ఆయననేవాడు జీవించి ఉండకపోతే, ఆలోచించి ఉండకపోతే, తన ఉద్వేగాలకూ భావాలకూ మధ్య, అనుభవించిన కడగండ్లకూ పెట్టుకున్న ఆదర్శాలకూ మధ్య రాపిడిలో నిప్పురవ్వలు రగిలించి వెలుగులు వెదజల్లి ఉండకపోతే మన మానసిక స్ఫూర్తే ఉండేది కాదు.

శతజయంతి సందర్భంగా కార్ల్‌మార్క్స్‌ను కీర్తించడంలో అంతర్జాతీయ కార్మికవర్గం తనను తాను కీర్తించుకుంటున్నది. తన చైతన్య పూర్వకమైన శక్తినీ, తన విజయావేశపు భావోద్వేగాన్నీ కీర్తించుకుంటున్నది.

ఆ విజయం ఆధిపత్యవర్గాల పాలనను కూలదోస్తుంది. తన ప్రయత్నాలకూ, త్యాగాలకూ శిఖరాయమానమైన అంతిమ పోరాటానికి సన్నద్ధం చేస్తుంది. వీ

### ఆదివాసీల హత్యకు నిరసనగా కలెక్టరేట్‌ల ముందు ధర్నా

మహారాష్ట్రలోని గడ్చిరోలి, ఇంద్రావతి నది ఒడ్డున జరిగిన హత్యాకాండ, తమిళనాడులోని తూత్తుకుడిలో భద్రతా బలగాలు జరిపిన కాల్పులకు నిరసనగా తెలంగాణ ప్రజాస్వామిక వేదిక తెలంగాణలోని కలెక్టరేట్‌ల ముందు మే 28న ధర్నా నిర్వహించారు. ఏకపక్షంగా కాల్పులు జరిపి 50 మందికి పైగా మరణానికి బాధ్యులైన బలగాలపై 302 సెక్షన్ కింద కేసు నమోదు చేయాలని డిమాండ్ చేశారు. దేశంలో ప్రజాస్వామిక హక్కులను కాపాడాలని, బూటకపు ఎన్‌కౌంటర్లపై విచారణ చేపట్టాలని, ఆదివాసులు, మహిళలపై జరుగుతున్న హత్యలను ప్రతిఘటించాలని, బాధితులకు న్యాయం చేయాలని, పోలీసు కూంబింగ్‌ను నిలిపివేయాలని, ఆదివాసీ ప్రాంతాల్లో భద్రతా బలగాలను ఎత్తివేయాలని ఆందోళనకారులు నిరసన ప్రదర్శించారు.

### రైతుల సడక్ బంద్

రైతు బంధు పథకాన్ని కౌలు, పోడు రైతులకు వర్తింపజేయాలనీ, గిట్టుబాటు ధరలకు భరోసా ఇవ్వాలనీ, 2011 సాగుదారుల చట్టం అమలు చేయాలంటూ, స్వామినాథన్ కమిటీ సిఫార్సులు అమలుచేయాలని డిమాండ్ చేస్తూ మే 31న పలు ప్రజా సంఘాలు, రైతు సంఘాలు, కమ్యూనిస్టు పార్టీల ఆధ్వర్యంలో కరీంనగర్ నుండి భద్రాద్రి కొత్తగూడెం వరకు సడక్ బంద్ నిర్వహించారు. కరీంనగర్ జిల్లా ఎల్కతుర్తిలో టి.జె.ఎస్. నాయకులు కోదండరామ్, సిపిఐ రాష్ట్ర కార్యదర్శి చాడ వెంకటరెడ్డిని అరెస్ట్ చేశారు. వక్తలు రైతు బంధు పథకం డబ్బు పెట్టుబడిదారులకు, భూస్వాములకు, స్థిరాస్తి వ్యాపారులకు చేరుతుందన్నారు. సాగుచేయని భూములకు, గుట్టలకు కూడా డబ్బు పంచారని ఆరోపించారు. పోడు భూములను పట్టించుకోవడం లేదని, కౌలుదారుల ఊసేలేదని పేర్కొన్నారు.

### స్వయం పాలనకై ఆదివాసుల పోరాటం

ఆదిలాబాద్ ఉమ్మడి జిల్లాలో ఆదివాసులు స్వయం పాలన కావాలంటూ ఉద్యమిస్తున్నారు. జూన్ 2 నుంచి 'మా ఊళ్లో మా రాజ్యం' (మావనాటే మావరాజ్యం) అంటూ ఎస్.టి జాబితా నుంచి బంజారాలను తొలగించాలనే డిమాండ్‌తో పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా తెలంగాణ ఆవిర్భావ సంబరాలు జరుపుతుంటే ఆదివాసీ ప్రాంతాల్లో ఏజెన్సీ, ఆదివాసీ గూడాల్లో నల్ల జెండాలను ఎగురవేశారు. 29 ప్రభుత్వ శాఖల్లో పనిచేస్తున్న లంబాడా ఉద్యోగులను ఆదివాసీ గూడాల్లోకి రానివ్వమని హెచ్చరించారు.

### ప్రజా ఉద్యమాలపై నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ సభ

దేశంలో నెలకొన్న నిర్బంధ పరిస్థితులను వ్యతిరేకిస్తూ పౌర హక్కుల సంఘం హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జూన్ 9న సభ నిర్వహించింది. వక్తలు దేశంలో గ్రీన్‌హంట్ ఆపరేషన్ తర్వాత పాలకులు ఆపరేషన్ సమాధాన్ పేరుతో బూటకపు ఎన్‌కౌంటర్‌లు చేస్తున్నారన్నారు. గడ్చిరోలి మారణకాండ, ప్రజా ఉద్యమాలపై తీవ్ర నిర్బంధం, తూత్తుకుడిలో ప్రభుత్వ హత్యాకాండ, జూన్ 6న ప్రజాస్వామిక విద్యార్థి సంఘం నేతలు కంచర్ల బద్రి, మంద రంజిత్, జి. సుధీర్‌లను పోలీసులు అపహరించుకు పోయారన్నారు. న్యూడెమోక్రసీ నేతలను అపహరించారని వీరిని కోర్టులో హాజరు పర్చాలన్నారు.

### భూతగాదాలో దళితుల హత్య

భూతగాదాలు దళిత కుటుంబానికి చెందిన తండ్రీకొడుకుల హత్యకు దారితీశాయి. సిరిసిల్ల జిల్లా ఇల్లంతకుంద మండలం, కందికట్కూర్ పరిధిలోని కిష్టారావుపల్లెలో జూన్ 12న ఈ ఘటన జరిగింది. పొలం పనిలో ఉన్న దళితులపై పక్కపొలం తెనుగు కులానికి చెందిన మామిల్ల దేవయ్య, అతని భార్య, కొడుకు, వీరి సమీప బంధువు కలిసి వారి కండ్లలో కారంపొడి చల్లి, వాళ్లు తేరుకునేలోగానే గొడ్డళ్లతో నరికి చంపారు. దళిత కుటుంబానికి చెందిన భూమిని అక్రమంగా వేరేవారికి పట్టాచేసిన రెవెన్యూ సిబ్బంది కారణంగా ఈ ఘటన జరిగింది. రెవెన్యూ సిబ్బందిపై చర్య తీసుకోవాలని, హంతకులను కఠినంగా శిక్షించాలని దళిత సంఘాల నాయకులు కిష్టారావుపల్లెలోని అంబేద్కర్ విగ్రహం వద్ద ధర్నా చేశారు.

### దళిత గిరిజన సింహగర్జన సభ

ఎస్.సి, ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టాన్ని బలహీనపరుస్తూ సుప్రీంకోర్టు మార్చ్ 20న ఇచ్చిన తీర్పును నిరసిస్తూ ఎం.ఆర్.పి.ఎస్, ఆధ్వర్యంలో దళిత, గిరిజన సింహగర్జన సభ వరంగల్‌లోని ప్రకాష్‌రెడ్డి పేటలో జరిగింది. ఈ సభకు తెలంగాణలోని అన్ని జిల్లాల నుండి వేలాది మంది దళితులు, ఆదివాసులు హాజరయ్యారు. ఈ సభకు ముఖ్య అతిథిగా మాజీ లోక్‌సభ స్పీకర్ మీరాకుమార్ హాజరయ్యారు. వక్తలు బిజెపి అధికారంలోకి వచ్చాక దళిత, ఆదివాసీ ప్రజలపై దాడులు పెరిగాయన్నారు. మార్చ్ 20న సుప్రీంకోర్టు ఎస్.సి, ఎస్.టి అత్యాచార నిరోధక చట్టాన్ని నీరుగార్చే విధంగా తీర్పు చెప్పడం అన్యాయమన్నారు. గత నాలుగేళ్లలో దళితులపై దాడులు 66 శాతం పెరిగాయన్నారు. దళిత, గిరిజనుల రిజర్వేషన్లను తగ్గించి, రాజ్యాంగపరమైన హక్కులను కాలరాసే కుట్ర కేంద్ర ప్రభుత్వం చేస్తోందని ఎంఆర్‌పిఎస్ వ్యవస్థాపక అధ్యక్షుడు మందకృష్ణ మాదిగ ఆగ్రహం వ్యక్తం చేశారు.

### పాత్రికేయుడు ఆదిరాజు మృతి

తెలంగాణ తొలిదశ ఉద్యమకారుడు, పాత్రికేయుడు ఆదిరాజు వెంకటేశ్వరరావు (78) జూన్ 15న కన్నుమూశారు. ఆదిరాజు ఖమ్మం జిల్లా కామేపల్లి మండలంలోని పండితాపురంలో 1938లో జన్మించారు. ఆయన నాలుగు దశాబ్దాలపాటు ఆంధ్రజ్యోతితో పాటు పలు తెలుగు, ఇంగ్లిష్ పత్రికల్లో, సమాచార భారతి చీఫ్‌గా పనిచేశారు. ఆదిరాజు తెలుగు, ఇంగ్లిష్ భాషల్లో 15 పుస్తకాలు రాశారు. తార్కుండే కమిటీకి సహాయకుడుగా పనిచేసిన ఆయన 1975-77 కాలంలో అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు ప్రభుత్వం సాగించిన బూటకపు ఎన్‌కౌంటర్ల ఘటనలపై రాసిన పుస్తకం సంచలనాత్మకమైంది.

### ఆదివాసి చట్టాలపై అవగాహన సదస్సు

ఉస్మానియా యూనివర్సిటీలోని విశ్రాంత గృహంలో ఆదివాసీ విద్యార్థి సంఘం ఆధ్వర్యంలో 'ఆదివాసీ చట్టాలపై' జూన్ 25న అవగాహన సదస్సు నిర్వహించారు. ఈ సదస్సుకు ముఖ్య అతిథిగా హాజరైన జస్టిస్ నర్సింహారెడ్డి ఆదివాసుల హక్కుల అమలు విషయంలో ప్రభుత్వాలు నిర్లక్ష్యం వహిస్తున్నాయని అన్నారు. ఆదివాసులు బ్రిటిష్ హయాం నుంచే భూమి, నివాసం, అటవీ హక్కులు కలిగి ఉన్నారని అన్నారు. భారత రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పుడు ఆదివాసులకు ప్రత్యేకంగా అయిదు, ఆరు షెడ్యూల్స్‌ను ఏర్పాటు చేశారని తెలిపారు. చట్టాలపై అవగాహన పెంచుకొని ప్రభుత్వాన్ని ప్రశ్నించాలన్నారు. ఆదివాసి ప్రాంతాలపై ప్రభుత్వం ప్రత్యేక దృష్టి సారించాలన్నారు.

### ఉక్కు కోసం అఖిలపక్షం రహదారుల దిగ్బంధం

రాష్ట్ర విభజన చట్టం షెడ్యూలు-13లో పొందుపరిచిన కడపలో ఉక్కు పరిశ్రమ కోసం జూన్ 27న అఖిలపక్షం నాయకులు కడపలోని ముంబాయి-చెన్నై జాతీయ రహదారిపై నిరసన కార్యక్రమం చేపట్టారు. ఉక్కు పరిశ్రమ నిర్మించాలని, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. రోడ్డుకిరువైపులా భారీగా వాహనాలు నిలిచిపోయాయి. నిరసనకారులను పోలీసులు అరెస్టు చేశారు. వీ

### బ్యాంకు ఉద్యోగుల సమ్మె

దేశవ్యాప్తంగా బ్యాంకు ఉద్యోగుల 48 గంటల సమ్మెతో బ్యాంకింగ్ కార్యకలాపాలు స్థంబించాయి. బ్యాంకు ఉద్యోగులకు 2 శాతం మాత్రమే ఇంక్రిమెంట్‌గా ప్రతిపాదిస్తూ భారతీయ బ్యాంకుల అసోసియేషన్ (ఎస్.బి.ఏ) నిర్ణయాన్ని నిరసిస్తూ దేశ వ్యాప్తంగా బ్యాంకు ఉద్యోగులు మే 30, 31 తేదీల్లో సమ్మెచేశారు. ప్రభుత్వ రంగ బ్యాంకులకు చెందిన 10 లక్షల మంది ఉద్యోగులు సమ్మెలో పాల్గొన్నారు. ఈ సమ్మెకు కొన్ని ప్రైవేట్ బ్యాంకులు కూడా మద్దతు పలికాయి. ఈ సమ్మెలో 21 ప్రభుత్వ రంగ బ్యాంకులు, 13 ప్రైవేట్ బ్యాంకులు, 6 విదేశీ బ్యాంకులు, 56 ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులకు చెందిన 10 లక్షల మంది ఉద్యోగులు సమ్మెలో పాల్గొన్నట్లు ఏఐబిఇఏ, యుఎఫ్‌బియు అనే యూనియన్‌లు తెలిపాయి.

### శ్రీనగర్‌లో పత్రికా సంపాదకుడి కాల్చివేత

కశ్మీర్‌లో శాంతి చర్చల్లో కీలక పాత్ర పోషిస్తున్న సీనియర్ పాత్రికేయులు, 'రైజింగ్ కశ్మీర్' పత్రిక సంపాదకుడు షుజాత్ బుఖారీని శ్రీనగర్‌లోని తన కార్యలయం బయటే మిలిటెంట్లుగా బావిస్తున్న వారు జూన్ 14న కాల్చి చంపారు. ఆయన భద్రతా సిబ్బంది ఇద్దరు కూడా ఈ కాల్పుల్లో మృతిచెందారు. ఈ ఘటనను పాత్రికేయులు ముక్తకంఠంతో ఖండించారు. దేశవ్యాప్తంగా, ముఖ్యంగా కశ్మీర్‌లో పాత్రికేయులకు విధి నిర్వహణ పెనుసవాలుగా మారిందని ఎడిటర్స్ గిల్డ్ ఆందోళన వ్యక్తం చేసింది. అదే రోజు ఈద్ వేడుకలకు ఇంటికి వెళుతున్న జవాన్‌ను మిలిటెంట్లు కిడ్నాప్ చేసి హత్యచేశారు. బాండీపొరా జిల్లాలో సైనికులు, మిలిటెంట్ల మధ్య జరిగిన ఎన్‌కౌంటర్లో ఇద్దరు మిలిటెంట్లతో పాటు ఒక జవాన్ మృతిచెందాడు.

### ఉత్తరాది రాష్ట్రాల్లో సమ్మెకు దిగిన రైతులు

రైతులకు నిరంతరం కనీస ఆదాయం లభించేలా చేయాలని, స్వామినాథన్ కమిటీ సిఫార్సుల మేరకు పంటలకు కనీస మద్దతు ఇవ్వాలని, వ్యవసాయ రుణాలు మాఫీ చేయాలని రైతులు డిమాండ్ చేస్తూ దేశవ్యాప్తంగా పలు రాష్ట్రాల రైతులు ఏకంగా పది రోజుల పాటు సమ్మెకు పిలుపునిచ్చారు. జూన్ 1న ఈ సమ్మె ప్రారంభం కాగా పలు రాష్ట్రాల్లో రైతులు పట్టణాలకు పాలు, కూరగాయలు, పండ్లు ఇతర వ్యవసాయ ఉత్పత్తుల సరఫరాను నిలిపేశారు. కిసాన్ ఏక్తా మంచ్, రాష్ట్రీయ కిసాన్ మహాసంఘ్ (ఆర్‌కెఎం) పేరిట దాదాపు 172 రైతు సంఘాలు ఏకమై ఈ ఆందోళనను నిర్వహిస్తున్నాయి. పంజాబ్, హరియానా రాష్ట్రాల్లో అన్నదాతలు వ్యవసాయ ఉత్పత్తుల సరఫరా నిలిపేయడంతో కూరగాయల ధరలు చుక్కలను తాకుతున్నాయి. కేంద్రం అనుసరిస్తున్న రైతు వ్యతిరేక విధానాలను నిరసిస్తూ ఈ ఆందోళన చేస్తున్నట్లు పలు రైతు సంఘాలు వెల్లడించాయి.

### ఛత్తీస్‌గఢ్‌లో ముగ్గురు నక్సల్స్ ఎన్‌కౌంటర్

ఛత్తీస్‌గఢ్‌లోని సుకుమా జిల్లాలో జూన్ 14న భద్రతా దళాలు జరిపిన ఎదురుకాల్పుల్లో ముగ్గురు నక్సల్స్ మృతిచెందారు. చింతగుఫా పోలీస్‌స్టేషన్ పరిధిలోని గత్తాపడ్, టొంకన్‌పల్లి గ్రామాల మధ్య ఉదయం 10 గంటల సమయంలో ఈ ఘటన జరిగినట్లు సుకుమా ఎస్.పి. అభిషేక్ మీనా వెల్లడించారు. రాజధాని రాయపూర్‌కు 500 కిలోమీటర్ల దూరంలో గల చింతగుఫా అటవీ ప్రాంతంలో జిల్లా రిజర్వు గార్డ్స్, స్పెషల్ టాస్క్‌ఫోర్స్ బృందాలు గాలింపు చేపట్టిన సమయంలో ఎదురుకాల్పులు చోటుచేసుకున్నాయి.

### కశ్మీర్‌లో గవర్నర్ పాలన

జమ్మూ కశ్మీర్‌లో రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ గవర్నర్ పాలన విధించారు. పి.డి.పి.కి బి.జె.పి. మద్ధతు ఉపసంహరించుకుంది. దీంతో ముఖ్యమంత్రి పదవికి మెహబూబా ముఫ్తీ రాజీనామా చేశారు. రాష్ట్రంలో గవర్నర్ పాలన అమలుచేయాలని రాష్ట్రపతి కోవింద్‌కు ఎన్.ఎన్. వోహ్రా చేసిన సిఫారసుకు రాష్ట్రపతి జూన్ 20న ఆమోద ముద్రవేశారు. జమ్మూ కశ్మీర్‌కు స్వయం ప్రతిపత్తి అధికారం ఉండడంతో మిగతా రాష్ట్రాలకు భిన్నంగా గవర్నరే పాలన బాధ్యతలు చూసుకుంటారు. వోహ్రా ఈ బాధ్యతలు నిర్వహించడం ఇది నాలుగోసారి. జమ్మూ కశ్మీర్‌లో గవర్నర్ పాలన విధించడం ఇది ఎనిమిదో సారి. 1977, మే 26న తొలిసారిగా కశ్మీర్‌లో గవర్నర్ పాలన విధించారు. 105 రోజుల పాటు కొనసాగింది. నేషనల్ కాన్ఫరెన్స్‌కు చెందిన షేక్ మహ్మద్ అబ్దుల్లా ప్రభుత్వానికి ఇచ్చిన మద్దతు ఉపసంహరించుకోవడంతో గవర్నరు పాలన విధించారు. అనంతరం 1986 మార్చి 6న రెండో సారి గవర్నరు పాలన విధించారు. 246 రోజుల పాటు ఇది కొనసాగింది. ఆ తర్వాత 1990లో మూడోసారి, 1996లో నాలుగో సారి, 2002లో ఐదో సారి, 2008లో ఆరోసారి, 2015లో ఏడోసారి గవర్నరు పాలన విధించారు.

### భీమా-కోరేగాం కేసులో ప్రజాస్వామిక వాదుల అరెస్టులు

మహారాష్ట్రలోని భీమా-కోరేగాంలో జరిగిన అల్లర్లకు కారకులుగా చూపుతూ ఐదుగురు ప్రజాస్వామిక వాదులను పోలీసులు జూన్ 6న అరెస్టు చేశారు. ఈ అరెస్టును ఖండిస్తూ పలు ప్రజా సంఘాలు జూన్ 8న ఢిల్లీలో నిరసన తెలిపాయి. ఈ కేసులో దళిత ఉద్యమ నేత, సంపాదకుడు సుధీర్ దావ్‌లే, నాగ్‌పూర్ విశ్వవిద్యాలయం ఆంగ్ల విభాగం అధిపతి ప్రొఫెసర్ సోమా సేన్, సామాజిక కార్యకర్త మహేష్ రౌత్, రాజకీయ ఖైదీల విడుదల కమిటీ సభ్యుడు రోనా విల్సన్, ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ పీపుల్స్ లాయర్స్ సభ్యుడు సురేంద్ర గాడ్లింగ్‌లను పోలీసులు అరెస్టు చేశారు. రాజ్యాంగ హక్కుల కోసం పోరాడుతున్న వారిని ప్రభుత్వం మావోయిస్టులన్న ముద్ర వేస్తోందని వక్తలు ఆరోపించారు. వారిని ఎటువంటి కేసులు లేకుండా విడుదల చేయాలని డిమాండ్ చేశారు.

### ఢిల్లీ లెఫ్టినెంట్ కార్యాలయంలో ఆప్ దీక్ష

ముఖ్యమంత్రి కేజ్రీవాల్ ఢిల్లీలో ఐఏఎస్ అధికారులు చేస్తున్న సమ్మె విరమణకు ప్రధాని జోక్యం చేసుకోవాలని కోరుతూ లేఖ రాశారు. తమ డిమాండ్ల సాధనకు ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ (ఎల్‌జి) కార్యాలయంలో జూన్ 11 నుండి చేపట్టిన ధర్నా జూన్ 19న ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు చేపట్టిన నిరాహార దీక్ష ముగిసింది. అభివృద్ధికి ఆటంకాలను తొలగించేందుకు లెఫ్టినెంట్ గవర్నర్ ఎలాంటి చర్యలూ తీసుకోవట్లేదనీ, మూడు నెలలుగా మంత్రులు నిర్వహిస్తున్న సమావేశాలకు అధికారులు హాజరు కావట్లేదని వివరిస్తూ సీఎం కేజ్రీవాల్ ప్రధానికి లేఖ రాశారు. ఐఏఎస్‌ల సమ్మె కారణంగా మురుగుకాలువల పూడికతీత, క్లీనిక్‌ల ఏర్పాటు నిలిచిపోయినట్లు పేర్కొన్నారు. జూన్ 17న ఆమ్ ఆద్మీ పార్టీ వేల మంది కార్యకర్తలు ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ నివాసం నుంచి ప్రధానమంత్రి నరేంద్రమోదీ నివాసం వరకు ర్యాలీ నిర్వహించారు. జూన్ 19న ఐఏఎస్ అధికారులతో ఆప్ మంత్రులు భేటీ అయి సమస్యను చర్చల ద్వారా పరిష్కరించుకోవాలని కోరుతూ లెఫ్టినెంట్ గవర్నర్ సి.ఎం కేజ్రీవాల్‌కు లేఖ రాశారు. దీంతో కేజ్రీవాల్ దీక్షను విరమించారు.

### జమ్మూకశ్మీర్‌లో నిత్యం ఎన్‌కౌంటర్‌లు

జమ్ముకశ్మీర్‌లో అనంతనాగ్ జిల్లాలో జూన్ 22న సైన్యానికి మిలిటెంట్లకు మధ్య జరిగిన కాల్పుల్లో నలుగురు మిలిటెంట్లు, ఓ పోలీసు, ఓ పౌరుడు కూడా ప్రాణాలు కోల్పోయారు. మిలిటెంట్లు ఇస్లామిక్ స్టేట్ జమ్మూకశ్మీర్(ఐఎస్‌జెకె) సంస్థకు చెందిన వారుగా పోలీసులు గుర్తించారు. మృతుల్లో ఐఎస్‌జెకె చీఫ్ దావూద్ కూడా ఉన్నట్లు డిజిపి ఎస్.పి. వైద్ వెల్లడించారు. జూన్ 24న కల్గాం జిల్లా చద్దర్ ప్రాంతంలో రాష్ట్రీయ రైఫిల్స్ బెటాలియన్‌లకు, మిలిటెంట్లకు మధ్య జరిగిన కాల్పుల్లో ముగ్గురు మిలిటెంట్లు మృతిచెందారు. వీ

### ఇటలీలో సంకీర్ణ ప్రభుత్వం

ఇటలీలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. ప్రధానమంత్రిగా గిసెప్ కాంటెను ఇటలీ అధ్యక్షుడు సెర్జియో మాటెరెల్లా బాధ్యతలు అప్పగించారు. ఆపద్ధర్మ ప్రభుత్వ ఏర్పాటును నివారించే యత్నంలో కాంటె నేతృత్వంలోని ఫైవ్‌స్టార్ మూవ్‌మెంట్ (ఎం5ఎస్), భాగస్వామ్య పక్షం మితవాద లీగ్‌తో తిరిగి చర్చలు జరిపేందుకు అంగీకరించిన నేపథ్యంలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు జరిగింది.

### స్పెయిన్‌కు నూతన ప్రధాని

స్పెయిన్‌లో ప్రధాని మారియాస్ రాజోయ్‌పై పెట్టిన అవిశ్వాస తీర్మానం నెగ్గింది. దీంతో ఆయన ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేశారు. ప్రతిపక్ష సోషలిస్ట్ పార్టీ నేత పెడ్రో శాంచెజ్ ఈ అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించారు. రాజోయ్ పదవి నుంచి తప్పుకోవడంతో రాజోయ్ ప్రధానమంత్రిగా ఎన్నికయ్యే అవకాశం ఉంది. అవినీతి కేసులో పీపుల్స్ పార్టీ కోశాధికారి లూయిస్ బార్సెనస్‌కు మాడ్రిడ్ హైకోర్టు 33 ఏళ్ల శిక్ష విధించింది. ఈ ఆరోపణలు ప్రధాని రాజోయ్‌ని కూడా చుట్టుముట్టాయి. జూన్ 1న జరిగిన 180 సభ్యులు ఉన్న పార్లమెంట్‌లో ఓటింగ్ నిర్వహించగా అవిశ్వాసానికి మద్దతుగా 160 మంది ఓటు వేశారు. రాజోయ్ 2011 నుంచి స్పెయిన్ ప్రధానిగా ఉన్నారు.

### నెతన్యాహు ఫ్రాన్స్ పర్యటన - నిరసన

ఫ్రాన్స్ పర్యటన నిమిత్తం వచ్చిన ఇజ్రాయిల్ ప్రధాని బెంజమిన్ నెతన్యాహు జూన్ 6న పారిస్‌కు వచ్చారు. ఈ సందర్భంగా ఫ్రాన్స్ అధ్యక్షుడు మాక్రన్ గ్రాండ్ పాలెస్‌తో భేటీ అయ్యారు. ఇరుపక్షాల మధ్య ద్వైపాక్షిక సంబంధాల బలోపేతంపై చర్చించారు. అయితే నెతన్యాహు పర్యటనపై పారిస్ పౌరులు నిరసన తెలిపారు. ఆయన రాజధాని పారిస్‌కు వచ్చినప్పుడు 'నెతన్యాహూ గో బ్యాక్' అంటూ నినాదాలు చేశారు. యుద్ధనేరాలకు పాల్పడుతూ ఎందరో అమాయక పాలస్తీనీయుల ప్రాణాలు తీస్తున్న నెతన్యాహూ తమ భూభాగంలోకి అడుగు పెట్టొద్దంటూ ఆందోళనకారులు నినదించారు. వీధుల్లోకి చేరుకొని ప్లకార్డులు, బ్యానర్లు పట్టుకొని నెతన్యాహూకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శలు చేశారు.

### ఆస్ట్రియాలో జాత్యహంకారం

ఐరోపా దేశమైన ఆస్ట్రియాలో జాత్యహంకార ఘటనలు పెరిగిపోయాయి. దీనికి ప్రభుత్వమే ఆజ్యం పోస్తోంది. ఆస్ట్రియాలోని ఏడు మసీదులను మూసివేయాలని జూన్ 6న ప్రభుత్వం నిర్ణయించింది. అంతేకాకుండా ఈ మసీదుల్లో నమాజ్ చేయిస్తున్న ఇమామ్‌లను కూడా ఆస్ట్రియా నుంచి బహిష్కరించనున్నట్లు తెలిపింది. వియన్నాలో ఉన్న టర్కీ మసీదును మూసివేస్తున్నట్లు ఆస్ట్రియా ఛాన్సలర్ సెబాస్టియన్ కుజ్ తెలిపారు. అరబ్ మత పెద్దలు నడుపుతున్న మరో ఆరు సమీదులను కూడా మూసివేయ నున్నారు. దీనికి కారణం ఆస్ట్రియాలోని ఇస్లామిక్ సంస్థలకు ఇతర దేశాల నుంచి నిధులు అందుతున్నాయని తెలిపింది. 2015లో రూపొందించిన చట్ట ప్రకారం విదేశాలనుంచి ఇస్లాం మత సంస్థలకు అందుతున్న నిధులను ఆపేయాలని, ఇస్లామిక్ రాజకీయాలకు చరమగీతం పాడాలని ఆస్ట్రియా నిర్ణయించింది.

### జి-7 సమావేశాలు

జూన్ 9 నుంచి జి-7 దేశాల సదస్సు కెనడాలో జరిగాయి. అయితే ఈ సమావేశాల్లో అమెరికా, ఇతర సభ్య దేశాల మధ్య భేదాభిప్రాయాలు బహిర్గతమయ్యాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన జి-7 దేశాల జట్టులో రష్యా మళ్లీ చేరొచ్చంటూ అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ఆహ్వానించారు. క్రిమియా సంక్షోభం నేపథ్యంలో రష్యాను జి-7 దేశాల కూటమి నుంచి బహిష్కరించారు. అమెరికా అధ్యక్షుడు రష్యాకు మద్దతు తెలపడంతో ఇటలీ మినహా ఇతర దేశాలు తీవ్రంగా వ్యతిరేకించాయి. ఈ సమావేశంలో ట్రంప్ వాణిజ్య వ్యవహారాలను అక్రమమని సదస్సు సభ్యులు తీవ్రంగా వ్యాఖ్యానించింది.

### అమెరికా - ఉత్తర కొరియా అధినేతల సమావేశం

ఉత్తర కొరియా అధ్యక్షుడు కిమ్ జోంగ్ ఉన్, అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ మధ్య తొలిసారిగా భేటీ జరిగింది. జూన్ 12న సింగపూర్‌లో వీరిద్దరు సమావేశమయ్యారు. ఇరు దేశాలు అణ్వాయుధాల ఉత్పత్తిలో పోటీ పడుతూ రెచ్చగొట్టే ధోరణిలో మాట్లాడి ప్రపంచ శాంతిపై ఆందోళన వ్యక్తమవుతున్న నేపథ్యంలో ఈ భేటీ చారిత్రకమైనదిగా ప్రపంచ దేశాలు వర్ణించాయి. ఈ భేటీలో ఇరు దేశాల నేతలు పలు ఒప్పందాలపై సంతకాలు చేశారు.

### నైజీరియాలో ఆత్మాహుతి దాడులు

నైజీరియాలో జూన్ 25న రెండు వర్గాల మధ్య ఘర్షణలు చెలరేగాయి. ఈ ఘర్షనల్లో ఎనభై ఆరు మంది మరణించారు. పశువులు మేపుకునే రెండు వర్గాలకు చెందిన రైతుల మధ్య ఈ ఘర్షణలు జరిగాయి. ఈ అల్లర్లలో దాదాపు 50 ఇళ్లు దహనమయ్యాయి. అనేక వాహనాలు ధ్వంసమయ్యాయి. ఘర్షణ నేపథ్యంలో సైన్యం కర్ఫ్యూ విధించి అల్లర్లు విస్తరించకుండా కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేసింది.

### అఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్ల దాడులు

అఫ్ఘనిస్తాన్‌లో సెక్యూరిటీ చెక్‌పోస్టులపై తాలిబన్ దళాలు దాడులు జరిపాయి. జూన్ 20న జరిగిన దాడుల్లో దాదాపు ముప్పై మంది అఫ్గాన్ సైనికులను మరణించారు. రంజాన్ పండుగ ముగిసిన రెండు రోజులకే ఈ దాడులు జరిగాయి.

### పెరుగుతున్న శరణార్థులు

ప్రపంచ వ్యాప్తంగా దేశాలలో జరుగుతున్నం అంతర్యుద్ధాల వల్ల శరణార్థుల సంఖ్య విపరీతంగా పెరిగిపోతోంది. ఐక్యరాజ్య సమితి వెల్లడించిన వివరాల ప్రకారం గత ఏడాది ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 6.85 కోట్ల మంది తమ స్వదేశాలను వదిలిపెట్టి ఇతర ప్రాంతాలకు వలస వెళ్లిపోయారు. నిత్యం అల్లర్లు, యుద్ధాలు, మారణహోమాలతో ప్రజలు వణికిపోతున్నారు. ప్రపంచం మొత్తం మీద ప్రతి 110 మందిలో ఒకరికి బలవంతంగా తమ దేశాన్ని విడిచి పెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇతర ప్రాంతాలకు వలస వెళ్తున్న వారిలో 70 శాతం మంది కేవలం పది దేశాలకు చెందిన వారే కావడం గమనార్హం. ఒక్క 2017లోనే 1.62 కోట్ల మంది ఒక దేశం నుంచి మరో దేశానికి వెళ్లినట్లు ఐరాస పేర్కొంది. మయన్మార్, సిరియా, అఫ్ఘనిస్తాన్ లాంటి దేశాల్లో హింసాత్మక ఘటనలు జరుగుతున్నాయి.

### టర్కీ అధ్యక్షుడిగా మళ్లీ ఎర్డోగన్

టర్కీ అధ్యక్ష పదవికి జూన్ 24న ఎన్నికలు జరిగాయి. జూన్ 25న ముగిసిన ఓట్ల లెక్కింపు ముగిసింది. ఐదు కోట్ల ఆరవై లక్షల మంది ఓటర్లు తమ ఓటును వినియోగించుకున్నారు. ఈ ఎన్నికల్లో టర్కీ అధ్యక్షుడు జస్టిస్ అండ్ డెవలప్‌మెంట్ పార్టీ నేత రిసెప్ తయ్యప్ ఎర్డోగన్ ఘన విజయం సాధించారు. లెకించిన ఓట్లలో 53.84 శాతం ఓట్లు ఎర్డొడన్‌కు వచ్చాయి. ఆయన సమీప ప్రత్యర్థి నేషనల్ అలియన్స్ పార్టీ నేత ముహర్రమ్ ఇన్స్‌కు 31 శాతం ఓట్లు వచ్చాయి. దీంతో మరోసారి ఎర్డోగన్ టర్కీ అధ్యక్ష పదవీ బాధ్యతలు చేపట్టనున్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(మే 1 నుండి మే 31, 2018 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (925), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (885) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1810)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 29 | 36 | 8 | 12 | 6 | 3 | 2 | 2 | 2 | 1 | 2 | 26 | 38 | – | – | – | 3 | 6 |
| హైదరాబాద్ | – | – | – | 10 | 13 | 2 | 5 | 1 | 1 | 3 | 4 | 6 | 7 | 2 | 22 | 16 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 3 | – | 7 | 11 | 3 | 2 | – | 1 | 1 | 3 | 3 | 3 | 2 | 21 | 9 | – | – | – | – | 15 |
| ఖమ్మం | – | 3 | – | 3 | 7 | 1 | 5 | – | 2 | 1 | 1 | – | 2 | 3 | 20 | 9 | – | – | – | – | 14 |
| మహబూబ్‌నగర్ | – | 3 | – | 6 | 8 | 2 | 4 | 4 | 2 | – | 6 | 5 | 12 | 10 | 45 | 8 | – | – | – | – | 8 |
| మెదక్ | – | 10 | 2 | 6 | 8 | 3 | 1 | 2 | 1 | 3 | 4 | 5 | 9 | 10 | 12 | 20 | – | – | – | 3 | 1 |
| నల్గొండ | – | 2 | – | 3 | 6 | 3 | 2 | 1 | – | 1 | 1 | 2 | 2 | 7 | 18 | 13 | – | – | – | – | 23 |
| నిజామాబాద్ | – | 2 | – | 4 | 6 | – | 1 | – | 1 | 1 | 1 | 3 | – | 3 | 16 | 8 | – | – | – | – | 4 |
| వరంగల్ | – | 10 | 1 | 2 | 2 | 4 | 9 | 3 | 1 | 4 | 2 | 2 | 4 | 15 | 21 | 20 | – | – | – | 2 | 1 |
| వికారాబాద్ | – | 3 | – | 5 | 5 | – | – | – | – | – | 2 | 1 | 1 | 2 | 9 | 6 | – | – | – | – | 5 |
| **తెలంగాణ** | **1** | **38** | **3** | **75** | **102** | **26** | **41** | **17** | **12** | **16** | **26** | **29** | **41** | **56** | **210** | **147** | **-** | **-** | **-** | **8** | **77** |
| అనంతపురం | – | 6 | 1 | 25 | 45 | 1 | 3 | – | – | 3 | 1 | 3 | 2 | 5 | 31 | – | – | – | – | 1 | 13 |
| చిత్తూరు | – | – | – | 3 | 4 | 8 | 4 | – | 4 | 2 | 3 | 2 | 3 | – | 13 | 2 | – | – | – | – | 5 |
| కడప | – | – | – | – | 2 | – | – | – | – | 3 | 3 | 3 | – | 4 | 11 | 6 | – | – | – | – | 1 |
| గుంటూరు | – | – | – | 2 | 5 | 1 | 4 | 1 | – | 1 | 1 | 1 | – | 6 | 22 | 12 | – | – | – | – | 9 |
| కృష్ణా | – | – | – | 4 | 1 | 1 | 2 | 3 | – | – | 1 | 1 | 1 | 4 | 14 | 8 | – | – | – | – | – |
| కర్నూలు | – | – | – | 10 | 5 | 1 | 2 | – | 1 | 1 | 3 | 3 | – | 5 | 15 | 7 | – | – | – | – | 4 |
| తూర్పు గోదావరి | – | 1 | – | 3 | 6 | 1 | 4 | 1 | – | 7 | 4 | 2 | – | 5 | 33 | 17 | – | – | – | – | 27 |
| ప్రకాశం | – | – | – | 7 | 8 | 2 | – | 1 | – | 3 | 2 | 4 | 2 | 2 | 27 | 9 | – | – | – | – | 7 |
| శ్రీకాకుళం | – | – | – | 7 | 15 | 4 | 8 | 3 | – | 2 | – | 2 | 7 | 3 | 25 | 13 | – | – | – | – | 12 |
| పశ్చిమ గోదావరి | – | – | – | – | 1 | – | 2 | – | – | – | – | 2 | – | 4 | 11 | 29 | – | – | – | – | 4 |
| నెల్లూరు | – | – | – | 2 | 3 | – | 1 | – | – | – | 3 | 1 | 1 | 3 | 21 | 12 | – | – | – | – | 4 |
| విజయనగరం | – | – | – | 2 | 3 | 2 | 3 | 1 | – | 2 | 1 | 1 | 1 | 2 | 14 | 8 | – | – | – | – | 9 |
| విశాఖపట్నం | – | – | – | 2 | 11 | – | – | – | 1 | 4 | 1 | 2 | – | – | 14 | 11 | – | – | – | 9 | 3 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **7** | **1** | **67** | **109** | **21** | **33** | **10** | **6** | **28** | **23** | **27** | **17** | **43** | **251** | **134** | **-** | **-** | **-** | **10** | **98** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |
| ప్రపంచీకరణ ప్రాభవంలో... | విద్యాభూషణ్ | 120 |
| కార్టూన్లలో మార్క్స్ | రీయూస్ | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం-మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

## సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |
| కొలిమి రవ్వలు | గౌరి లంకేశ్ రచనలు | 150 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |
| మార్క్సిస్టు నిఘంటువు-1 | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 350 |
| మార్క్సిస్టు పదకోశం | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 50 |

## చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| మహాత్మా జ్యోతిరావ్ ఫూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| 30 ఇయర్స్ దండకారణ్య కల్చరల్ మూవ్‌మెంట్ | ఎన్.ఎం. చేతనా | 250 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |

## కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

## డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 204 - July 2018 • **ISSN 2231-6892**
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/6/2018 • Postal Regn. No. HD/1100/2017-19

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ | హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ | 040-66131071 |
| ఫస్ట్ లక్కీ పాన్ షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ | 9848672831 |
| సుధాకర్ బుక్ స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక | 9949337605 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్ | రామ్‌నగర్ గుండు | 9502964995 |
| భవాని బుక్ స్టాల్ | శివం రోడ్ | 9849836996 |
| శ్రీభవాని బుక్ స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) | 9640712555 |
| ఓరియన్ బుక్ స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) | 8977995537 |
| రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమాండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహిదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలెబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీలక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| లక్ష్మణ్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 93910 12051 |
| మల్లిఖార్జున్ బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| బాల్‌రెడ్డి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| మహాలక్ష్మి బుక్‌స్టాల్ | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్ స్టాల్, కూల్ డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| శరత్ బుక్ స్టాల్ | షాప్ నం. 3, ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుజూరాబాద్ | 98662 73720 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్ స్టాల్ | శివాలయం వీధి, ప్రొద్దటూరు | 81210 02112 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రీ బుక్‌హౌస్ | మజీద్ వీధి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్ సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |

Date of Posting : 29th, 30th

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao